# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక తెలుగు మాస పత్రిక

సంపుటి : 6 సంచిక : 4 హైదరాబాద్ 81 ఏప్రిల్ 2008 పేజీలు : 56 రు. 10

వీక్షణం 81 రాజకీయార్థిక, సామాజిక తెలుగు మాసపత్రిక
సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

ఏప్రిల్ 2008
సంపుటి : 6
సంచిక : 4

## సంపాదకీయం

# కేంద్ర బడ్జెట్

ఎన్నికల బడ్జెట్‌గా, పేద, మధ్యతరగతి వర్గాలకు, ఉద్యోగులకు, మైనారిటీలకు, వెనుకబడిన ప్రాంతాలకు, ముఖ్యంగా రైతాంగానికి అనేక వరాలు కురిపించిన బడ్జెట్‌గా అనేకమంది వ్యాఖ్యాతల నుంచి ప్రశంసలు పొందుతున్న 2008-09 కేంద్ర బడ్జెట్ నిజానికి ఎన్నో లోపాలతో ఉంది. బహుశా ప్రస్తుత భారత పాలకవర్గాలకు, ముఖ్యంగా కాంగ్రెస్ నాయకత్వంలోని యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్‌కు ఎన్నికల సంవత్సరంలో అంతకన్న మరొకరకమైన బడ్జెట్‌ను ప్రవేశపెట్టడం సాధ్యం కాదు కూడ. రానున్న లోక్‌సభ ఎన్నికలలో ప్రజలను మళ్లీ ఆకర్షించి భ్రమల్లో ముంచడానికి, మరొకసారి అధికారానికి రావడానికి అవసరమైన వాగ్దానాలను ఎన్నిటినో ఈ బడ్జెట్‌లో యుపిఎ ప్రభుత్వం కురిపించింది. ఆ వాగ్దానాలు నిజంగా అమలులోకి వస్తాయా, గత అరవై సంవత్సరాలుగా ప్రభుత్వాలు, పాలకవర్గాలు చేస్తూ వస్తున్న ఆకర్షణీయమైన వాగ్దానాలన్నిటి లాగే ఇవి కూడా గాలిమాటలే అయిపోతాయా అతి త్వరలోనే తేలిపోతుంది. కేంద్ర బడ్జెట్ బాగోగుల గురించి వివరమైన వ్యాఖ్యలూ విశ్లేషణలూ లోపలి పేజీల్లో చదవగలరు గాని కొన్ని ప్రధానమైన అంశాల గురించి మాత్రం ఇక్కడ ప్రస్తావించుకోవాలి. అవి, ఒకటి, రైతుల రుణ మాఫీ, రుణ రాయితీ పథకం. రెండు, మైనారిటీలకు, వెనుకబడిన ప్రాంతాలకు ప్రత్యేక కేటాయింపుల గురించి, ఉద్యోగులకు ఆరవ వేతన సంఘ నివేదికను ప్రకటించటం గురించి చేసిన వాగ్దానాలు. మూడు, ఏ బడ్జెట్‌కైనా మౌలిక లక్ష్యమైన సంపద పంపిణీని ఈ బడ్జెట్ అమలు చేసిన తీరు. నాలుగు, ద్రవ్య నిర్వహణ చట్టం పేరుతో, బడ్జెట్ లోటును తగ్గించడం పేరుతో సాంఘిక సేవల రంగపు కేటాయింపులు తగ్గిస్తూ, అదే సమయంలో రక్షణ వ్యయాన్ని విపరీతంగా పెంచుతూ వస్తున్న వైఖరి. ఐదు, మధ్యతరగతికి ఆదాయపు పన్ను పరిమితిని పెంచుతూ కలిగించిన వెసులుబాటు ముసుగు వెనుక బహుళజాతి సంస్థలకు, సంపన్న వర్గాలకు కలిగించిన భారీ వెసులుబాట్లు. రైతుల రుణమాఫీ, రాయితీల గురించి ఒకవైపు పెట్టుబడిదారీ వర్గాల వ్యాఖ్యాతలు గగ్గోలు పెడుతున్నప్పటికీ, నిజంగా ఈ పథకం సాధించగలిగినదీ, రైతులను ఆదుకునేదీ తక్కువ, ప్రచారార్భాటం ఎక్కువ. ఈ పథకం కేవలం సంస్థాగత రుణాలకే వర్తించడం వల్ల, లోపాయకారీగా ఉన్న అనేక నిబంధనలవల్ల నిజంగా ఈ పథకం రుణభారం వల్ల ఆత్మహత్యలు చేసుకుంటున్న చిన్న, సన్నకారు రైతులకు వర్తించేది తక్కువ. ఈ పేరుతో మరొకసారి ధనికరైతులూ పెద్ద రైతులూ ప్రజాధనం నుంచి కొల్లగొట్టిన సొమ్ము తిరిగి చెల్లించనక్కరలేని స్థితి వస్తుంది. రాజీవ్ గాంధీ పాలనాకాలంలో జనార్ధన్ పూజారి ప్రారంభించిన పదివేల కోట్ల రూపాయల లోన్ మేళా పథకంలో బహిరంగంగానూ, బ్యాంకుల జాతీయకరణ తర్వాత పారిశ్రామిక, వ్యాపారవేత్తలు అప్పుతీసుకుని ఎగ్గొట్టిన లక్షకోట్ల రూపాయల విషయంలో ప్రచ్ఛన్నంగానూ జరిగిన అడ్డగోలు ప్రజాధన కైంకర్య వ్యవహారాన్నే పళనియప్పన్ చిదంబరం మరొకసారి బడ్జెట్‌లోనే భాగం చేశారు. వెనుకబడిన ప్రాంతాలకు, మైనారిటీలకు అదనపు ప్రత్యేక కేటాయింపులు చేయడం, వాటిని సరిగా అమలు చేయకపోవడం, అమలైన చోట్ల కేటాయించిన నిధులలో ఏ పదిశాతమో మాత్రమే ప్రకటిత లక్ష్యానికి చేరడం మన దేశంలో ఆనవాయితీగా వస్తున్న అనుభవమే కనుక వాటి గురించి కొత్తగా చెప్పవలసిందేమీ లేదు. ఆరవ వేతన సంఘం నివేదికను ప్రకటిస్తామని ఆర్థికమంత్రి చేసిన ప్రకటనను పెట్టుబడిదారీ వర్గాలు వ్యతిరేకిస్తున్నాయి గాని 1996లో ఐదవ వేతన సంఘం నివేదిక తర్వాత గడిచిన పన్నెండు సంవత్సరాలలో పెరిగిన ధరలవల్ల వేతన సవరణ అవసరం ఎంతో ఉంది. పైగా ఐదవ వేతన సంఘం 30 శాతం ఉద్యోగులను తొలగించాలని చెప్పింది గనుక ప్రస్తుత వేతన సంఘం కూడ ఉద్యోగుల తొలగింపు గురించి మాట్లాడవచ్చు. ఇలా ఒక్కొక్క అంశమూ పరిశీలిస్తూ పోతే ఈ బడ్జెట్ 'పొట్టవిప్పి చూడ పురుగులుండు' అని వేమన ఎప్పుడో చెప్పిన వివేకాన్ని మళ్లీ ఒకసారి గుర్తుచేస్తున్నది. ◆

గౌరవ సంపాదకులు:
**వి. హనుమంతరావు**

సంపాదకులు:
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు
**డి.వి.రామకృష్ణారావు**

సర్క్యులేషన్ మేనేజర్
**వై. రామచంద్రం**
**9949391028**

కంపోజింగ్ & లే ఔట్
**సి. రాజశేఖర్**

ఆఫీస్ అసిస్టెంట్
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు,**
**డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక తెలుగుమాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : reachcdrc@yahoo.com

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్,** హైదరాబాద్.
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

## తెలంగాణ కదలిక

ఎన్నికలు దగ్గరికి వస్తున్న కొద్దీ ప్రజా సమస్యల గురించి, ప్రజలను ఆందోళన పరుస్తున్న అంశాల గురించి మాట్లాడక తప్పని స్థితి అన్ని రాజకీయపక్షాలకూ వస్తుంది. అప్పటిదాకా ఆ సమస్యలతో తమకు సంబంధం లేనట్టు ఆ మాట ఎత్తగూడదని కూచున్న రాజకీయ పక్షాలు కూడా ఆ సమస్యలకు తామే ఏకైక పరిష్కర్తలమన్నట్లు నటించడం మొదలుపెడతాయి. నిజంగా ఆ సమస్యల గురించి ఆలోచించినా ఆలోచించకపోయినా, లోపల ఏదో పెద్ద చర్చ జరిగిపోతున్నట్టు, ఆ పార్టీ అగ్రనాయకులందరూ ఆ సమస్య పరిష్కారం విషయంలో తలలు బద్దలు కొట్టుకుంటున్నట్టు నాటకాలు మొదలుపెడతారు. తెలంగాణ విషయంలో అన్ని పార్టీలలోనూ ప్రస్తుతం జరుగుతున్న ప్రహసనం ఇదే. అన్ని పార్టీల అగ్రనాయకులకు ఎన్నో ఏళ్ల మొద్దునిద్ర తర్వాత హఠాత్తుగా తెలంగాణ ఇప్పుడు గుర్తుకు వచ్చింది. తెలంగాణ ఆకాంక్షలకు ఎన్నో సంవత్సరాలుగా ద్రోహం చేసినవారే, తెలంగాణ ప్రయోజనాలకన్న స్వప్రయోజనాలే ప్రధానంగా భావిస్తూ తెలంగాణను మరిచిపోయిన వాళ్లే అకస్మాత్తుగా తెలంగాణ నాయకులయి పోయారు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం 1969 నుంచీ రాజకీయాలలో ఉన్నవాళ్లు, తెలంగాణ ప్రజా సమితి విద్రోహంలో ప్రధానపాత్ర వహించినవాళ్లు, తెలంగాణ ఆకాంక్షలపై 1996 నుంచి మళ్లీ కదలిక మొదలయిన తర్వాత అప్పటి తెలుగుదేశం ప్రభుత్వాన్ని దిగలాగడానికి తెలంగాణను పావుగా వాడుకున్నవాళ్లు, తెలంగాణ రాష్ట్ర సమితితో పొత్తుకు మధ్యవర్తిత్వం నెరపీ, ఆ తర్వాత మోసానికి కారకులో మౌన సమర్థకులో అయినవాళ్లు, కాబినెట్ పదవి కోసం తెలంగాణను పణంగా పెట్టినవాళ్లు, తెలంగాణ అనే పేరు శాసనసభలో ఎత్తగూడదని శాసించినవాళ్లు, దశాబ్దానికి పైగా మంత్రులుగా ఉండి తెలంగాణకు జరిగిన అన్యాయాలను ఆపడానికి వీసమెత్తు ప్రయత్నించనివాళ్లు, తెలంగాణకు అన్యాయమే జరగలేదని వాదించినవాళ్లు అందరూ ఇప్పుడు హఠాత్తుగా తెలంగాణ పాట పాడుతున్నారు. తెప్పలుగ చెరువునిండి నప్పుడు కప్పల బెకబెక ఎంత పెరుగుతుందో శతకకారుడు చెప్పినమాట గుర్తుతెచ్చుకుని ఈ కప్పలతక్కెడ రాజకీయాల ఆట కట్టించవలసినది ప్రజలే.

దరాబాద్‌కు కొత్త అంతర్జాతీయ విమానాశ్రయం వచ్చింది. పెరుగుతున్న అవసరాలకు తగినట్టుగా మౌలిక సాధన సంపత్తి, సౌకర్యాలు, నిర్మాణాలు జరగవలసిందే. కాని ఆ కొత్త అభివృద్ధి ఏ పాత జీవితాన్ని, అభివృద్ధిని తోసిరాజని, ధ్వంసం చేసి వస్తున్నది, ఎవరి జీవనాన్ని, ఉపాధిని, భద్రతను నాశనం చేసి ఎవరి ప్రయోజనాలను కాపాడుతున్నది అనేవి ఆలోచించవలసిన అంశాలు. ఈ క్రమంలో కొత్త అభివృద్ధి మాయాజాలంతో ప్రభుత్వాలు ప్రజాధనాన్ని ఎంతగా కొత్త పెట్టుబడిదారులకు, బహుళజాతి సంస్థలకు దోచిపెడుతున్నాయి, ఈ క్రమంలో ప్రజాజీవితం ఎంతగా అల్లకల్లోమవుతున్నది, ప్రజల సంక్షేమంకోసం, ప్రజా జీవన అభివృద్ధికోసం వెచ్చించవలసిన నిధులు ఎంతగా దుర్వినియోగమవుతున్నాయి ఆలోచించివలసి ఉంది. హైదరాబాద్ విమానాశ్రయం పేరుమీద శంషాబాద్ చుట్టుపట్ల డజన్లకొద్ది గ్రామాలలో ఎంత జీవన విధ్వంసం జరిగిందో, ఎన్నివందల రైతు కుటుంబాలు విచ్ఛిన్నమైపోయాయో, ఎన్నివేల భూమిలేని నిరుపేద, దళిత, వెనుకబడిన కులాల, ఆదివాసుల కుటుంబాలు బిచ్చగాళ్లుగానో, ప్రతిరోజు కూలికోసం ఎదురుచూడవలసిన అభాగ్యులుగానో మారిపోయారో, ఎన్నివేల ఎకరాల పంట భూములు, ముఖ్యంగా హైదరాబాద్ నగరానికి కూరగాయలు సరఫరా చేస్తుండిన పంట భూములు ధ్వంసమైపోయాయో, రియల్ ఎస్టేట్ వ్యాపారుల దురాశలకు ఎన్ని గ్రామాలు హింసామయమైపోయాయో, అంతర్జాతీయ విమానాశ్రయం వంటి ఆరువేల ఎకరాల భారీ నిర్మాణం, సగటున రోజుకు ముప్పై ఐదువేల మంది ప్రయాణికులు వదిలే వ్యర్థ పదార్థాల వల్ల కలిగే కాలుష్యం, కొన్ని డజన్ల విమానాల రొదవల్ల కలిగే ధ్వని కాలుష్యం వంటి వాటివల్ల జరిగే నష్టాన్ని లెక్కవేయగలమా? ప్రస్తుతతరాలకు, భవిష్యత్ తరాలకు కలిగే ఈ లెక్కించడానికి వీలులేని నష్టాన్ని అలా ఉంచి, ప్రభుత్వం ప్రజాధనం నుంచి స్వయంగా తానే గ్రాంటుగా ఇచ్చిన ధనం, వడ్డీ లేకుండా ఇచ్చిన ధనం, ద్రవ్య సంస్థల దగ్గర ప్రజలు దాచుకున్న ధనాన్ని ఈ వ్యాపార సంస్థకు అప్పగించడం... ఈ నష్టాలన్నీ లెక్కవేయగలిగినప్పుడు గదా ఇది అభివృద్ధి అవునోకాదో చెప్పగలిగేది? పైగా, ఈ నిధులనే ఉపయోగకరంగా వెచ్చిస్తే, సరయిన ప్రజా ప్రత్యామ్నాయ ప్రాధాన్యాలు అమలు చేస్తే, కొద్దిమంది సంపన్నులకు ఈ ఖరీదైన ఆటబొమ్మ అందించడం కన్న ఆ బొమ్మతో ఆడుకునే భాగ్యవంతులు ప్రతి ఒక్కరికీ చుట్టూ కనీసం తినడానికి నాలుగు మెతుకులూ, కట్టుకోవడానికి గజం గుడ్డా, నిలబడడానికి గజం నేలా, నెత్తిమీద గజం కప్పులేని అభాగ్యులు లక్షమంది ఉన్నప్పుడు ఏది అభివృద్ధి? ఎవరి ప్రయోజనాలు ప్రాధాన్యత వహించాలి? ప్రతిఒక్కరికీ సాంఘిక,ఆర్థిక, రాజకీయ న్యాయం, సమానత్వం ఇస్తానని హామీఇచ్చిన సర్వసత్తాక, ప్రజాస్వామిక, లౌకికరాజ్యాంగ పాలనలో ఇది న్యాయమేనా, సమంజసమేనా?

రాక్ మీద అమెరికా ప్రభుత్వం యుద్ధం ప్రారంభించి ఐదు సంవత్సరాలు నిండాయి. ఈ ఐదు సంవత్సరాలలో అమెరికా, బ్రిటన్‌లు తమ ఆర్థికవ్యవస్థ నడవడానికి, ప్రధాన ఇంధనమైన చమురు నిరాటంకంగా సరఫరా కావడానికి పన్నెండు లక్షల మంది ఇరాకీల నెత్తురు పారించింది. పన్నెండు లక్షల మంది ఇరాకీ ప్రజలను వధించి, కనీసం నలభై లక్షల మంది ఇరాకీలను నిరాశ్రయులను చేసిన అమెరికన్ పాలకులు ఈ యుద్ధం ధర్మయుద్ధమని, సద్దాం హుస్సేన్ అనే నియంతను తొలగించి ప్రజాస్వామ్యాన్ని స్థాపించడానికే అక్కడికి వెళ్లామని ప్రవచనాలు పలుకుతున్నారు. ఇప్పటికి 500 బిలియన్ డాలర్లపైన (మన లెక్కలో చెప్పాలంటే ఇరవై లక్షల కోట్ల రూపాయలపైన) ఈ యుద్ధంలో అమెరికన్ ప్రభుత్వానికి ఖర్చయింది. ఇరాక్‌లో ధ్వంసమయిన ఆస్తి, ఉత్పత్తి సౌకర్యాలు, మానవశక్తి లెక్కవేస్తే మానవజాతి ఈ ఐదు సంవత్సరాల యుద్ధంలో ఎంత భారీగా నష్టపోయిందో అర్థమవుతుంది. అయినా ఇంత దుర్మార్గమైన యుద్ధానికి ప్రజల నుంచీ ఇతర దేశాల నుంచీ రావలసినంత వ్యతిరేకత రావడం లేదు. చెదురుముదురుగా, అడపాదడపా, కేవలం ప్రగతిశీల వర్గాలలో మినహా, ప్రపంచవ్యాప్తంగా నిరసన రావడంలేదు. తమపేరుమీద, తమకోసం తమవల్ల తాము ఎన్నుకోగా తమను పాలిస్తున్న పాలకవర్గాలు తమ జీవితాలను ఎంతగా అతలాకుతలం చేస్తున్నాయో మనషులు ఇంకా గుర్తించడంలేదు. అలా గుర్తించకుండా ఉండడానికి, కళ్లకు గంతలు కట్టడానికి పాలకవర్గాలు అనేక సాధనాలు సౌకర్యాలలా కనిపించే మత్తుపదార్థాలూ ఆకర్షణలూ అబద్ధాలూ సృష్టించిపెట్టాయి. ఆ మత్తు మందులనుంచి మేలుకుని తమ ప్రయోజనాల కోసం, తమవంటి సకలదేశాల ప్రజల కోసం, శ్రమ ద్వారా ఉత్పత్తి ద్వారా మానవజాతి సార్థకతను చాటే ప్రజల కోసం నిలబడిననాడే, లేచి నిలిచిననాడే యుద్ధం నుంచి ప్రజలకు విముక్తి. పెట్టుబడిదారీ విధానమే, సామ్రాజ్యవాదమే యుద్ధమని గుర్తించి, సామ్రాజ్యవాదాన్ని అంతం చేసిననాడే ప్రజలకు యుద్ధం నుంచి విముక్తి. ◆

## లోపలి పేజీల్లో...

### కేంద్ర బడ్జెట్ 2008 - 09

బడ్జెట్‌ను వర్గ దృష్టితో, భావజాలపరంగా అర్థం చేసుకోక పోయినప్పటికీ, మామూలు దృష్టి నుంచి చూసి వేరువేరు సంవత్సరాల బడ్జెట్‌లను పోల్చి చూసినా, బడ్జెట్‌ల వల్ల ఆర్థిక వ్యవస్థలో నిజంగా శ్రమిస్తున్న వర్గాలకు ఏమీ దక్కలేదని, శ్రామికులకు దక్కినది దోపిడీ పీడనలు మాత్రమేనని, ప్రభుత్వాలు చేసినదల్లా శ్రామికుల పేరుమీద దోపిడీ వర్గాలకు దోచిపెట్టడమేనని అర్థమవుతుంది. అసలు బడ్జెట్‌ను చూసే దృష్టిలోనే ప్రస్తుతం ఉన్నదానికన్న ఎక్కువ నిశిత దృష్టి అవసరమయిన స్థితిలో మనం ఉన్నాం. ముఖ్యంగా ప్రపంచీకరణ తర్వాత ప్రభుత్వాలు, పాలకవర్గాలు రోజురోజుకూ సంక్లిష్టమైన పదజాలంవాడుతూ ఆర్థిక వ్యవహారాలను మరింతగా మాయగా మారుస్తున్న తరుణంలో ఈ మాయను విప్పి చెప్పేందుకు బడ్జెట్ విశ్లేషణను ఒక సాధనంగా వాడుకోవలసి ఉంది.

#### ఫోకస్ : కేంద్ర బడ్జెట్ 2008 - 09





**రచయితలకు సూచన**

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

**చందాదారులకు విజ్ఞప్తి!**

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028




- **అధ్యాపక జ్వాల సంపాదకీయాలు – రాతవాత** – అధ్యాపక జ్వాల ప్రచురణలు – 130 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : డి.టి.ఎఫ్., ఎఫ్ – 7, 3-4-874, అనురాధ అపార్ట్‌మెంట్స్, బర్కత్‌పురా, హైదరాబాద్ – 500 027.
- **రసఝరి రాజమల్లాచారి** – డా. కన్నెగంటి రాజమల్లాచారి సంస్మరణ సంచిక – డా. కన్నెగంటి సాహితీ రంగస్థల మిత్ర మండలి – 115 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : ఎస్. శ్రీనివాసాచారి, హెడ్ మాస్టర్, ఎం.పి.పి. స్కూల్, పెద్దబోయిలపల్లె. యర్రగొండపాలెం మండలం, ప్రకాశం జిల్లా – 523 327
- **జీవధార** – 1857 స్ఫూర్తి రచనల సంకలనం – ప్రజా సాహిత్య వేదిక ప్రచురణ, 195 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : మార్క్స్ భవన్, 7వ లైన్, విద్యానగర్, హైదరాబాద్ – 500 044.
- **భారత్ బంజారా గీత్‌మాలా** – కేతావత్ సోమ్లాల్ – సహచర బుక్‌మార్క్ ప్రచురణ, 154 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : సహచర బుక్ మార్క్, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 500 044.
- **వెలుతురు వలయాలు – రెక్కలు** – పి. శ్రీనివాస్ గౌడ్ – సాహితీమిత్రులు – మచిలీపట్నం ప్రచురణ – 104 పేజీలు, 1/10 డెమీ, రు. 40, ప్రతులకు : పి. శ్రీనివాస్ గౌడ్, రైస్‌మిల్ ఎదురు, స్వర్ణగేట్ వద్ద, చీరాల – 523 155. ప్రకాశం జిల్లా. సెల్ : 9949429449
- **పాటల బాటసారిగా...** – వ్యాస సంకలనం – డా. గోపు లింగారెడ్డి – సుషమా పబ్లికేషన్స్, 87 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : డా. గోపు లింగారెడ్డి, 7-1-249, మంకమ్మతోట, కరీంనగర్ – 505 001. ఫోన్ : 0878 – 2259990, సెల్ : 9395109735
- **గడ్డిదూడ** – జి. రాజశేఖర్ – సాహితీమిత్రులు – మచిలీపట్నం ప్రచురణ – 108 పేజీలు, 1/10 డెమీ, రు. 30, ప్రతులకు : గుద్దంటి రాజశేఖర్, డో.నెం. 7-5-94, జక్కావారివీథి, పేరాల – 523 157. చీరాల. ప్రకాశం జిల్లా. సెల్ : 93467 52356
- **భూమిక హెర్బల్ డైరీ – 2008** – స్త్రీవాద పత్రిక భూమిక ప్రచురణ – 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : స్త్రీవాద పత్రిక భూమిక, ఎచ్.ఐ.జి. – 2, బ్లాక్ – 8, ఫ్లాట్ – 1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 500 044. ఫోన్ : 040 – 25660173
- **ఉదారవాదం** – జాన్‌గ్రే, అనువాదకులు – రావెల సాంబశివరావు, లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 112 పేజీలు, 1/8 డెమీ, రు. 40
- **స్పెయిన్ అంతర్యుద్ధం** – ఫాసిజంపై ప్రజా పోరాట దిక్సూచి – కాత్యాయని, లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 68 పేజీలు, 1/8 డెమీ, రు. 20

పై రెండు పుస్తకాల ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 5-85-4/బి, పండరీపురం, 1వలైన్, గుంటూరు-522 002, ఫోన్ : 9848877596, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



## పాఠకుల వీక్షణం

'వీక్షణం' పత్రిక నాకు నచ్చడానికి కారణం అందులోని వివరాలు. కొన్ని ఇతర పత్రికల్లాగా తమ రాజకీయ ధోరణి గురించి కేవలం ప్రకటనలూ, ఉద్ఘాటనలతో సరిపెట్టుకోకుండా దానికిగల ఆధారాలనూ, సాక్ష్యాలను సహేతుకంగా వివరించే ప్రయత్నం చేస్తున్నందువల్లనే ఈ పత్రికకు విలువ పెరిగిందని నా ఉద్దేశం. కొందరు పాఠకులు సూచించినట్టుగా ఇందులోని ప్రతి వ్యాసమూ సమగ్రమైన పరిశోధనల మీద ఆధారపడినది కాకపోవచ్చు. అయినప్పటికీ మొత్తంమీద ప్రభుత్వాలు చెప్పుకుంటున్న గొప్పలకూ, యదార్థాలకూ ఉన్న స్పష్టమైన తేడాలని ఎత్తిచూపడంలో వీక్షణం మంచి పాత్ర నిర్వహిస్తోందనే అనిపిస్తుంది. ముఖ్యంగా మార్చ్ సంచికలో గడిచిన దశాబ్దాల్లో ప్రముఖులు రాసిన కొన్ని విశ్లేషణాత్మక వ్యాసాలను నేటి తరానికి అందజెయ్యడం మంచిపని. ఈ పత్రిక కలకాలం కొనసాగాలని నా ఆకాంక్ష

**– రోహిణీప్రసాద్**
అట్లాంటా

'వీక్షణం' మార్చ్ సంచికలో 'ఆంధ్రప్రదేశ్‌లో భూసంస్కరణలు' పేరిట అందించిన వ్యాసాలు చాలా బాగున్నాయి. విప్లవ లక్ష్యాలతో పనిచేసిన పుచ్చలపల్లి సుందరయ్య, కొండపల్లి సీతారామయ్యలు చేసిన అపూర్వమైన పరిశీలన ఈనాటికీ గ్రామీణ భారతాన్ని అర్థం చేసుకోవడానికి పనికి వస్తాయనడంలో ఎటువంటి సందేహం లేదు. భూమి, దానితో ముడిపడిన ఉత్పత్తి సంబంధాలే గ్రామీణ, రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాలను ప్రభావితం చేస్తున్నాయి. వాస్తవానికి ఇలాంటి పరిశీలనలు బ్రిటిష్ పాలనాకాలంలో వారి పాలనా అవసరాలకై గ్రామ ఖైఫీయతులను రూపొందించారు. స్వాతంత్ర్యం వచ్చి అరవై ఏళ్లలైనా ఈనాటికి మన గ్రామాలను సరి అయిన పద్ధతిలో అధ్యయనం చేసిన దాఖలాలు లేవు. ఏ గ్రామానికి ఆ గ్రామం అక్కడి ప్రజలే వాస్తవానికి ఇలాంటి పనికి పూనుకోవాలేమో? ఊర్లో ఉన్న మొత్తం భూమి ఎంత, అందులో సాగు భూమి ఎంత, నీటిపారుదల కింద ఉన్నదెంత, ఏ ఏ వర్గాల చేతుల్లో ఎంత భూమి ఉంది లాంటి అంశాలను లోతుగా పరిశీలించి, సామాజిక అంతరాలను, అసంతృప్తులను తొలగించడానికి ఈ పరిశీలనలను వాడుకోవాలి. సామాజిక శాస్త్ర పరిశోధకులు, రాజకీయ ఆర్థిక పరిశోధకులు ఇలాంటి అంశాలను, గ్రామ పరిశోధనలను పెద్ద ఎత్తున చేపడితే సమాజానికి ఎంతో మేలు చేకూరుతుంది. ఇలాంటి ఆలోచనా స్ఫోరకమైన, అవసరమైన వ్యాసాలను అందించిన 'వీక్షణం'కు కృతజ్ఞతలు.

**– పి. శంకర్**
ఆదిలాబాద్

'వీక్షణం' మార్చి సంచికలో ఎస్.సి. రిజర్వేషన్ల వర్గీకరణ – సామాజిక న్యాయం అనే వ్యాసంలో, రచయితలు వర్గీకరణ ప్రాంతాల వారీగా జరగాలని రాశారు. ఎస్.సి.లకు 15 శాతం రిజర్వేషన్ కేటాయించడంలో రాష్ట్ర జనాభాను మొత్తం యూనిట్‌గా తీసుకొని కేటాయించారు. అంతేకాని ప్రాంతాలను బట్టికాదు. ప్రాంతాల వారీగా రిజర్వేషన్ ఫలాలను అందించేందుకు రాజ్యాంగంలో సవరణ చేయడం శాస్త్రీయమైనదికాదు. ప్రాంతాలవారీగా ప్రాంతాలను లెక్కిస్తూపోతే అనేకం వస్తాయి. మరొకరు జిల్లాల వారీగా చేయాలని డిమాండ్ చేస్తారు. కావున ప్రస్తుతం ఉన్న వర్గీకరణ డిమాండ్ చాలా న్యాయ సమ్మతమైంది. సమాజం యావత్తూ మద్దతు ఉంది. గతంలో 2000–04 వర్గీకరణ అమలు జరిగిన కాలంలో ఏవర్గం నుండీ వ్యతిరేకత వ్యక్తం కాకపోవటాన్ని ఇక్కడ మనం గుర్తించాలి. కావున మాల–మాదిగ ఐక్యతకు అంకురార్పణ జరుగుతున్న ఈ తరుణంలో ఇటువంటి అశాస్త్రీయమైన ప్రతిపాదనలు చేయటం సమంజసం కాదు. ఇప్పటికే ఆలస్యమైన ఈ వర్గీకరణ డిమాండ్ త్వరగా పరిష్కరింపబడి దళితుల ఐక్యత నెలకొనవలసిన అవసరముంది.

**– తడికమళ్ల చింపిరయ్య**
ఖమ్మం

'వీక్షణం' మార్చి సంచికలో డా. యిమ్మానేని సత్యసుందరం గారి 'ఆహార భద్రత అంతంత మాత్రమే' వ్యాసం బాగుంది. ఆహార కొరత సమస్యను త్వరగా పరిష్కరించకపోతే ముమ్ముందు ఆహారం కోసం యుద్ధాలు జరిగే పరిస్థితి కానవస్తోంది.

**– టి. రాములు**
మిర్యాలగూడ

### అసహజ మరణాలు నమోదు చేద్దాం!

ఆగస్ట్ 2006 నుంచి వీక్షణంలో అసహజ మరణాల సూచి ప్రారంభించాం. మన చుట్టూ అసహజంగా చనిపోతున్న రైతులు, చేనేత కార్మికులు, వరకట్న మరణాలు, రకరకాల ప్రమాదాలలో చనిపోతున్నవారు, వైద్యం అందక, ప్రకృతి వైపరీత్యాలతో మరణిస్తున్నవారు, హత్యలు ఇలా, అనేక సామాజిక రంగాలనుంచి మరణిస్తున్నవారి సంఖ్యనైనా నమోదు చేయడమే ఈ శీర్షిక ఉద్దేశ్యం. ఏయే సామాజిక, రాజకీయార్థిక కారణాలతో చనిపోతున్నారో పరిశోధన చేయాల్సి ఉంది. మేము చేస్తున్న ఈ ప్రయత్నంలో మీరూ పాలుపంచుకోవచ్చు. మీ జిల్లాలో అసహజంగా చనిపోతున్న వారి వివరాలను మాకు పంపండి. దీనికి పారితోషికంగా వీక్షణం ప్రతిని పంపిస్తాం. ఆసక్తి గలవారు వివరాలకై సంప్రదించండి. ఫోన్ నెం. 99891 89250, 99493 91028

**– సంపాదకులు**

### వీక్షణం మీ ముంగిట

'వీక్షణం' పత్రిక ఇప్పుడు మీకు మరింత చేరువలోకి వచ్చింది. రాష్ట్రంలోని అన్ని పట్టణాలలో, టౌన్‌లలోని న్యూస్ స్టాండ్‌లలో అందుబాటులో ఉంది. ఇక ఆలస్యమెందుకు... వెంటనే మీ ప్రతిని తెచ్చుకోండి!

ఐ.సి.డి.ఎస్.లో పనిచేస్తున్న దాదాపు లక్షన్నర మంది కార్యకర్తల న్యాయపరమైన కోరికలను ఆమోదించాలని కోరుతూ ఫిబ్రవరి 27న అంగన్‌వాడి వర్కర్లు 'చలో హైదరాబాద్' కార్యక్రమాన్ని నిర్వహించారు. వివిధ జిల్లాల నుంచి అంగన్‌వాడి వర్కర్లు, హెల్పర్లు ఉదయం నుండే ఇందిరా పార్కు వద్ద బైఠాయించారు. పొరుగు రాష్ట్రాల మాదిరిగా ప్రభుత్వం కార్యకర్తలకు సౌకర్యాలు కల్పించాలని డిమాండ్ చేశారు. అంగన్‌వాడి వర్కర్లకు రు. 1000, హెల్పర్లకు రు. 500 వేతనాలు పెంచాలని కోరారు. పదవీవిరమణ సమయంలో ప్రతి కార్యకర్తకు లక్ష రూపాయలు, హెల్పర్లకు యాభై వేల రూపాయలు ఇవ్వడమే కాక, పెన్షన్ పథకాన్ని అమలు చేయాలని కోరారు. మార్చ్ 4న ముఖ్యమంత్రిని కలిసిన అంగన్‌వాడి ప్రతినిధులతో అంగన్‌వాడి వర్కర్లకు రు. 300, హెల్పర్లకు రు. 250 చొప్పున వేతనాన్ని పెంచుతున్నట్లు ప్రకటించారు. అయితే, గతంలో ముఖ్యమంత్రి వాగ్దానం చేసినట్టు తమకు వేతనాలు పెంచలేదనీ, పెరిగిన ధరలతో పోలిస్తే ఇది చాలా తక్కువ అనీ ఈ పాక్షిక విజయంపై ప్రతినిధులు అసంతృప్తి వ్యక్తం చేశారు.



టి.ఆర్.ఎస్. అధినేత, కరీంనగర్ ఎం.పి. కె. చంద్రశేఖరరావుతో సహా ఆ పార్టీకి చెందిన ఎం.పి.లు టి. మధుసూదన్ రెడ్డి (ఆదిలాబాద్), రవీందర్ నాయక్ (వరంగల్), బి. వినోద్ కుమార్ (హనుమకొండ) లు మార్చ్ 3న పార్లమెంట్‌లో స్పీకర్ సోమ్‌నాథ్ చటర్జీకి తమ రాజీనామాలు సమర్పించారు. తెలంగాణ విషయంలో కాంగ్రెస్ తమను వంచించిందని పేర్కొన్నారు. దీనికి కొనసాగింపుగా మార్చ్ 4న రాష్ట్రంలో జి. విజయరామారావు (ఘనపూర్), కె. ప్రతాపరెడ్డి (చేర్యాల), సి.ఎచ్. లక్ష్మారెడ్డి (జడ్చర్ల), టి. హరీశ్‌రావు (సిద్దిపేట), పద్మా దేవేందర్ రెడ్డి (రామయంపేట), ఎస్. రామలింగా రెడ్డి (దొమ్మాట), నాయిని నర్సింహా రెడ్డి (ముషీరాబాద్), టి. పద్మారావు (సికిందరాబాద్), కె. నగేష్ (ఆలేర్), ఎ. చంద్రశేఖర్ (వికారాబాద్), ఎ. గోవిందనాయక్ (ఖానాపూర్), వై. రవీందర్‌రెడ్డి (యెల్లారెడ్డి), జి. గంగారెడ్డి (డిచ్‌పల్లి), ఈటెల రాజేందర్ (కమలాపూర్), కెప్టెన్. వి. లక్ష్మీకాంత రావు (హుజూరాబాద్), కొప్పుల ఈశ్వర్ (మేదారం) మొత్తం 16 మంది ఎం.ఎల్.ఎ. లు (తెరాస 25 ఎం.ఎల్.ఎ.లలో చీలిక వర్గం పోను), ముగ్గురు ఎం.ఎల్.సి. లు రాజీనామా చేశారు. రాష్ట్ర చరిత్రలో ఒకేసారి 16 మంది ఎం.ఎల్.ఎ.లు ఒక సమస్యపై ఇలా రాజీనామాలు చేయడం ఇదే మొదటిసారి.

గ్రంథాలయం, సాంస్కృతిక కేంద్రం, సభాస్థలి అయినటువంటి సుందరయ్య విజ్ఞానకేంద్రం పై మార్చ్ 10న కొందరు అసాంఘిక శక్తులు దాడిచేశారు. వాచ్‌మెన్‌పై దాడి చేయడమే గాక పుచ్చలపల్లి సుందరయ్యగారి పటాన్ని తగులబెట్టే ప్రయత్నం చేశారు. గ్రంథాలయం అన్ని సామాజికవర్గాల వారికి అందుబాటులో ఉండడమేగాక, వివిధ రాజకీయ, సాహిత్య, సామాజిక, సాంస్కృతిక విశ్వాసాలు కలవారికి సుందరయ్య విజ్ఞాన కేంద్రం వేదికగా ఉండడంతో సర్వత్రా దీనిపై నిరసన వ్యక్తమయింది.

మార్చ్ 11 నుంచి మూడు రోజుల పాటు వికలాంగుల హక్కుల పోరాట సమితి ఆధ్వర్యంలో మెరుపు సమ్మెను చేపట్టారు. మంద కృష్ణ మాదిగ నాయకత్వంలో 120 మందికి పైగా వికలాంగులు హైదరాబాద్ లోని అబిడ్స్‌లో ఒక భవనం పై అంతస్తులో ఈ సమ్మెను ప్రారంభించారు. ఆమరణ దీక్షలు మూడవ రోజుకు చేరుకోగా ప్రభుత్వ ఢిల్లీ ప్రతినిధి మల్లు రవి, ఎం.ఎల్.ఎ. దారా సాంబయ్యలు మంద కృష్ణ మాదిగతో చర్చలు జరిపి మార్చ్ 13న దీక్షను విరమింపజేశారు. వికలాంగులకు వైకల్యాన్ని బట్టి కేటగిరీలుగా విభజించి రు. 500 నుంచి రు. 700 పింఛన్ చెల్లిస్తామని రాతపూర్వకంగా హామీ ఇచ్చాక దీక్ష విరమించారు. ఈ సందర్భంగా మంద కృష్ణ మాదిగ, వి.ఎచ్.పి.ఎస్. రాష్ట్ర అధ్యక్షులు కొల్లి నాగేశ్వరరావులు మాట్లాడుతూ 'ప్రభుత్వం తమ 34 డిమాండ్లకు సానుకూలంగా స్పందించిందని' తెలిపారు. తమకు సహకరించిన వారందరికీ కృతజ్ఞతలు తెలిపారు.

'అంబేద్కర్ రాజ్యాంగం రాయడం, ఆ రాజ్యాంగం అమలు చేసే ప్రభుత్వాలు ఉండడం మన దురదృష్టమని' ఎం.పి. ఉండవల్లి అరుణ్ కుమార్ చేసిన వ్యాఖ్యలు రాష్ట్రంలో పెనుదుమారం రేపాయి. వివిధ రాజకీయ పార్టీల నాయకులు, దళిత సంఘాలవారు ఎం.పి చేసిన వ్యాఖ్యలపై తీవ్రంగా స్పందించారు. ఫిబ్రవరి 25న విలేకరుల సమావేశం ఏర్పాటు చేసి ఉండవల్లి అరుణ్‌కుమార్ బేషరతుగా క్షమాపణలు తెలియజేయడంతో వివాదం సద్దుమణిగింది.

నిత్యావసర వస్తువుల ధరలు ఈ ఐదేళ్ల కాలంలో దాదాపు రెట్టింపు అయ్యాయి. నిజమేనని ఒప్పుకోవడమే గాని నియంత్రించే విధానమే లేదు. 2004, 2008 ల మధ్య కందిపప్పు కిలో రు. 21 నుంచి రు. 40కి, చింతపండు కిలో రు. 20 నుంచి రు. 40కి, పొద్దుతిరుగుడు నూనె కిలో రు. 38 నుంచి రు. 75కి పెరిగిపోయి సామాన్యులకు పెను భారంగా పరిణమించినాయి. పెట్రోల్, డిజిల్ ధరల పెరుగుదల వల్లె నిత్యావసర వస్తువుల ధరలు పెరుగుతున్నాయని స్వయంగా సోనియాగాంధీ అంటున్నా వాస్తవానికి ఈ లోపం విధానాల్లో ఉంది. నిత్యావసర వస్తువుల ధరలే ఇలా ఉంటే ఇక విద్యా, వైద్యం లాంటి అవసరాల వైపు కన్నెత్తి చూసే పరిస్థితి సామాన్యులకు లేదు.

బడ్జెట్‌లో బలహీనవర్గాలకు, సంక్షేమరంగానికి వాటా పెంచాలని డిమాండ్ చేస్తూ ఇందిరాపార్క్ నుంచి నిజాం కాలేజీ గ్రౌండ్స్ వరకు వేలాది మంది కార్యకర్తలతో సి.పి.ఎం. ఆధ్వర్యంలో ప్రజాసంఘాలు మార్చ్ 19న పెద్ద ఎత్తున ప్రదర్శన నిర్వహించాయి. దళితులు, గిరిజనులు, బి.సి.లు, చేతివృత్తులవారు, కల్లుగీత కార్మికులు, మహిళలు, అంగన్‌వాడి కార్మికులు, చేనేత, మత్స్యకారుల సమస్యల పరిష్కారం, బడ్జెట్‌లో వాటాకోసం ఈ కార్యక్రమాన్ని చేపట్టాయి. ◆

**గిరిజన మహిళలపై జరిగే అత్యాచారాలు నేరాలుకావా అని, వారి ఓట్లకున్న విలువ వారి శీలానికి లేదా అని ప్రశ్నిస్తున్నారు డా. జి. లచ్చయ్య**

# వాకపల్లి బాధితులు - న్యాయం తీరుతెన్నులు

యాదృచ్ఛికమో ఏమోగాని వాకపల్లి సంఘటన జరిగిన తర్వాత ఒక జాతీయ స్థాయి, అందునా పాలక పక్షాన్ని తన కనుసన్నలతో శాసిస్తున్న ఏకైక మహిళ సోనియాగాంధీ రెండుసార్లు రాజమండ్రికి రావడం జరిగింది. గత సంవత్సరం ఆగస్ట్ 20న విశాఖ జిల్లా జి. మాడుగల మండలంలోని వాకపల్లి ఆదివాసి గిరిజనులపై అత్యాచారం జరిగిన సరిగ్గా 11 రోజులకు అనగా సెప్టెంబర్ 1న రాజమండ్రికి వచ్చిన సందర్భంగా ప్రేక్షకులలోని ఒక మహిళ సోనియాను ముద్దు పెట్టుకున్న దృశ్యం, సంఘటన పత్రికల్లో పతాక శీర్షికన ప్రచురిత మయ్యాయి. అదేరోజు పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరులో కూడా బహిరంగసభలో పాల్గొని వై.ఎస్. రాజశేఖర రెడ్డి ప్రభుత్వాన్ని పొగడ్తలతో ముంచెత్తారు. కాని సాటి మహిళలకు జరిగిన అత్యాచారం గూర్చి పల్లెత్తు మాట మాట్లాడలేకపోయారు. ఇలాంటి సంఘటనే తిరిగి మొన్న మార్చి 14న జరిగింది. రాజమండ్రి దగ్గరగల జగ్గంపేటలో జరిగిన భారీ బహిరంగ సభలో వేలాది ఆడపడుచుల సమక్షంలో వై.ఎస్.ను సాటిలేని ముఖ్యమంత్రిగా, కాంగ్రెస్‌కే గర్వకారణంగా ఆయన పరిపాలనా దక్షతను కొనియాడింది.

సరిగ్గా సోనియాగాంధీ రెండవసారి రాష్ట్ర సందర్శన సందర్భంగా వాకపల్లి మహిళలకు మరోసారి ఘోరమైన అన్యాయం జరిగింది. వాకపల్లి ఘటనపై సి.బి.సి.ఐ.డి. అధికారులు గిరిజన మహిళలు చెబుతున్న అత్యాచార ఘటనలో వాస్తవం లేదంటూ పాడేరు కోర్టులో నివేదికను దాఖలు చేసారు. దీంతో పాడేరు ప్రథమశ్రేణి జ్యుడిషియల్ మెజిస్ట్రేట్, అత్యాచారానికి గురైనామని నెత్తినోరు కొట్టుకుంటూ న్యాయాన్ని అర్థిస్తున్న పదకొండు మంది గిరిజన మహిళలకు మార్చి 5న నోటీసులు జారీ చేశారు. ఈ నోటీసులు అందిన ఏడు రోజుల్లో పాడేరు కోర్టుకు హాజరై వారి అభియోగాన్ని వినిపించుకోవాలని కోర్టు ఆ నోటీసుల్లో ఆదేశించింది. ఆదేశించడమే కాకుండా ఒకవేళ కోర్టుకు హాజరు కాని పక్షంలో సి.ఐ.డి. అధికారుల నివేదిక ఆధారంగా మహిళలపై తగినచర్య తీసుకోనున్నట్లు కూడా ఆ నోటీసులో కోర్టు హెచ్చరించడం జరిగింది.

ఈ నోటీసులనందుకున్న వాకపల్లి గిరిజన మహిళలు హతాశులయ్యారు. సామూహిక అత్యాచారానికి గురై న్యాయం జరక్కపోగా, తమలో తాము కుమిలిపోతుండగా కోర్టుకు హాజరు కమ్మని నోటీసులు పంపడం లేకుంటే చర్య తీసుకుంటామని హెచ్చరించడం అన్యాయమని, తమ వద్దకే కోర్టు రావాలని, తమకు జరిగిన అన్యాయాన్ని రాష్ట్ర ముఖ్యమంత్రితో సహా హైకోర్టును, మానవ హక్కుల సంఘాన్ని ఆశ్రయించినా న్యాయం జరగకపోగా కోర్టు నోటీసులు మరింత అవమానానికి గురిచేసాయని ఆగ్రహాన్ని వ్యక్తపర్చారు. తమకు బతకడమే కష్టమని, చావంటే భయం లేదని, పోలీసులు తమ గ్రామంలోకి అడుగు పెడితే నరికి పోగులు పెడతామని తీవ్రంగా హెచ్చరించారు కూడా. అయినా పేదవాని కోపం పెదవికి చేటన్నట్లు తమ ఆవేదనను దిగమింగి కూడా మార్చి 12న అరకులోయ కోర్టుకు హాజరయ్యారు. తిరిగి వీరిని మార్చి 19న పాడేరు కోర్టుకు హాజరుకావాలని కోరడంతో ఆత్మాభిమానంతో పాడేరు కోర్టుకు హాజరు కాలేకపోయారు. దీంతో కేసు విచారణ ఏప్రిల్ 2కు వాయిదా పడింది.

ఈతతంగమంతా అన్ని పత్రికల్లో వస్తూనే ఉంది. ఇదే కాలంలో సోనియాగాంధీ రెండవ దఫా మార్చి 14న జగ్గంపేట సభలో పాల్గొని హాజరైన మహిళలకు సందేశాలపై సందేశాలను ఇచ్చారు. కాని వాకపల్లి సంఘటనగాని, గిరిజన మహిళల బాధలు గాని, పక్క జిల్లాల్లో జరుగుతున్న అత్యాచారాలు గాని ఆమె దృష్టికి రాలేదు. అయినా ఆమె మహిళల పక్షపాతి(?) మహిళాభ్యున్నతికి ఆమె ఎనలేని కృషి చేస్తున్నది(?) ఇదో ఆత్మహత్యా సాదృశ్యం. ఒక మహిళ అయి ఉండి కూడా సాటి మహిళలకు, అందునా అత్యాచారం జరిగిందని పత్రికలు, కాంగ్రెస్ తప్ప అన్ని రాజకీయ పార్టీలు, మహిళా సంఘాలు, పౌరహక్కుల సంఘాలు, ప్రజా ప్రతినిధులైన ఎం.ఎల్.ఎ. లకే రాజారావు, భద్రాచలం పార్లమెంట్ సభ్యులు మిడియం బాబురావు, చివరికి సంఘటన జరిగిన తర్వాత ప్రభుత్వ పక్షాన మొట్టమొదటి సారిగా వాకపల్లిని, పాడేరును సెప్టెంబర్ 6న సందర్శించిన గిరిజన సంక్షేమ కార్యదర్శి వి. నాగిరెడ్డి, అత్యాచారానికి గురైన మహిళల మాటను కొట్టిపారేయలేమని అన్నారు. ఈ సందర్భంగా సంఘటన జరిగిన తర్వాత జిల్లా కలెక్టర్, ఎస్.పి.లు సందర్శించక పోవడాన్ని నాగిరెడ్డి తీవ్రంగా పరిగణించారు. ఇలాంటి సందర్భంలో దళిత, గిరిజన అత్యాచార నిరోధక చట్టం 1989కి విలువ లేకుండా పోతోందని ఆయన ఆవేదన చెందారు. ఈ సందర్భంగానే విశాఖ జిల్లా అదనపు ఎస్.పి. ఆనందరావును ప్రభుత్వం తొలగించాలని కూడా అనుకున్నది.

సి.ఐ.డి. ఎస్.పి. ఎం. శ్రీనివాసరెడ్డి సెప్టెంబర్ 28న వాకపల్లిని సందర్శించగా, జరిగిన సంఘటనను గిరిజన మహిళలు పూసగుచ్చినట్లు నాగిరెడ్డికి వివరించినట్లుగానే సి.ఐ.డి. ఎస్.పి.కి వివరించారు. ఆయన తన మధ్యంతర రిపోర్టును అక్టోబర్ 25న సమర్పించారు. తుది రిపోర్ట్

తొందరగా సమర్పించాలని హైకోర్టు తెల్లవారే కోరింది కూడా. అనుమాన పడినట్లుగానే తుది రిపోర్ట్ బాధిత మహిళలకు వ్యతిరేకంగానే ఉండడం గిరిజన పక్షపాతుల్ని ఆశ్చర్య పర్చింది. ఇదే కాకుండా సంఘటన జరిగిన మూడు నెలల తర్వాత నవంబర్ 19న జాతీయ ఎస్.టి. కమిషన్ అసిస్టెంట్ డైరెక్టర్ ఆర్.కె. మిశ్రా వాకపల్లి సంఘటనపై మరో విచారణ జరిపారు. అందరికి గోడు వెళ్లబోసుకున్నట్లుగానే ఈయనకూ జరిగిన సంఘటనను సిగ్గు విడిచి వర్ణించారు. పసుపు దొడ్లో ముగ్గురు పోలీసులు తనపై జరిపిన అత్యాచారాన్ని బాధిత మహిళల్లో ఒక మహిళ తనకేదో న్యాయం జరుగుతుందని పూసగుచ్చినట్లు వివరించింది. ఈ కమిషన్ నివేదిక ఎలా ఉందో ఎవరికీ తెలియదు. సి.బి.సి.ఐ.డి. నివేదిక ఈ విధంగా ఉన్నప్పుడు, జాతీయ స్థాయి కమిషనర్ నివేదిక మరొలా ఉంటుందను కోవడం అత్యాశనే అవుతుంది.

మహిళలను గౌరవించడం మన సంప్రదాయం అని చెప్పుకునే దేశంలో, మహిళాభ్యున్నతికి పెద్ద పీట వేస్తున్నామని బీరాలు పలుకుతున్న రాష్ట్రంలో, ఈ రాష్ట్ర పాలనను మనసా, వాచా ప్రోత్సహిస్తూ, అభినందిస్తున్న ఓ జాతీయ స్థాయి మహిళ ఉన్న దేశంలో, బహుశా గిరిజన మహిళలు వారి దృష్టిలో మహిళలు కాకపోవచ్చు. అత్యాచారం జరిగిన వెంటనే సభ్య సమాజం గర్వించేలా ఆత్మహత్య చేసుకుంటేనో, లేదా అత్యాచారం జరిగిన తర్వాత సభ్య సమాజంలో తలెత్తుకోని ఎలా బతగ్గలమని సంఘటన జరగలేదని మానసికంగా కుమిలి పోతేనో వాకపల్లి మహిళలు కూడా మహిళలుగా గుర్తించబడేవారేమో. కాని వారు గిరి పుత్రికలు. అబద్ధాలు ఆడడం వారికి తెలియదు. చేసిన తప్పుల్ని ఒప్పుకోవడం, తప్పు ఒప్పుకుంటే తప్పు చేసిన వారిని కూడా అక్కున చేర్చుకునే విశాల హృదయంగల కల్లా కపటం లేనివారు. మానవీయ విలువలకు నిలవెత్తు రూపంగా ఉన్నారు. ప్రకృతికి అనుగుణం గా, సహజసిద్ధంగా జీవించేవారిని జాతీయ స్రవంతిలో కలవాలని మరోపక్క ఆహ్వానిస్తున్నాం. జాతీయ స్రవంతి అంటే వారి కట్టు, బొట్టు, సంప్రదాయాలను, ఆచారాలను విసర్జించి మన కుళ్లు సంప్రదాయాలను స్వీకరించమనడమే కదా. ఇలా పిలుపునిస్తున్న వారే గిరిజనుల పక్షపాతులమని, వారి అభివృద్ధికి తమ ప్రభుత్వం కట్టుబడి ఉందని ఉపన్యాసాలిస్తూ ఉంటారు. కాని తమపై అత్యాచారం జరిగిందని, అత్యాచారం కూడా గూడెం సజీవ సాక్ష్యంగా జరిగిందని, అత్యాచారం చేసింది కూడా ఈ రాజ్య పోలీసులని గొంతెత్తి చాటినా, కలిసిన వారందరికీ విన్నవించుకున్నా, ప్రభుత్వ కనుసన్నలలో నడిచే ఫోరెన్సిక్ రిపోర్టుల మీదున్న నమ్మకం, సి.ఐ.డి. నివేదికల మీదున్న నమ్మకం గిరిజనుల నిజాయితీ మీద లేకపోవడం ఈ పాలకుల దమననీతిని తెలుపుతున్నది. గిరిజన మహిళల ఆరోపణల చుట్టూ కట్టుకథలల్లి, పోలీసుల కూంబింగును నిరోధించడానికే పోలీసులపై ఆరోపణలు చేస్తున్నారని తప్పుడు ప్రచారాన్ని చేయడం పోలీసుల నైజాన్ని కప్పి పుచ్చడమే అవుతుంది.

ఈ దేశంలో భద్రతా దళాల నుంచి మొదలుకొని, రిజర్వ్ పోలీసు దాకా, దేశ సరిహద్దు నుంచి గ్రామ పొలిమేరల దాకా గత అరవై సంవత్సరాలుగా పోలీసుల నిర్వాకం గుర్తెరగనిది ఎవరు? పోలీసుల మీదున్న నమ్మకం ప్రాణానికన్న మిన్నగా భావించే మానం పోయిందని ముక్తకంఠంతో ఘోషిస్తున్న మహిళలను నమ్మకపోవడం, పైగా వారివి తప్పుడు ఆరోపణలని నివేదికలు తయారు చేయడం గిరిజన మహిళా వ్యతిరేక చర్యలే అవుతాయి. ఒకవేళ ఈ అత్యాచారాల్ని ఏ రాజకీయ పార్టీ వాళ్లో, ఉన్నతవర్గాల వాళ్లో, ఇతర వర్గాల వాళ్లో జరిపినట్లైతే పాలకపక్షం ఎంత రాజకీయం చేసేదో. గిరిజనుల ఓటు బ్యాంకును ఎంతగా కొల్లగొట్టాలనుకునేదో. ఈ అత్యాచారాల్ని జరిపింది పోలీసులు కాబట్టి, పాలకపక్షంగా పోలీసుల్ని ప్రశ్నించడమంటే, తనను తాను ప్రశ్నించుకోవడమే. ఇంకా చెప్పాలంటే సోనియాగాంధీ, వై.ఎస్.ఆర్. తమను తాము ప్రశ్నించుకోవడమే అవుతుంది. పాలకపక్షానికి, పోలీసుల కున్న సంబంధమే ప్రజాస్వామిక విలువలుగా ప్రచార మవుతుంటే మహిళలకు, అందునా ఆదివాసి మహిళలకు ఏదో న్యాయం జరుగుతుందనుకోవడం నేతి బీరకాయలో నేతిని వెతకడమే.

అయేషా కేసులో నార్కో పరీక్షలు అవసరమైతే పోలీసులకు కూడా చేయిస్తామని తెలిపిన హోం మంత్రి జానారెడ్డి వాకపల్లి సంఘటనలో పాల్గొన్న పోలీసులకు ఈ పరీక్షలు చేయిస్తామని మాటవరసకు కూడా అనలేక పోయారు. ఈ పరీక్షలు న్యాయంగా జరుగుతాయనే భ్రమలేవి గిరిజన మహిళలకు లేవు. ఎందుకంటే వారేమీ మన తల్లుల్లో, అక్కల్లో, చెల్లెండ్లో కాదు కదా. ఉన్నత వర్గాల స్త్రీలంతకన్నా కారు కదా.

నిజంగా ప్రభుత్వం ఆదివాసి మహిళల పక్షాన ఉందని భావిస్తే స్థానిక శాసనసభ్యులు రాజారావు కోరినట్లు రిటైర్డ్ ఐ.ఎ.ఎస్. అధికారి ఎస్. ఆర్. శంకరన్‌తో ఎందుకు విచారణ చేయించడం లేదు? ప్రభుత్వం దృష్టిలో గిరిజన మహిళలపై జరిగే అత్యాచారాలు పెద్ద నేరం కాదనా? ఓట్లకున్న విలువ శీలానికి లేకపోవడం ఈ దేశ మహిళల, ముఖ్యంగా గిరిజన మహిళల దౌర్భాగ్యం అందామా? ◆

**ఏ పార్టీ వైఖరి ఎట్లున్నా తెలంగాణ అంశం అన్ని పార్టీలను ఒక చౌరస్తాలో నిలబెట్టిందనీ, ఉపఎన్నికల అనంతరం రాజకీయ పార్టీల పరిస్థితి సంక్షోభంలో పడనున్నదనీ అంటున్నారు నాగోబా**

# టి.ఆర్.ఎస్. రాజీనామాలు - తదనంతర పరిణామాలు

టి.ఆర్.ఎస్. ప్రజాప్రతినిధుల మూకుమ్మడి రాజీనామాలు తెలంగాణ రాజకీయోద్యమాన్ని కీలక మలుపు తిప్పింది. అదే సమయంలో సమైక్యవాదాన్ని సమర్థించే రాజకీయ పార్టీలలో తెలంగాణ వాదుల ఒత్తిడి తీవ్రతరమైంది. టి.ఆర్.ఎస్. ప్రజా ప్రతినిధుల రాజీనామాలను తెలంగాణ ప్రజలు, ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక వర్గాలు, మేధావులు, కవులు, రచయితలు, కళాకారులు, విద్యార్థులు స్వాగతించారు. వారి పదవీ త్యాగాన్ని అభినందిస్తూ ఇప్పటికే అన్ని జిల్లాలలో వందలాది అభినందన సభలు జరిగాయి. ఇంకా జరుగుతూనే ఉన్నాయి. ఇవి కేవలం అభినందన సభలు గానేగాక తెలంగాణ పట్ల కాంగ్రెస్ పార్టీ అనుసరిస్తున్న ద్రోహ పూరిత, వంచనపూరిత వైఖరిని, గత యాభై ఏండ్లుగా తెలంగాణ పట్ల కాంగ్రెస్ ద్రోహ చరిత్రను, వంచనా చరిత్రను చర్చకు పెడుతున్నాయి. కాంగ్రెస్ తెలంగాణను మరోసారి ద్రోహం చేయటానికే సిద్ధపడిందని తెలంగాణ ప్రజలు గాఢంగా విశ్వసిస్తున్నట్లు తెలంగాణ వ్యాప్తంగా జరుగుతున్న సంఘీభావ సభలు, అభినందనలు, దీవెనలు టి.ఆర్.ఎస్. ప్రజా ప్రతినిధులను ఉత్సాహ పరుస్తున్నాయి. వారు కూడా తెలంగాణ రాష్ట్ర సాధనకోసం పదవులే కాదు ప్రాణ త్యాగాలకు కూడా సిద్ధమేనని ప్రజలకు వాగ్దానం చేస్తున్నారు. మొత్తం నాలుగు పార్లమెంట్, పదహారు శాసనసభ స్థానాలను గెలుచుకునే లక్ష్యంతో పార్టీ వ్యూహాలు రూపొందించుకుంటున్నది. ఈ క్రమంలో తెలంగాణ ప్రజలతో సంభాషించడానికి ప్రజాసంఘాలు, ఈ సంఘీభావ సభలు వారికి ఉపకరిస్తున్నాయి. ఈ సంభాషణ సాగుతున్న తరుణంలోనే ఇటు సమైక్యవాద పార్టీలలో, కాంగ్రెస్‌లోనూ రాజకీయ ప్రకంపనలు తీవ్రతరమవుతున్నాయి.

మొదట కాంగ్రెస్ పరిస్థితిని విశ్లేషించుకోవాలి. కాంగ్రెస్ వారు ఇప్పుడు ఎన్నితీర్లుగా మేం తెలంగాణకు వ్యతిరేకం కాదు, తెలంగాణ అంశాన్ని సోనియాగాంధీ నిర్ణయానికి వదిలేసాం, ఆమె నిర్ణయమే మాకు శిరోధార్యం అని చెపుతూ వస్తున్నా ఆచరణలో కాంగ్రెస్ తెలంగాణ ఏర్పాటు దిశగా అడుగు వెయ్యడం లేదు. వెయ్యకపోగా వారి గోల్‌మాల్ ప్రకటనలు తెలంగాణను కాంగ్రెస్ మరొక్కసారి వంచించేందుకే సిద్ధపడిందన్న అభిప్రాయాన్నే ప్రజలను నమ్మేలాగా చేస్తున్నాయి. మరోవైపు మొన్నటిదాకా సోనియాగాంధీ నిర్ణయమే శిరోధార్యం అన్న ముఖ్యమంత్రి, తెలంగాణపై నిర్ణయించేందుకు ఆమె మోనార్క్ కాదు, ఆమెకు పరిమితులు ఉన్నాయి. ఈ టెర్మ్‌లో తెలంగాణను ఇచ్చే అవకాశం లేనేలేదని కుండబద్దలు కొట్టేశాడు. దాంతో కాంగ్రెస్ వైఖరి మరింత స్పష్టమైంది. సీనియర్ కాంగ్రెస్ నాయకుడు, పార్లమెంట్‌లో కాంగ్రెస్ ఉపనాయకుడు, కాంగ్రెస్ వర్కింగ్ కమిటి సభ్యుడు అయిన జి. వెంకటస్వామి బృందానికి సోనియాగాంధీ అపాయింట్‌మెంట్ నిరాకరించడంతో తెలంగాణపై సోనియాగాంధీ మనోభావాలు ఏమిటో వెల్లడైంది. వై. ఎస్. ని కాదని సోనియా తెలంగాణ అనుకూల నిర్ణయం తీసుకుంటుందన్న భ్రమలు తెలంగాణ వాదులెవ్వరికీ ఇప్పుడులేవు. అందుకే సోనియాగాంధీ తెలంగాణ ఇస్తుందన్న విశ్వాసం నాకుంది అని ప్రకటించిన మధుయాష్కిని ఉస్మానియా విద్యార్థులు నిలదీయక తప్పలేదు.

1956లో జవహరలాల్ నెహ్రూని, 1971లో ఇందిరా గాంధీని లొంగదీసుకుని తమకు అనుకూలంగా నిర్ణయాలను వెలువరింప జేసుకున్న కోస్తా వలసపాలకులు సోనియా గాంధీని లొంగతీసుకోవడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. అంతర్గతంగా తెలంగాణలోనే కోస్తా వలస పాలకులకు దళారులుగా పని చేయడానికి ద్రోహులు అప్పుడూ ఉన్నారు. ఇప్పుడూ ఉన్నారు.

తెలంగాణ వంటి వెనుకబడిన ప్రాంతాలలో దళారి నాయకత్వం ఎపుడూ సిద్ధంగానే ఉంటుందన్నది చరిత్ర చెప్పిన సత్యం. ఇటువంటి దళారి నాయకత్వం జార్ఖండ్ ఉద్యమంలోనూ, ఛత్తీస్‌గఢ్ ఉద్యమంలోనూ ఉన్నది. అయితే పాలవర్గాల కుట్రలు, కుతంత్రాలను చేధించి అంతిమంగా విజయం సాధిస్తారనే దానికి ఆ రాష్ట్రాల ఉద్యమాలే సాక్ష్యంగా ఉన్నాయి. ఇవ్వాళ తెలంగాణ ఉద్యమం కూడా రాజకీయ పరిణతితో పరిస్థితులను విశ్లేషించుకుంటున్నది. ద్రోహులెవరు? దళారులు ఎవరు? కోవర్టులెవరు? అవకాశవాదులెవరు? వీరి విషయంలో ఉద్యమం స్పష్టమైన సోయితోనే ఉన్నది. ఆ సోయి ఉన్నది కనుకనే మార్చి 24న జరుగబోయే కాంగ్రెస్ సీనియర్ల భువనగిరి రణభేరి రద్దయిన మరునాడే తెలంగాణ ప్రజా సంఘాలు, ఉస్మానియా విద్యార్థులు హోలీ సంబురాల్లో భాగంగా కాంగ్రెస్ ద్రోహుల శవయాత్రలు నిర్వహించి, పేరు పేరునా వారికి తెలంగాణ ప్రజల పక్షాన సంతాపం ప్రకటించారు. వారి ద్రోహానికి నిరసనగా భువనగిరిలో సభను తాము జరిపి తీరుతామని ప్రకటించారు. (ఈ వ్యాసం అచ్చయ్యేనాటికి ప్రజా సంఘాల ఆధ్వర్యంలో భువనగిరి సభ విజయవంతంగా జరిగి ఉంటుంది.)

ఇక సీనియర్ల తెలంగాణ నాటకం ఉత్త బూటకమని ఇదంతా వైఎస్ స్క్రీన్‌ప్లేలో భాగంగానే జరిగిందని నమ్మేవారి సంఖ్య ఇప్పుడు 85 శాతం పైగా ఉందని తెలుస్తున్నది. రాష్ట్రపతి పదవికోసం గవర్నర్ పదవి కోసం, మంత్రి పదవికోసం ఎదురుచూసి భంగపడిన సీనియర్లే ఈ తెలంగాణ నినాదాన్ని ఎత్తుకోవడం తెలంగాణ ప్రజలు గమనించారు. కాంగ్రెస్‌లో మాట్లాడుతున్న వారినే శంకించడం ఎందుకులే, కాలం వారి నిజవైఖరిని తేలుస్తుందని వేచి చూశారు. భువనగిరి రణభేరి సభ రద్దుతో వారూ కోస్తా దళారీ వర్గంగానే తేలిపోయారు. వీరంతా కాంగ్రెస్ స్కిన్‌సేవర్స్‌గా పని చేస్తున్నారని స్పష్టమైంది. మధుయాష్కిపై ఇటువంటి ఆరోపణలు చాలాకాలం నుంచే ఉన్నాయి. తెలంగాణ అంశం మొత్తంగా టి.ఆర్.ఎస్. చేతుల్లోకి వెళ్లకుండా ఉండటానికే ఈ స్క్రిప్ట్ రాయబడిందని ఇప్పుడు స్పష్టమైంది. స్క్రిప్ట్‌ను రాయడంలో అజాగ్రత్తల వల్ల మధ్యలోనే అభాసుపాలయింది. ఈ మొత్తం నాటకం అంతిమంగా టి.ఆర్.ఎస్.కే ప్రయోజనం చేకూర్చడం కాంగ్రెస్‌కు విషాదం. ప్రజలకు, ఉద్యమానికి విజయం. కాంగ్రెస్ మొదట్నుంచీ తెలంగాణకు వ్యతిరేకంగా, కోస్తా భూస్వామ్య సంపన్నవర్గాల ప్రయోజనాలకు అనుకూలంగా పని చేసిందనీ, ఇప్పుడు అదే ధోరణితోనే వ్యవహరిస్తున్నదని రూఢీ అయ్యింది. తెలంగాణ అంశాన్ని తేల్చేందుకు సోనియాగాంధీకి సరి అయిన సమయం ఎపుడు వస్తుందో తెలియదు కాని కాంగ్రెస్‌ని భూస్థాపితం చేయడానికి తెలంగాణ ప్రజలకు సరి అయిన సమయం రానే వచ్చింది. వలసపాలకులు చేస్తున్న అభివృద్ధి జపం, వారి దళారులు వేస్తున్న పిల్లిమొగ్గలు తెలంగాణ ప్రజల ఆకాంక్షలను మరిపించలేవు.

మరోవైపు తెలుగుదేశంలో తెలంగాణం ప్రకంపనాలని సృష్టిస్తోంది. ఇటీవల కడియం శ్రీహరి పత్రికలకిచ్చిన ఇంటర్వ్యూ పార్టీని కుదిపి వేసింది. పార్టీ తెలంగాణ అనుకూల నిర్ణయం తీసుకోక పోయినట్లయితే నాదారి నేను చూసుకోవాల్సి వస్తుందని ఆయన హెచ్చరించారు. తెలంగాణలో ఏ రాజకీయ నాయకుడైనా ఇవ్వాళ ఇటువంటి అనివార్యతనే ఎదుర్కొంటున్నాడు. ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా తాము నడవలేక పోయినట్లయితే తనకు రాజకీయ భవిష్యత్తు ఉండదని వారికి తెలుసు. అందుకే కడియం శ్రీహరిలాగా స్పష్టంగా ప్రకటించక పోయినప్పటికీ తెలంగాణ సమస్యలపై ఉద్యమిస్తున్నారు. గోదావరి జలాల కోసం పాదయాత్ర, దువాన్ని గూడెం – నాగార్జునసాగర్ టెయిల్‌పాండ్ ప్రాజెక్ట్‌కు వ్యతిరేకంగా గళమెత్తడం, ఎల్లంపల్లి అక్రమాలపై ప్రభుత్వాన్ని నిలదీయడం, ఎల్లంపల్లిని మరో సింగూరుగా మార్చే ప్రభుత్వ కుట్రను ఎండగట్టడం. ఇట్లా అనేక సమస్యలపై దేవేందర్‌గౌడ్ ఉద్యమించడం తెలంగాణలో తన రాజకీయ భవిష్యత్తును నిలుపుకోవడం లో వ్యూహాత్మకంగా వ్యవహరిస్తున్నట్లు రాజకీయ పరిశీలకులు అంచనా వేస్తున్నారు. అయితే తెలంగాణ ప్రజలు ఇంతటితో సంతృప్తి పడజాలరు. స్పష్టమైన తెలంగాణ అనుకూల వైఖరితో ముందుకు రావాలని తెలంగాణ వాదులు దేవేందర్‌గౌడ్‌ని ఒత్తిడి పెడుతున్నారు. తెలంగాణ ఉద్యోగుల సంఘం 2008 డైరీ ఆవిష్కరణ సభలో దేవేందర్‌ని అడ్డుకొని తెలంగాణపై స్పష్టమైన వైఖరిని ప్రకటించమని నిలదీసారు. ఆ ఒత్తిడికి తలఒగ్గి, 'మేం మాట్లాడందే చరిత్ర సృష్టిస్తాం' అని ప్రకటించవలసి వచ్చింది. అదే సభలో పెద్దిరెడ్డి జై తెలంగాణ నినాదంతో తన ప్రసంగాన్ని ముగించారు. తెలంగాణ విద్యావంతుల వేదిక మార్చ్‌లో అంబేద్కర్ కాలేజీలో ఏర్పాటు చేసిన సదస్సులో సి.ఎచ్. రాజేశ్వరరావు ఇటువంటి అనుభవాన్నే చవిచూశారు. చివరకు పార్టీ వైఖరిని తాను ప్రకటించలేనని, వ్యక్తిగతంగా తాను తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు అనుకూలమని ప్రకటించారు. ఇట్లా తెలుగుదేశంలోని తెలంగాణ నాయకులకు నిత్యం ఎదురవుతున్న చేదు అనుభవాలివి. ఈ సంఘటనలు వాళ్లను ఆత్మ విమర్శకు పురిగొల్పు తున్నాయి. పార్టీ తెలంగాణ అనుకూల నిర్ణయం చేయకపోతే పార్టీకి పుట్టగతులుండవని వారు నమ్ముతూ పార్టీకీ సూచనలు చేయకతప్పటం లేదు. శ్రీహరి ప్రకటన తెలుగుదేశం పార్టీలో పుట్టిన ప్రకంపనలకు పరాకాష్టగా భావించవచ్చు. ఉప ఎన్నికల అనంతరం ఇది మరింత తీవ్రతరం కావడం ఖాయంగా కన్పిస్తున్నది.

సిపిఎం నలువైపుల నుండి విమర్శలను ఎదుర్కొంటున్నది. టంకశాల అశోక్ సిపిఎం అనుసరిస్తున్న తెలంగాణ వ్యతిరేక విధానాలని వారు ప్రవచిస్తున్న భాషా రాష్ట్రాల సిద్ధాంతం ఎంతటి పిడివాదంగా మారిందో అది స్టాలిన్ చెప్పిన జాతుల సమస్యకు ఎట్లా వ్యతిరేకమో పూర్వ పక్షం చేస్తూ ఇటీవలె వ్యాస పరంపర వెలువరించారు. టంకశాల అశోక్ లేవనెత్తిన అంశాలపై, సంధించిన ప్రశ్నలపై వ్యూహాత్మక మౌనాన్ని ఆశ్రయిస్తున్నది. ప్రజలకు వివరణ ఇవ్వాల్సిన బాధ్యతను కూడా మర్చిపోయి మౌనాన్ని పాటించడం వారి అపరాధ భావనకు చిహ్నంగా పరిశీలకులు భావించక తప్పటం లేదు. వారిది గతితార్కిక భౌతికవాదం కాదు గతితార్కిక కోస్తావాదం అని విమర్శిస్తున్న తెలంగాణ వాదుల వాదనకు వారి మౌనం మరింత బలాన్నిచ్చింది. ఉభయ కమ్యూనిస్టు పార్టీలకు బలం, సభ్యత్వం తెలంగాణలోనే ఎక్కువ. అందుకే వారి ప్రజాప్రతినిధుల తెలంగాణ నుండే అత్యధికంగా ఎన్నికవుతారు. అయితే పార్టీమీద పట్టుమాత్రం కోస్తావారిదే. పార్టీ విధానాలను వారు నియంత్రించ గలుగుతున్నారు. తెలంగాణ వ్యతిరేక విధానాలను పార్టీమీద రుద్దగలుగుతున్నారు. ఇది పార్టీలోని తెలంగాణ కార్యకర్తలను అసహనానికి గురి చేస్తున్నప్పటికీ మింగలేక కక్కలేక భరించే స్థితిలో వారున్నారు. సిపిఐ కేంద్ర పార్టీ తీసుకున్న తెలంగాణ అనుకూల నిర్ణయాన్ని కూడా రాష్ట్ర పార్టీలో ఉన్న కోస్తా సభ్యుల మెజారిటీ కారణంగా తిరగదోడే పరిస్థితి కనిపిస్తోంది. సిపిఐ జాతీయ మహాసభల్లో కేంద్ర కార్యదర్శి బర్దన్ ప్రసంగంలో తెలంగాణ ప్రస్తావనే రాకపోవడం ఇందుకు నిదర్శనం.

ఏ పార్టీ వైఖరి ఎట్లున్నా తెలంగాణ అంశం అన్ని పార్టీలను ఒక చౌరస్తాలో నిలబెట్టింది. ఉప ఎన్నికల అనంతరం ఈ పార్టీల పరిస్థితి తీవ్రమైన సంక్షోభంలోకి పోవడం ఖాయం. ముఖ్యంగా సోనియా గాంధీ తెలంగాణ అనుకూల నిర్ణయాన్ని తీసుకోక తప్పదు. వై.ఎస్. చెప్పున్న అభివృద్ధా? తెలంగాణ డిమాండా? తేల్చడానికి ఉప ఎన్నికలు ఒక లిట్మస్ టెస్ట్. ఈ లిట్మస్ టెస్ట్‌లో ఫలితం తేలీన తర్వాత కూడా కాంగ్రెస్ తెలంగాణని ప్రకటించకపోతే వారిది దివాళాకోరు రాజకీయమే గాని ప్రజాస్వామిక కార్యాచరణ కాబోదు. ఉప ఎన్నికలు కాంగ్రెస్ రాజకీయ పరిణతికీ లిట్మస్‌టెస్ట్. ◆

**డా. డి.ఎస్. కోఠారి నివేదికలో సిఫారసు చేసిన కామన్ స్కూల్ విద్యా విధానం అమలు చేస్తే అంతరాలు సామాజిక తొలగడానికీ, అందరికి మెరుగైన విద్య అందించడానికీ తోడ్పడుతుందంటున్నారు పి. కృష్ణారావు**

# ప్రత్యామ్నాయ విద్యా విధానం - ఒక పరిశీలన

మన దేశంలో 1990లో సరళీకృత ఆర్థిక విధానం ప్రవేశపెట్టిన తరువాత దేశంలోను, రాష్ట్రంలోను అన్ని రంగాలతో పాటుగా విద్యారంగం కూడా క్రమక్రమంగా ప్రైవేటీకరణ చెందింది. 1990 ముందు రాష్ట్రంలోని ఉపాధ్యాయ సంఘాలు, విద్యార్థి సంఘాలు ముఖ్యంగా వామపక్ష భావజాలం గలవి శాస్త్రీయ విద్యా విధానాన్ని డిమాండ్ చేసేవి. అందుకోసం సభలు, సదస్సులు, ధర్నాలు, ర్యాలీలు మొదలైన పోరాట కార్యక్రమాలను నిర్వహిస్తూ ప్రజలను, ఉపాధ్యాయులను చైతన్య పరిచేవి. ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ విధానాలు తీవ్రతరం అయిన తరువాత విద్యారంగంలో తిరోగామి చర్యలు మొదలుకావడం జరిగింది. ఫలితంగా విద్య ప్రాథమిక దశ నుంచి ఉన్నత విద్య వరకు కొనుక్కొనే దశకు చేరింది. శాస్త్రీయ విద్యా విధానం డిమాండ్ మూలన పడిపోయింది. ఈ పరిస్థితులలో వచ్చిన డిమాండ్ 'కామన్ స్కూల్ విధానం'. ఆ కామన్ స్కూల్ విధానాన్ని ప్రవేశపెట్టాలని ఇప్పుడు చర్చ జరుగుతోంది.

ఇందులో భాగంగా ఫిబ్రవరి 2008లో రెండు ప్రాంతాలలో రెండు ఉపాధ్యాయ సంఘాలు మూడు రోజులపాటు రాష్ట్ర స్థాయి విద్యా వైజ్ఞానిక మహాసభలను నిర్వహించి, అందులో 'కామన్ స్కూల్ విధానం' ప్రవేశ పెట్టాలని ప్రధానంగా డిమాండ్ చేశాయి. ఈ రెండు సంఘాల రాష్ట్ర మహాసభలలో సుమారు ఇరవై వేల మంది పాల్గొని ఉండవచ్చని దినపత్రిక లో వచ్చిన వార్తలను బట్టి తెలుస్తోంది. రాష్ట్రంలోని మూడున్నర లక్షలమంది ప్రభుత్వ టీచర్లలలో ఇరవై వేల మంది సంఖ్య స్వల్పమే అయినప్పటికీ, అవి లేవనెత్తిన డిమాండ్ నేటి విద్యా విధానానికి ఒక 'ప్రత్యామ్నాయ విద్యా విధానం' గానే మనం భావించాలి. రాష్ట్రంలో ఈ రెండు ఉపాధ్యాయ సంఘాలే గాక మరో 18 చిన్నా, పెద్ద ఉపాధ్యాయ సంఘాలు పనిచేస్తున్నాయి. మొత్తం ఇరవై ఉపాధ్యాయ సంఘాలలో 17 ఉపాధ్యాయ సంఘాలకు ఉమ్మడి వేదిక 'జ్యాక్టో' పని చేస్తోంది. కామన్ స్కూల్ విధానం పట్ల ఈ సంఘాల వైఖరి ఏమిటన్నది బయటపడాలి. గత ఆరు దశాబ్దాలుగా మన రాష్ట్రంలోని ఉపాధ్యాయ సంఘాలు, వీటి ఐక్యవేదికలు ఉపాధ్యాయుల వృత్తిపరమైన, ఆర్థికపరమైన సమస్యల సాధన కోసం మాత్రమే పోరాటాలు నిర్వహించాయి తప్ప, విద్యారంగంలో మౌలిక మార్పుల కోసం అవి పెద్దగా పట్టించుకొని, పోరాటాలు నడిపిన చరిత్రే లేదు. అందుకే విద్యారంగ దుస్థితి ఈ స్థితికి వచ్చింది. ఎప్పుడో అడపాదడపాగా ఉమ్మడి ఎ.పి.టి.ఎఫ్., గత తొమ్మిది సంవత్సరాలుగా డి.టి.ఎఫ్. కొన్ని పోరాట కార్యక్రమాలను చేపడుతోంది. ఈ మధ్యకాలంలో నాలుగైదు ఉపాధ్యాయ సంఘాల సహకారంతో ఆంధ్రప్రదేశ్ విద్యా పరిరక్షణ కమిటీ విద్యారంగ సమస్యలపై కొన్ని సదస్సులు, పోరాట కార్యక్రమాలు నిర్వహించింది. ఫలితంగా కొంత ప్రచారం, చర్చ అయితే జరిగింది కానీ, చెప్పుకోదగ్గ ప్రతిఘటన అయితే మాత్రం జరుగలేదు.

అసలు కామన్ స్కూల్ విధానం అంటే ఏమిటి? దీన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎందుకు అమలు జరుపడం లేదు? దీని అమలు కోసం ఉపాధ్యాయులు, విద్యార్థులు, తల్లిదండ్రులు ఎందుకు పెద్ద ఎత్తున ఉద్యమించడం లేదన్న ప్రశ్నలు వేసుకొని కొంత చర్చ జరిగితే తప్ప, మనకు సరైన దారి కనబడదు. 1964లో కేంద్ర ప్రభుత్వం నియమించిన జాతీయ విద్యా కమిషన్ డా. డి.ఎస్. కొఠారి సుమారు రెండు సంవత్సరాలు అధ్యయనం చేసిన తరువాత 1966లో ఒక నివేదికను కేంద్ర ప్రభుత్వానికి అందజేయడం జరిగింది. ఆ నివేదికలోని ప్రధానమైన సిఫారసులలో కామన్ స్కూల్ విధానం ప్రధానమైంది. దేశంలోని సామాజిక, ఆర్థిక, రాజకీయ అంతరాలు పోవడానికి రాష్ట్రపతి పిల్లలు నుంచి చప్రాసీ పిల్లలవరకు ఒకే బడిలో చదవాలనీ, దాని ద్వారా అందరికీ మెరుగైన విద్యను అందించడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చర్యలు తీసుకోవాలనీ, అందుకోసం భారతదేశ జాతీయ ఆదాయంలో ఆరు శాతం కేంద్ర బడ్జెట్‌లోను, ముప్ఫై శాతం రాష్ట్ర బడ్జెట్‌లోను విద్యకు కేటాయించాలనీ సూచించడం జరిగింది. మరో ముఖ్యమైన సిఫారసు ఏమంటే ఆయా ప్రాంతాల వారిగా ఒకటి నుంచి పదవ తరగతి వరకు మాతృభాషలోనే విద్యను నేర్పి, అందుకు తగిన పాఠ్య పుస్తకాలను తయారు చేయాలని చెప్పడం జరిగింది. కానీ పై సిఫారసులను వేటినీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేయకపోగా, విద్యారంగంలో అంతరాలను పెంచే విధానాలను చేపడుతోంది. ఉన్న వారికి ఒకరకమైన విద్య, లేని వారికి ఒకరకమైన విద్యను నేర్పించడం వలన మన సమాజంలో ఆర్థిక, సామాజిక, రాజకీయ అంతరాలు పెరిగి, అవి అశాంతికి దారి తీస్తున్నాయి. 'కామన్ స్కూల్ విధానాన్ని' గత నాలుగు దశాబ్దాలుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎందుకు అమలు జరపడంలేదని మనం ప్రశ్నించుకొంటే ముందుగా పాలకవర్గ స్వభావాన్ని మనం అర్థం చేసుకోవాలి. 1947 అధికార మార్పిడి జరిగిన తరువాత భారతదేశ నాయకులకు, రాజకీయ పార్టీలకు అధికారం లభించింది తప్ప, ఆర్థిక స్వావలంబనగానీ, నిజమైన గణతంత్ర రాజ్యంగానీ ఏర్పడలేదు. వలస పాలన ప్రత్యక్ష విధానం నుంచి పరోక్ష విధానానికి

**బహుళజాతి కంపెనీల కోసం అడవుల్లో జీవించే ఆదివాసులనే నిర్దాక్షిణ్యంగా, బలప్రయోగం ద్వారా గెంటి వేస్తుంటే, నోరులేని మూగజీవాల సంగతి వేరేచెప్పాలా అని ప్రశ్నిస్తున్నారు జి. రమేష్**

# మైనింగ్ తవ్వకాలు - జీవరాశులు

అడవి తల్లి గర్భంలో లెక్కలేనన్ని నిక్షేపాలు. తవ్వినకొద్ది తరగని నిధులు వాటిని ఆబగా అందుకోవడానికి, అందినంత తవ్వి తీసుకోడానికి మనిషి చేయని ప్రయత్నమంటూ లేదు. లోహ యుగంలోనే అది మొదలైంది. నాగరికతతోపాటు పెరిగి పెద్దదైంది. అవసరాలకో, ఆకలి తీర్చుకోవడానికో ఖనిజ సంపద తవ్వుకోవడం కాదు. ఇప్పుడది సామ్రాజ్యవాద యుగంలో పక్కా వ్యాపారం డాలర్లు కురిపించే ఆధునిక బేరం. ఆ తవ్వకాలు, గునపపు పోట్ల కారణంగా, ఒక్క మనదేశంలోనే సుమారుగా 90కి పైగా వన్యప్రాణి క్షేత్రాలకు ముప్పు ఏర్పడింది. ధనబలం ఉన్నవాడి రాజ్యంలో మూగజీవుల కష్టాలు, అమాయక ఆదివాసీల కష్టాలు పట్టేదెవరికి? ఇనుప ఖనిజం తవ్వకం వల్ల కుద్రేముఖ్ జాతీయ పార్క్, బాక్సైట్ మైనింగ్ వల్ల బూక్సా పులుల అడవి, కాపర్ మైనింగ్ వల్ల కాంచా పులుల అడవి, స్టోన్‌మైనింగ్ వల్ల జామ్వారామ్‌గర్ వన్యప్రాణి క్షేత్రం, అంతరించిపోవడం ఖాయం.

ఇక రెండో శత్రువు, ప్రాజెక్ట్‌లు. అస్సాం, అరుణాచల్‌ప్రదేశ్‌లలోని లోయర్ సుభాన్‌శ్రీ హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్ట్‌వల్ల టేలీవేలీ అభయారణ్యాలకు అందులోని చిరుత పులులకు, ఏనుగులకు తీవ్రమైన కష్టాలొచ్చాయి. అంతేకాదు నదుల్లోని డాల్ఫిన్‌లకు కూడా గడ్డుకాలం వచ్చింది. మహారాష్ట్రలోని నీటి ప్రాజెక్ట్‌ల పుణ్యమాని, ఒకప్పుడు అందారి ప్రాంతంలో స్వేచ్ఛగా తిరిగిన పులులు, ఇప్పుడు క్షణమొక గండంగా బతకాల్సి వచ్చింది. ఆ రిజర్వ్ అడవులకు తీవ్రమైన విఘాతం కలుగనుంది. రాజస్థాన్‌లోని డిసెర్ట్ నేషనల్ పార్క్‌కు ఆ ప్రాంతంలో నెలకొల్పిన నూనె శుద్ధి కర్మాగారం పీకల మీది కత్తిలా తయారయ్యింది.

---

మారింది. గ్రామీణ ప్రాంతంలో భూస్వామ్య, పెత్తందారీ విధానం అలాగే కొనసాగుతోంది. ఒక్కముక్కలో చెప్పాలంటే భారత సమాజం అర్ధవలస, అర్ధ భూస్వామ్య విధానాన్ని కొనసాగిస్తూ, ఇక్కడి బడా పెట్టుబడిదారులు బహుళజాతి సంస్థలకు సామ్రాజ్యవాద దేశాలకు దళారులుగా పని చేయడం జరుగుతోంది. కావున ఇక్కడి పెట్టుబడిదారీ వ్యవస్థ దళారీ స్వభావం కలిగి ఉంది. ఇటువంటి వర్గ స్వభావం గల పాలకవర్గాలు (ఏ పార్టీ, కూటమి అధికారంలో ఉన్నప్పటికీ) సోషలిస్ట్ భావజాలం గల 'కామన్ స్కూల్ విధానాన్ని' విద్యారంగంలో ప్రవేశపెట్టడానికి ముందుకొస్తారని ఆశించడం భ్రమ అవుతుంది. అయితే అలాంటప్పుడు ఈ డిమాండ్ ఎందుకు చేస్తున్నారు అని మీరడగవచ్చు. అనేకమంది రక్తతర్పణతో సాగిన భారత స్వాతంత్ర్యోద్యమం, ఫలితంగా తయారు కాబడిన భారత రాజ్యాంగం, అందులోని ప్రాథమిక హక్కులు, ఆదేశిక సూత్రాలు అన్నీ ఈ దేశ పీడిత తాడిత ప్రజలు పోరాడి సాధించుకొన్నవి. అందులో భాగంగానే భారత రాజ్యాంగంలోని ప్రవేశికలో 'సమ సమాజం' స్థాపిస్తామని ప్రకటించుకోవడం జరిగింది. కాబట్టి ఒక దీర్ఘకాలికమైన డిమాండ్‌గానైనా 'కామన్ స్కూల్ విధానాన్ని' మనం చేపట్టాలి. అందుకోసం పాలకులపై ఒత్తిడి తీసుకొని రావాలి. అందరికీ మెరుగైన విద్య అన్నది 'కామన్ స్కూల్ విధానం' ద్వారా సాధ్యమవుతుందని ప్రచారం చేయాలి. అది సాధించే వరకు పోరాటాలు నిర్వహించాలి.

ఇక్కడ మరో ప్రశ్న వేసుకోవాలి. కామన్ స్కూల్ విధానం కోసం ప్రజలు ఎందుకు పెద్ద ఎత్తున ఉద్యమించడం లేదు. ఇది కొద్దిమంది ఉపాధ్యాయులకో, విద్యార్థి సంఘాలకో, విద్యావేత్తలకో ఎందుకు పరిమితమైపోతున్నది? అవును నిజమే ప్రజల నుంచి పెద్ద ఎత్తున ప్రతిఘటనా పోరాటాలు ఈ డిమాండ్ సాధన కోసం జరుగడంలేదు. అలా జరగకపోవడానికి కారణం దేశంలోను, రాష్ట్రంలోను ప్రజలలో వెనుకబాటుతనం కొంత కారణమైతే, మరో ముఖ్య కారణం పేద, మధ్య తరగతి వర్గాలు వివిధ పాలకవర్గ పార్టీల వెనుక చీలిపోయి ఉండడం. ఇలా చీలిపోయి ఉన్న ప్రజలను ఆయా పాలకవర్గ పార్టీలు సంస్కరణలు, సబ్సిడీల పేరుతో తమ గుప్పిటలో ఉంచుకొని, అభివృద్ధికరమైన, ప్రగతి శీలమైన ఉద్యమాల వైపు వెళ్లకుండా వారిని ఆటంకపరుస్తూ వారి వారి చైతన్యాన్ని మొద్దుబారుస్తున్నాయి. ఇలా ఎటువంటి ప్రగతిశీలమైన డిమాండ్ల పట్లనైనా ఒకటే స్పందన కనిపిస్తుంది. కొంత చైతన్యం గల, వామపక్ష భావజాలం గల సంస్థలు ముందుకొచ్చి ప్రజలను చైతన్యం చేసి, ప్రతిఘటనా పోరాటాలు నిర్వహిస్తే, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తీవ్రమైన నిర్బంధాలను ప్రయోగించి ఆయా ఉద్యమాలను అణచి వేయడం పరిపాటిగా మారిపోయింది.

కావున ఇప్పుడు బలంగా ప్రత్యామ్నాయ విద్యా విధానం కోసం వినబడుతున్న 'కామన్ స్కూల్ విధానం' డిమాండ్ ఒక దీర్ఘకాలికమైన సోషలిస్ట్ నినాదంగా మనం చూడాలి. తక్షణ డిమాండ్‌గా 'ప్రభుత్వ రంగ పాఠశాలలను బలోపేతం చేయడానికి', విద్యారంగ పరిరక్షణ' కోసం ఉద్యమాలు చేపట్టాలి. అందుకోసం కలిసివచ్చే ఉపాధ్యాయ, విద్యార్థి, ప్రజా సంఘాలతో ఒక విశాలమైన ఐక్య సంఘటన కోసం కృషి జరగాలి. ఆ కృషిని ప్రగతిశీలమైన భావజాలంగల సంస్థలు, విద్యావేత్తలు చేయగలరని ఆశిద్దాం. ◆

జార్ఖండ్‌లో హద్దూ అదుపూ లేకుండా ఇనుప ఖనిజం తవ్వకాలకు జిందాల్, మిట్టల్, టాటాలకు అనుమతులు మంజూరు చేయడంతో అక్కడ సారియాకెలా ఖరస్వా ఏనుగులకు ప్రత్యేకించిన ఓ అభయారణ్యం మాయమైంది. బీహార్‌లోని వాల్మీకి పులుల అడవిలో మైనింగ్‌కి అనుమతినివ్వడంతో తమ రాజ్యంలోనే అవి కట్టుబానిసలై పోయాయి. రాజసాన్ని వదిలి నక్కి నక్కి అడుగులేస్తున్నాయి. చత్తీస్‌గఢ్‌లో బుద్ధఘాట్ హైడల్ ప్రాజెక్ట్ వల్ల హిమాచల్‌ప్రదేశ్‌లోని గ్రేట్ హిమాలయన్ జాతీయ పార్క్‌లో ఉన్న జీవరాశికి పెనుముప్పు వాటిల్లనుంది. జార్ఖండ్‌లోని నార్త్ కరాన్‌పురా వేలిలో బొగ్గు గనుల తవ్వకాలు, పాలమేర్, కోనార్ ప్రాంతాలలో విటల్ ఏనుగులు తిరిగేటందుకు ఆటంకంగా మారింది. ఒరిస్సాలోని ధమ్రాపోర్ట్ ఏర్పాటు కోస్తా నియంత్రణ మండలికి పూర్తి విరుద్ధమే కాక గెహ్రీమాత ప్రాంతంలో ఆలివ్ రిడ్లే తాబేళ్ల గుడ్లు పెట్టే ప్రాంతానికి ప్రమాదం ఏర్పడింది. ఇలా దేశంలోని అభయారణ్యాలకు, జాతీయ పార్క్‌లకు రక్షణలేని దుస్థితి ఉందిప్పుడు. మిగిలిన ప్రాంతాల్లోను ఇదే పరిస్థితి కొనసాగుతోంది. అడవుల్లో జీవించే ఆదివాసులనే నిర్దాక్షిణ్యంగా బలప్రయోగం ద్వారా గెంటివేస్తున్నారంటే నోరులేని మూగ జీవులు ఒకలెక్కన! బహుళజాతి సంస్థల లాభాపేక్ష, మరీ ముఖ్యంగా అమెరికా సామ్రాజ్యవాదం, ఆర్థిక సంక్షోభం నుండి గట్టెక్కడానికి డాలర్లతో ఖజానా నింపుకోవాలనుకున్న ప్రభుత్వ దురాశ ఫలితంగా జీవావరణ చక్రం (నేచర్ సైకిల్) తలకిందులవుతోంది. ఫలితంగా మానవ, జంతు, జీవరాశుల మనుగడ ప్రశ్నార్థకంగా మారింది.

ఇటీవలి కాలంలో ఒరిస్సా రాష్ట్రంలోని పలు ఆదివాసీ ప్రాంతాల్లో గనులు తవ్వి పోసుకునే బహుళజాతి సంస్థలు ఎక్కువయ్యాయి. బాక్సైట్, క్రోమైట్ తవ్వకాలతో వేలాది ఎకరాల్లో అడవులు అంతరించి పోయాయి. ఆదివాసీలు నిరాశ్రయులయ్యారు. దీంతో అక్కడ మనుషులు, సమస్త జీవరాశులు నీడకోల్పోయాయి. ఏనుగులు, ఇతర జంతువులు మనుష్యులు లాగే పొరుగున ఉన్న శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలకు వలసపోతున్నాయి. ఇలా వలస వచ్చిన ఏనుగుల ఆగ్రహానికి ఇప్పటికే 13 మంది మరణించారు. మూడు ఏనుగులు నేల కొరిగాయి. పర్యావరణం గురించి, వన్యమృగ సంరక్షణ గురించి అవగాహన లేని పాలకవర్గ నాయకులు ఆ ఏనుగుల్ని కాల్చి చంపాల్సిందిగా ఆదేశించారు. అధికారులు ఆ పని ఎందుకు చేయడం లేదో? అంటూ ప్రకటనలిచ్చి తమ అజ్ఞానాన్ని చాటుకున్నారు. అసలు ఆ ఏనుగులు ఒరిస్సా నుంచి ఎందుకు వచ్చాయి? అన్న అంశం మీద మాట్లాడిన వారే లేరు. మనదేశ విస్తీర్ణం పరిశీలించినట్లైతే మొత్తం 3.29 మిలియన్ చదరపు కిలోమీటర్లు. అందులో 0.6 మిలియన్ చదరపు కిలోమీటర్లలో అడవులు ఉన్నాయి. మన దగ్గర కనిపించే ఖనిజాల్లో చాలా భాగం అటవీ ప్రాంతం లోనే ఉన్నాయి. 1999 లెక్కల ప్రకారం 3100 మైనింగ్ పరిశ్రమలు 550 మిలియన్ టన్నుల ఉత్పత్తి జరిపాయి. అదే ఆఖరు సారి లెక్కలు తెలియడం. మన దేశంలో 13 వేల ప్రాంతాల్లో ఖనిజాల తవ్వకాలు జరుగుతున్నా వాటి విస్తీర్ణం గురించి ఏ ఒక్క ప్రభుత్వ శాఖ బయటపెట్టడం లేదు. అయితే దేశంలో 0.7 మిలియన్ హెక్టార్లలో మాత్రమే ఖనిజ సంపద లభ్యమవుతోందన్నది మాత్రం నిజమట. ఇందులో అధిక భాగం ఖనిజాలు అటవీప్రాంతంలోనే ఉండడం వల్ల అడవులకు, వన్యప్రాణులకు, తరతరాల నుండి అడవితల్లిని నమ్ముకొని, కాయకష్టం చేసుకుని బతుకుతున్న ఆదిమ తెగలకు తీవ్రమైన ముప్పు వాటిల్లుతోంది.

మైనింగ్ వల్ల డాలర్లు కురుస్తున్నాయని మురిసిపోతున్న ప్రభుత్వాలు పర్యావరణానికి ఏర్పడే నష్టాన్ని మాత్రం పట్టించుకోకపోవడం దారుణం. పట్టించుకున్నట్టు నటించినా అది ఒట్టి కపట ప్రేమే. యూనివర్శిటీల్లో 'ఎన్విరాన్‌మెంటల్ ఎకనామిక్స్' అనే అంశాన్ని ప్రవేశపెట్టడమూ అంతే మొక్కుబడి వ్యవహారం. వాస్తవంగా ఖనిజాలు తవ్వడం వల్ల వచ్చే ఆర్థిక లాభం ఎంత? పర్యావరణానికి జీవజాలానికి, అటవీ సంపదకు, ఇతరాలకు ఏర్పడే ముప్పెంత? ఇందులో ప్రజల ప్రయోజనమెంత? ప్రజలకు కలిగే నష్టమెంత? పాలకులు పొందే ప్రయోజనమెంత? అనే అంశాలపై అందరికీ ఒక అవగాహన కల్పించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. 1995 నాటి జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా లెక్కల ప్రకారం 10,052 మిలియన్ టన్నుల హెమటైట్, 3408 మిలియన్ టన్నుల మెగ్నటైట్, 167 మిలియన్ టన్నుల మాంగనీస్, 2,462 మిలియన్ టన్నుల బాక్సైట్, 461 మిలియన్ టన్నుల రాగి, 176 మిలియన్ టన్నుల సీసం, జింక్, 4386 మిలియన్ టన్నుల డోలమైట్, 75,678 మిలియన్ టన్నుల లైమ్‌స్టోన్, 86 మిలియన్ టన్నుల క్రోమైట్, 2,10,000 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు ఉన్నాయి. వీటిలో చాలా భాగం ఒపెన్ కాస్ట్ మైనింగ్ చేస్తున్నారు. దీనివల్ల అడవులు అంతరిస్తున్నాయి. అడవుల్లో జీవిస్తున్న ప్రజలు నిరాశ్రయులవుతున్నారు. శబ్ద కాలుష్యం పెచ్చు పెరుగుతోంది. జీవరాశి తీవ్రమైన అభద్రతకు గురయ్యి మైనింగ్ జరిగే ప్రాంతాల నుంచి దూరంగా వలసపోతున్నది. అంతటా ఇదే పరిస్థితి ఉండడంతో వాటికి ఎక్కడా సరైన నిలువనీడ దొరకడం లేదు. కడుపు నిండా తిండి దొరకడం లేదు. జీవచ్ఛవాల్లా పడి ఉంటూ వేటగాళ్ల బారినపడి ప్రాణాలు విడుస్తున్నాయి. మైనింగ్ కారణంగా అంతరిస్తున్న జీవరాశి సంఖ్య గణనీయంగా ఉంది. అడవిలో జీవిస్తున్న ఆదివాసులు తమ సంప్రదాయం ప్రకారం వేటాడితే మాత్రం అన్ని చట్టాలు వర్తింపజేసి జైల్లో వేస్తున్నారు. అదే కార్పోరేట్ సంస్థలు మైనింగ్ చేస్తుండటంతో సమస్త జీవరాశుల ఉనికి ప్రశ్నార్థకంగా మారింది. అయినా వాటిపై ఏలాంటి చట్టాలు వర్తింప జేయకపోవడం విడ్డూరంగా ఉంది. ఒరిస్సాలో బాక్సైట్ మైనింగ్ కోసం అడవుల నరికివేత మొదలైన తర్వాత అడవి దున్నలు, అడవి ఆవులు బాగా తగ్గిపోయాయి. ఒరిస్సా నుంచి బస్తర్ వెళ్లే దార్లో ఎక్కువగా తిరిగాడే పులులు, చిరుతలు, అడవి పిల్లులు, దుమ్మలగొండ్లు, చుక్కల దుప్పి మరీ నల్లపూసలైపోయాయి. నాగావళి, వంశధార నదుల పుట్టుక ప్రాంతంలోని చిత్తడి నేలల్లో కనిపించే చౌసింగాలు, నాలుగు కొమ్ముల దుప్పులు, కణుజులు అదృశ్యమయ్యాయి.

తూర్పు కనుమల్లో ఉండే 11 రకాల లకుముకు పిట్టలు, 13 రకాల తోక పిట్టలు, పదిరకాల వార్‌బ్లర్స్, 7 రకాల గుడ్లగూబలు ఇప్పుడసలు కనిపించడం లేదు. అంతర్జాతీయ మార్కెట్‌లో గిరాకీ ఉన్న తాబేళ్లు (స్టార్ టార్టాయిస్) గణనీయంగా తగ్గిపోయాయి. 30 ఏళ్ల కిందట అక్కడ 160 రకాల పక్షులు, 54 రకాల వలస జీవులు కనిపించేవి. ఇటీవల ఆంధ్రప్రదేశ్ నేచర్ హిస్టరీ సొసైటీ నిర్వహించిన సర్వే వివరాలను గనుక పరిశీలిస్తే, మహా అయితే వంద రకాలు మాత్రమే కనిపిస్తున్నాయనేది తేలింది. ఇతర జీవరాశుల గురించి సర్వేలు నిర్వహిస్తే ఇలాంటి దిగ్భ్రాంతిపరిచే నిజాలు ఇంకెన్ని బయటపడతాయో. గుడ్లగూబ విషయానికి వస్తే గతంలో ఆంధ్ర, ఒరిస్సా, మహారాష్ట్రల్లో కనిపించేది. మూడు రాష్ట్రాల్లోనూ బాక్సైట్ తవ్వకాలు ప్రారంభించిన తర్వాత

కనిపించడమే కరువైంది. విశాఖపట్నం జిల్లాలోని మన్యంలో చింతపల్లి, గూడెం కొత్తవీధి అటవీ ప్రాంతాల్లో అక్కడక్కడ దర్శనమిస్తోంది. ఇలాంటి పరిస్థితే కొనసాగినట్లైతే ఇవి కూడా పూర్తిగా అంతరించిపోయే ప్రమాదముంది. వాస్తవానికి మన్యంలో బాక్సైట్ తవ్వకాలు జరిగితే అడవి దున్నలు, అడవి ఆవులు, కణుజులు, చుక్కల దుప్పీలు, కొండ గొర్రెలు, మాను పిల్లులు, పులులు అసలుకే కనిపించకుండా పోతాయని విశాఖ రీజియన్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్ పద్మనాభం ఇటీవల తేల్చి చెప్పారు. ఇవే కాదు. అరకులోయ, అనంతగిరి కొండల్లో కనిపించే బంగారు బల్లులు, చింతపల్లి ప్రాంతంలో ఉండే దుమ్మలగొండ్లు, రేచుకుక్కలు, నాలుగు కొమ్ముల దుప్పీలు సైతం అంతరిస్తాయని హెచ్చరించారు. అయిన పాలకులు తమ మంకుపట్టు విడువటం లేదు.

అంతరిస్తున్న జీవరాశులపై అధ్యయనాలు జరపడం లేదు. పర్యావరణవేత్తలు, వన్యప్రాణి సంరక్షణ సంఘాలు నోరు మెదపడం లేదు. అదే ఆదివాసులు జీవిక కోసం అడవిని నరికితే మాత్రం వారిని అడివి విధ్వంసకులుగా, పర్యావరణ విఘాతకులుగా, ఆటవికులుగా చిత్రీకరిస్తున్నారు. ఆదివాసులు ఈ అడవి కోసం పోరు చేయకుంటే సమస్త జీవరాశులు ఎప్పుడో అదృశ్యమైపోయి ఉండేవి. ఇప్పటికీ ఉందంటే అది ఆదివాసుల చలవే. ఖనిజాల తవ్వకాలు జరుగుతున్న 13 వేల ప్రాంతాలను పరిశీలించినా, జలాశయాలు, ప్రాజెక్టులను పరిశీలించినా ఇదే పరిస్థితి. ఖనిజాలు అమెరికన్ డాలర్లు కురిపిస్తుంటే, ఈ పక్షుల గోల ఏమిటి? అభివృద్ధి కంటే వీటి మనుగడే ముఖ్యమా? అనేవారు ఈ ప్రపంచీకరణ యుగంలో చాలా మందే ఉన్నారు. నిజానికి మొత్తం అటవీ ప్రాంతంలో ఐదు శాతానికి మించి మైనింగ్ నిర్వహించరాదు. కానీ అందుకు పూర్తి విరుద్ధంగా ఎక్కడపడితే అక్కడ ప్రభుత్వ చిత్తం వచ్చినట్లు మైనింగ్ తవ్వకాలు జరుపుతున్నారు. దీని ప్రభావం మానవాళి మీద, సమస్త జీవజాలం మీద తీవ్రంగా పడుతున్నది. దీన్ని ఎవరు కూడా పట్టించుకోవడం లేదు. ఒకవేళ పట్టించుకొని ఎవరైనా దీనికి వ్యతిరేకంగా మాట్లాడినా, ప్రజా సమీకరణలు చేసిన, పాలకులు అభివృద్ధి నిరోధకులని ముద్రవేస్తున్నది. బలప్రయోగం ద్వారా నిర్దాక్షిణ్యంగా అణచివేస్తున్నది. దీనికి తాజా ఉదహరణలు విశాఖ జిల్లా జి. మాడుగుల మండలం వాకపల్లి మహిళలపై అత్యాచారాలు, కొయ్యూరు మండలం కన్నవరం వద్ద ముగ్గురు ఆదివాసీ యువకుల కాల్చివేత.

గడచిన ఐదేళ్లలో తూర్పు కనుమల్లోని అటవీ ప్రాంతంలో ఓ పద్ధతంటూ లేకుండా విచ్చలవిడిగా మైనింగ్ ప్రారంభించారు. ఆ ప్రభావం ఇప్పుడిప్పుడే మెల్లమెల్లగా కనిపిస్తోంది. కాలానుగుణంగా వర్షాలు కురవకపోడానికి ముమ్మాటికిదే కారణం. వర్షాలు కురవపోతే గడ్డి మొలవదు. గడ్డిలేకపోతే శాఖహార జీవులు అంతరించిపోతాయి. శాఖహార జీవులు అంతరిస్తే మాంసాహార జీవులు అంతరిస్తాయి. ఫలితంగా సూక్ష్మజీవులు అంతరిస్తాయి. దీంతో జీవవారణ చక్రం సమూలంగా దెబ్బతిని మానవాళి మనుగడ ప్రశ్నార్థకమవుతోంది. జీవావరణ వ్యవస్థకు ఒక్కసారి విఘాతం కలిగితే దాన్ని పునరుద్ధరించలేం. ప్రధానంగా ఒపెన్ కాస్ట్ మైనింగ్ చేయరాదు. దీనివల్ల పర్యావరణానికి ముప్పు వాటిల్లడమే కాదు, జలవనరులు దెబ్బతింటాయి. రోడ్లు ఇతర కట్టడాలకు అవసరమైన నల్లరాయి కోసం కొండలను పేల్చి వేయడం వల్లే చాలా నష్టాలు జరుగుతున్నాయి. ఎనుబోతు పిట్టలు, హార్న్‌బిల్ వంటి పక్షులు, పెద్ద పులులు కనిపించకుండా పోతున్నాయి. వాతావరణం వేడెక్కడం, అటవీ ప్రాంతంలో తేమశాతం తగ్గడం వల్ల ఆయా ప్రాంతాల్లో తిరుగాడే మానుపిల్లులు, దెక్కల పిల్లులు, అడవికోళ్లు, నెమళ్లు, కొండ గోరింకలు, విభిన్న రకాల రాబందులు, గుడ్ల గూబలు, కత్తిర పిట్టలు, ఒకటేమిటి చాలా రకాలు అంతరించిపోయాయి. ఇదే పరిస్థితి గనుక కొనసాగితే మానవాళి మనుగడ కష్టమయ్యే పరిస్థితి నెలకొంటుందని వివిధ సర్వేలు నివేదికలు, అధ్యయనాలు తెలుపు తున్నాయి.

నాగార్జునసాగర్, భాక్రానంగల్ మొదలుకొని వంశధార జలాశయం వరకూ ప్రాజెక్టల నిర్మాణాల వల్ల దెబ్బతిన్న అటవీ ప్రాంతాలను పరిశీలించినా, విభిన్న ఖనిజాల తవ్వకాలు నిర్వహిస్తున్న అటవీ భూములకు ప్రత్యామ్నాయంగా కేటాయించిన భూముల్ని పరిశీలించినా, తేలేది ఒకటే. స్వా(హా)తంత్ర్యం వచ్చినప్పటినుంచి ఇంతవరకు ఎక్కడా అడవులు పెరిగిన దాఖలాలు లేవు. అంతేకాదు, అటవీశాఖకు ప్రత్యామ్నాయంగా ప్రభుత్వం కేటాయించిన భూములకు ఎక్కడా లెక్కలులేవు. నిజానికి ఏదైనా ప్రాజెక్ట్, పరిశ్రమ, రిజర్వాయర్ నిర్మించాలనుకుంటే, అందుకు అటవీ భూములు తీసుకుంటే అందుకు ప్రత్యామ్నాయంగా భూములు కేటాయించాలి. అక్కడ సామాజిక అడవులు పెంచడానికి నిధులు మంజూరు చేయాలి. రికార్డుల్లో అదంతా జరుగుతున్నట్టే ఉన్నా భూమ్మీద మాత్రం ఒక్క కొత్త మొక్క మొలవటంలేదు. కొత్త భూముల్లో అడవులు పెంచితే వాటికి పట్టే కాలమెంత? ఖర్చెంత? మొదటి అడవిలో ఉన్న జీవరాశిని కొత్త ప్రాంతానికి తీసుకువెళ్లగలమా? అన్న అంశాలపై ఎందుకు పాలకులు ఆలోచన చేయడంలేదు. ఆంధ్రప్రదేశ్‌లో గడచిన అరవై ఏళ్లలో ప్రభుత్వాలు ప్రత్యా మ్నాయంగా కేటాయించిన అడవుల విస్తీర్ణం సుమారు 80 వేల ఎకరాలకు పైగా ఉంటుందని రికార్డులు చెబుతున్నాయి. కానీ ఇవన్నీ కాకి లెక్కలే.

## మనమేం చేయాలి?

విశాల మన్యంలో విలువైన అపారమైన గనులూ, ఖనిజాలు ఉన్నాయి. ఈ ప్రాంతమే కాదు, ఆదివాసీ ప్రజాభిమానులు ఎవరైనా ఈ దేశంలోని ప్రముఖ గనులనూ, ఖనిజాలనూ, భారీ ప్రాజెక్టలనూ చేర్చి పటం వేస్తే అవన్నీ ఆదివాసుల ప్రాంతాలే అవుతాయి. గతం కన్నా వర్తమానం ఈ వాస్తవాన్నీ మరింత స్పష్టంగా ప్రపంచం ముందు ఉంచగలుగుతుంది. ప్రపంచీకరణ ప్రైవేటీకరణ, సరళీకరణ రోజుల్లో దేశంలోని పెట్టుబడిదారులతో, బహుళజాతి సంస్థలతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కుదుర్చుకుంటున్న వందలాది ఒప్పందాలు ఆదివాసుల అస్తిత్వానికి, సమస్త జీవరాసుల ఉనికికి పెను ప్రమాదంగా తయారవుతున్నాయి. భారీ ప్రాజెక్టలతో స్వాతంత్ర్యానంతరం 90 లక్షల మంది ఆదివాసులు నిరాశ్రయులయ్యారు. ఇదంతా కేవలం మానవ సంపదనే కాకుండా, విస్తార అడవుల్లో ఆదివాసులతో చెలిమి చేసే సమస్త వన్యప్రాణిని క్రమంగా నాశనం చేస్తున్నాయి. అరుదైన వన్యప్రాణి జాతులు లుప్తమయిపోతున్నాయి. పీడిత ప్రజలు తమ అస్తిత్వం కోసం వారి జాతిసమగ్ర వికాసం కోసం నేలతల్లి గుండెల్ని తవ్విపోసే దుర్మార్గాని కి వ్యతిరేకంగా 'అడవిపై అధికారం ఆదివాసులదే' అనే నినాదంతో ఉద్యమాలు చేపడుతున్నారు. ◆

**రాజ్యాంగ పరిషత్తు సభ్యుడిగా, ఛైర్మన్‌గా, భారత ప్రభుత్వ ప్రథమ న్యాయశాఖ మంత్రిగా, అట్టడుగు వర్గాల ఆకాంక్షలకు ప్రతినిధిగా అంబేద్కర్ చేసిన కృషిని వివరిస్తున్నారు ఎం.విక్రమ్‌కుమార్**

# అంబేద్కర్ ఆశయాలు - ఆచరణ

**డా.** బి.ఆర్.అంబేద్కర్ భౌతికంగా తనువు చాలించి 51 సంవత్సరాలు, జన్మించి 116 సంవత్సరాలు పూర్తి అయ్యాయి. ప్రపంచంలో అత్యధికంగా 105 కోట్ల జనాభాతో రెండవ దేశంగా ఉన్న భారత సామాజిక వ్యవస్థను అత్యంత ప్రభావితం గావించిన స్ఫూర్తి ప్రదాత డా. బి.ఆర్.అంబేద్కర్. ఆయనకు నిజమైన నివాళి అర్పించేటప్పుడు భారతీయ సామాజిక వరంవరలో డా. బి.ఆర్.అంబేద్కర్ నిర్వహించిన పాత్ర చిరస్మరణీయమైనది. చారిత్రకంగా సాంఘిక, సాంస్కృతిక, రాజకీయరంగాల పై స్థిరమైన స్ఫూర్తిదాయక ఆలోచనను అందించారు. ప్రతి రాజకీయ పార్టీ, అంబేద్కర్ గురించి ఎన్నికల ముందు, తరువాత ప్రస్తావించకుండా ఉండలేని స్థితికి ఆయన ఆలోచన విధానం దోహదం చేసింది.

## విద్యా కోవిదుడు

భారతీయ సాంఘిక వ్యవస్థ హిందూత్వ ఆధిపత్యంలో కరడు కట్టిన కులవ్యవస్థ, దాని పునాదియైన వర్ణవ్యవస్థ కలిగిస్తున్న విషపూరిత వివక్షతకు గురిచేస్తున్న అంటరానితనం, అస్పృశ్యత పరిఢవిల్లుతున్న అసహజత్వంపై తిరుగుబాటుకు నాంది పలికింది మహాత్మ జ్యోతి బాపూలే. 1827లో వెనుకబడిన తరగతుల కుటుంబంలో జన్మించి 1890లో మరణించేంత వరకు కులవివక్షతకు, అస్పృశ్యతకు, వ్యతిరేకంగా సాంఘిక విప్లవోద్యమానికి మహాత్మ జ్యోతిబాపూలే ప్రేరణగా, చైతన్య దీప్తిగా ఉద్యమించాడు. 1848లో దేశంలో అంటరానివారికి, శూద్రులకువిద్యను బోధించటానికి మహాత్మ జ్యోతి బాపూలే మొదటి పాఠశాలను ప్రారంభించారు. అంటరాని కుటుంబంలో జన్మించిన బి.ఆర్.అంబేద్కర్‌పై అనివార్యంగానే పూలే ప్రభావం పడింది. అట్టడుగు కుటుంబంలో పుట్టి ఎంతో ఎత్తుకు ఎదిగిన బి.ఆర్.అంబేద్కర్, 1891 ఏప్రిల్ 14 నాడు తల్లి భీమాబాయి, తండ్రి రాంజీ పత్వాల్‌లకు 14వ బిడ్డగా మవ్వ గ్రామం, రత్నగిరి జిల్లా, మహారాష్ట్రలో జన్మించాడు. 1907లో మెట్రిక్యులేషన్ పూర్తి చేసుకుని, 1913లో బొంబాయిలోని ఎలిఫైన్ స్టోన్ కాలేజీలో డిగ్రీ పూర్తి చేసుకొని బరోడరాజు సాజీరావు గైక్వాడ్ స్కాలర్‌షిప్ అందడంతో ఉన్నత విద్యకు అమెరికాకు వెళ్లి, 1915లో కొలంబియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎ. పట్టా పొందాడు. 1916 నాటికి లండన్ చేరుకొని న్యాయ ఆర్థిక శాస్త్రాలలో ఉన్నత శ్రేణికి చేరుకున్నాడు. కొలంబియా విశ్వవిద్యాలయం నుండి 1917లో డాక్టరేట్‌ను పొందాడు. పలు శాస్త్రాలలో పట్టాలను పొంది, ఉన్నత విద్యాకోవిదుడుగా దేశానికి తిరిగి వచ్చాడు.

## భాగస్వామ్యం కోసం పోరాటం

బ్రిటిష్‌వారు మొదటిసారిగా 1872లో కాస్ట్ డిజెబులిటిస్ యాక్ట్‌ను ప్రవేశపెట్టారు. బ్రిటిష్‌వారు ప్రారంభించిన విద్యావిధానం, విద్యారంగం లో కనీస నిష్పత్తిగల వర్గం రుసుం కట్టడానికి రాయితీలు కల్పించాలని బ్రిటిష్ వారికి విజ్ఞప్తి చేశారు. ముఖ్యంగా ముస్లిం ప్రజలు ఈ విషయంలో ముందున్నారు. వారి చొరవ చారిత్రాత్మక రిజర్వేషన్ల ఆవిర్భావానికి దోహదపడింది. ఈ విషయాలను పరిశీలించిన బ్రిటిష్ ప్రభుత్వం 1882లో అంటర్ కమిషన్‌ను నియమించింది. ఈ కమిషన్ విద్యారంగంలో సౌకర్యాలకు, రాయితీలకు సంబంధించిన అంశాన్ని పరిశీలించడం, ముఖ్యంగా గంజాం జిల్లాలోని ముస్లిం ప్రజల స్థితిగతులపై అధ్యయనం చేశారు. ఈ సందర్భంలోనే జ్యోతిబా పూలే వెనుకబడిన (ఎస్.సి, ఎస్.టి, బి.సి.) కులాలకు తగు ప్రాతినిధ్యం ఇవ్వాలని అంటర్ కమిషన్‌కు విజ్ఞాపన పత్రం అందించాడు. భారత సామాజిక వ్యవస్థలో వెనుకబడిన వర్గాల భాగస్వామ్యం కోసం ముందుండటం కోసం తపించిన మహాత్మ జ్యోతిబా పూలే చరిత్ర పుటలలో నిలిచిపోయాడు. 1882లో అంటర్ కమిషన్ ముస్లింలకు కొన్ని రాయితీలను ప్రతిపాదించటంతో భారత సామాజిక వ్యవస్థలో ఎస్.సి., ఎస్.టి, బి.సి. వర్గాల ప్రజలకు భాగస్వామ్య సాధనకు నాంది పలికింది. 1895 జూన్ 19-21 తేదీల మధ్య మైసూర్ మహారాజు ప్రత్యేక సర్క్యులర్ ద్వారా కొన్ని ఉద్యోగాలలో వెనుకబడిన కులాలవారికి రిజర్వేషన్‌లు కల్పించారు. 1902లో కొల్హాపూర్ సాహు మహారాజ్ తన సంస్థానంలో వెనుకబడిన కులాలకు 50 శాతం రిజర్వేషన్ సౌకర్యం కల్పించటం మరొక ముందడుగు. 1908లో మింటో సంస్కరణల ద్వారా ముస్లిం ప్రజలకు కొన్ని పోస్టులలో ప్రత్యేక స్థానాలు కేటాయించటానికి మింటో సిఫార్సు చేశాడు. ఆనాడు ముస్లింలు సాగించిన పలు పోరాటాలు, చేసిన ఉద్యమాల ద్వారానే రాజర్వేషన్‌ను పొందిన విషయాన్ని విస్మరించలేం.

## ఉద్యమం

మరొక వైపు బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా కాంగ్రెస్

పార్టీ నాయకత్వంలో వివిధ స్థాయిలలో స్వాతంత్ర్యోద్యమం సాగుతోంది. గాంధీజీ, ఇతర కాంగ్రెస్ నాయకులు, ముస్లిం ప్రజల కోసం ప్రత్యేక ఎన్నికల విధాన సౌకర్యం కల్పించడానికి సానుకూలత తెలపడంతో, 1919లో దళిత జాతులు ఉనికిని చాటుకునే అవకాశం, సౌత్ బారో కమిటీ ముందు అంటరానివారిపై అంబేద్కర్ చేసిన ప్రకటన, దేశవ్యాప్తంగా నిమ్నజాతుల ఉనికిని చాటింది. తద్వారా అంటరానివాళ్ల సామాజిక రాజకీయ నేపథ్యం వివరించబడింది. బహిష్కృత భారత్, మూక్‌నాయక్ అను పత్రికలను 1920లో ప్రారంభించి నిమ్న జాతులలో సామాజిక చైతన్యాన్ని కల్పించడానికి ప్రయత్నించడమే గాక బహిష్కృతహిత కారిణి సభను నెలకొల్పి అంటరానివారి సమస్యల పరిష్కారానికి 1924 లో పూనుకున్నాడు.

## వివక్ష – ప్రతిఘటన

ముఖ్యంగా మహారాష్ట్రలోని మహాదు గ్రామంలో చౌదారు చెరువులో అస్పృశ్యులు నీటిని తాకటానికి, తాగటానికి అగ్రవర్ణాలవారు అనుమతి ఇచ్చేవారుకాదు. కాని హిందూ వ్యవస్థలోని అంటరానివారి స్థానం ఏమిటో ప్రపంచ ప్రజలకు తెలపటానికి పదివేలమందితో సత్యాగ్రహం నిర్వహించి, మహాదు చెరువులో దిగి నీరు తాగి నిమ్న జాతులను మేలు కొల్పాడు. వర్ణవ్యవస్థకు మూలాధారమైన మనుధర్మ శాస్త్రాన్ని 1927 డిసెంబర్ 25 నాడు దహనం చేయటం ద్వారా హిందూ వ్యవస్థలో అంటరాని జాతుల ఉనికిని చాటడమే గాక, హిందూత్వ అనాగరిక నైజాన్ని బయట పెట్టాడు. 1928లో మోతిలాల్ నెహ్రూ కమిటి, ముస్లిం ప్రజల హక్కుల విషయంలో సానుకూలతను ప్రకటించినపుడు, దళిత జాతుల హక్కులపై అంబేద్కర్ తన వైఖరిని స్పష్టం చేశాడు. ఆ క్రమంలోనే మహమ్మదీయులకు మహమ్మదాలి జిన్నా, ఆంగ్లో ఇండియన్లకు ఫ్రాంక్ అంథోని, నిమ్న జాతులకు డా. అంబేద్కర్ ప్రతినిధులుగా నిలిచారు. అంటరాని ప్రజలు హిందువులలో భాగమా? కాదా? అనే ప్రశ్నను నాసిక్‌లోని కాలరాం మందిర ప్రవేశానికై 15,000 మంది ప్రజలతో 1930 మార్చి నాడు, మందిరం ముందు నిర్వహించిన సత్యాగ్రహం హిందూత్వ వాదులకు సవాలు విసిరింది. సంవత్సరం పాటు మందిరాన్ని మూసివేసినప్పటికీ, అస్పృశ్యులను మాత్రం ప్రవేశం చేయనియ్యలేదు. తద్వారా దళితులు హిందూత్వ వివక్షకు గురవుతున్న తీరు, ఘటన చారిత్రక పుటలలోకి ఎక్కింది.

## న్యాయంకోసం ఆరాటం

హిందూ సాంస్కృతిక వివక్షను కార్యాచరణతో ఎత్తి చూపుతూ, మరొకవైపు నిమ్న జాతుల ప్రజల అధికార భాగస్వామ్యానికై కృషి ప్రారంభించాడు. శతాబ్దాల సామాజిక, సాంఘిక, సాంస్కృతిక వివక్షకు, పీడనకు గురవుతున్న కోట్లాది భారత నిమ్న జాతులకు సామాజిక న్యాయాన్ని అందించటంలో సఫలీకృతుడయ్యాడు. 1930, 1931, 1932 లో లండన్‌లో జరిగిన మూడు రౌండ్ టేబుల్ సమావేశాలలో నిమ్నజాతుల ప్రత్యేకతను చాటి చెప్పి హిందూ, ముస్లిం, ఆంగ్లో ఇండియన్‌ల మాదిరిగానే నిమ్నజాతులను ప్రత్యేక జాతిగా గుర్తింపు చేయటంలో, వారి భాగస్వామ్యాన్ని పొందే విధంగా కోట్లాది దళిత, ఆదివాసి ప్రజలకు ప్రత్యేక దామాషా పద్ధతి ద్వారా కమ్యూనల్ అవార్డు కింద 1932 ఆగస్టు 20న బ్రిటిష్ ప్రధాన మంత్రిచే రిజర్వేషన్లు నిర్ణయించి ప్రకటింపచేయటంలో డా.బి.ఆర్.అంబేద్కర్ చేసిన కృషి వలన చరిత్రలో న్యాయంకోసం, భాగస్వామ్యం కోసం తపిస్తున్న పీడిత జాతులైన దళిత, ఆదివాసులకు చారిత్రాత్మక అధికార భాగస్వామ్యం లభించింది. దీనిని భారతీయ సామాజిక పరివర్తనకు విప్లవాత్మక మలుపుగా చూడవచ్చు.

## శ్రామిక సంఘీభావం

సమ్మె వ్యతిరేక బి.ఐ.డి బిల్లును వ్యతిరేకిస్తూ, 1938 నవంబర్ 7న జరిగిన చారిత్రాత్మక సమ్మెలో అంబేద్కర్ పాల్గొనటమే గాక, కొంకాన్ భూస్వామ్య వ్యవస్థ రద్దుకోసం జరిగిన రైతాంగ ప్రదర్శనలో అంబేద్కర్ పాల్గొని శ్రామిక రైతాంగ హక్కుల కోసం నిలబడ్డాడు. 1942లో లేబర్ కౌన్సిల్ మెంబర్‌గా తనకు లభించిన కొద్ది కాలంలోనే కనీస వేతనాల చట్టం, స్టాండింగ్ ఆర్డర్ల చట్టం, మైన్ కార్మికుల చట్టం, మెటర్నటీ సెలవుల చట్టం, ఇతర కార్మిక చట్టాల రూపకల్పనకు నాంది పలికాడు. రాజ్యాంగ పరిషత్ సభ్యుడిగా, చైర్మన్‌గా, ప్రథమ భారత ప్రభుత్వ న్యాయశాఖ మంత్రిగా దేశ ప్రజలకు సేవలందించాడు. ప్రజాస్వామ్య లౌకిక వ్యవస్థ మూలస్తంభాలుగా 394 అధికరణలు, 9 ఆదేశిక సూత్రాలతో రాజ్యాంగాన్ని అందించడమే గాక, ప్రాథమిక హక్కులలో 14వ అధికరణ ద్వారా చట్టం ముందు అందరు సమానం, అధికరణ 15 ద్వారా కులం, మతం, ప్రాంతం, లింగభేదం ప్రాతిపదికన వివక్ష చూపకూడదని, అధికరణ 16 ద్వారా ఉద్యోగ నియామకాలలో సమాన అవకాశాలు, అధికరణ 17 ద్వారా అస్పృశ్యత నిర్మూలన, అధికరణ 19 ద్వారా భావ ప్రకటన, వాక్ స్వాతంత్ర్యం, సంఘ నిర్మాణం, రాజ్యాంగంలో పొందు పర్చాడు. దళిత, ఆదివాసి ప్రజలకు 330, 332, 335 అధికరణలతో విద్యా, ఉద్యోగ రాజకీయ రంగాలలో తగు భాగస్వామ్యాన్ని కలిగిస్తూ రాజ్యాంగంలో పొందుపర్చడం ద్వారా కోట్లాది ప్రజలకు సామాజిక న్యాయం పొందటానికి, రాజ్యాంగంలో భద్రత కల్పించటంలో విజయవంతం అయ్యాడు.

## స్త్రీ విముక్తి ప్రదాత

అంబేద్కర్ జీవిత యాత్రలో ప్రముఖమైన ఘట్టం మహిళల హక్కులను పరిరక్షిస్తూ ఆడపిల్లలకు ఆస్తిలో సమాన హక్కు ఉండాలని, బహుభార్యత్వం రద్దు, అంతర్వర్ణ వివాహం, వివాహ విడాకుల రద్దు లాంటి విప్లవాత్మక మార్పులతో మహిళల ప్రగతికి దోహదపడే హిందు కోడ్ బిల్లును రూపొందించి, చట్టం చేయడానికి లోకసభలో ప్రవేశపెట్టగా బిల్లు వీగిపోయింది. ఈ బిల్లు హిందూ సంప్రదాయాన్ని మూలమట్టంగా పెకిలించి, విచ్ఛిన్నం చేస్తుందని, శ్యాంప్రసాద్ ముఖర్జీ, మాలవ్య, పటేల్ వ్యతిరేకతను తెలపగా రాజేంద్రప్రసాద్ రాజీనామ చేస్తానని బెదిరించటం, కాంగ్రెస్ చూపుతున్న విముఖతకు, విసుగు చెందిన అంబేద్కర్ 1951 సెప్టెంబర్ 27న న్యాయశాఖ మంత్రి పదవికి రాజీనామ చేసాడు.

హిందూ కోడ్ బిల్లు నాలుగు క్లాజ్‌ల అనంతరం హత్య చేయబడిందని, కనీసం రెండు కన్నీటి బొట్లు ఎవరూ రాల్చలేదని వాపోయాడు. మహిళల స్వేచ్ఛా స్వాతంత్ర్యం పట్ల అంబేద్కర్ నిబద్ధతను తెలుపుతోంది. హిందూ మతంలో మార్పు జరగదని, హిందుత్వాన్ని సంస్కరించడమంటే, వర్ణవ్యవస్థను నిరాకరించాలని కులపునాదుల పైననే వర్ణ వ్యవస్థ నిర్మించబడిందని, హిందూ ప్రామాణిక గ్రంథాలు సహితం వర్ణ వ్యవస్థను బలపరుస్తున్నాయని, అందుకు ప్రత్యామ్నాయంగా శాంతిని ప్రభోదిస్తూ, హింసని వ్యతిరేకిస్తున్న బౌద్ధమతం సరియైందని భావించి 1956 అక్టోబర్ 14 న లక్షలాది మంది ప్రజల సమక్షంలో బౌద్ధమతం స్వీకరించాడు.

## వెనుకబడిన వర్గాలకు ప్రేరణ

అంబేద్కర్ జీవిత క్రమంలో పీడిత జాతుల భాగస్వామ్యానికి స్ఫూర్తినిచ్చాడు. ఆయన స్ఫూర్తి దళిత, ఆదివాసి ప్రజలకే పరిమితం కాకుండా వెనుకబడిన వర్గాలలో సహితం ఆందోళన రేపింది. దేశవ్యాప్తంగా వెనుకబడిన తరగతుల ప్రజలు అంబేద్కర్ స్ఫూర్తితో పలు ఉద్యమాలకు పూనుకున్నారు. తత్పర్యవసానంగా, 1952లో కాకా కాలెల్కర్ కమిషన్ నియామకాన్ని కేంద్రం నియమించింది. 1955లో కమిషన్ నివేదికను కేంద్రానికి అందించగా, నాటి ప్రధాని నెహ్రూ, హోంశాఖమంత్రి గోవింద్‌వల్లభ్‌పంత్ కమిషన్ నివేదికను తిరస్కరించారు. జాతీయస్థాయిలో వెనుకబడిన తరగతుల ఉద్యమం కొంత బలహీన పడినప్పటికీ, తిరిగి దశాబ్దకాలం తరువాత ఉద్యమం ఊపందుకోవటంతో 1964లో కేంద్ర ప్రభుత్వం జారీ చేసిన సర్క్యులర్ ప్రకారం వివిధ రాష్ట్రాలలో బి.సి. కమిషన్ల నియామకం ప్రారంభమైనది. ఆంధ్రప్రదేశ్‌లో 1968లో మోహన్ ప్రసాద్ కమిషన్, 1980లో మురళిధరరావు కమిషన్ నియామకాలు జరిగాయి. మురళీధరరావు కమిషన్ రిపోర్టు అమలుపై రాష్ట్ర హైకోర్టు కొట్టివేయటంతో స్థానిక సంస్థలలో వెనుకబడిన తరగతులకు 27 శాతం రిజర్వేషన్లు అమలుకు మన రాష్ట్రం పూనుకున్నది. తమిళనాడుతో సహా మరికొన్ని రాష్ట్రాలలో వెనుకబడిన తరగతుల భాగస్వామ్యాన్ని కల్పించే రిజర్వేషన్లను ఆయా ప్రభుత్వాలు అమలు చేయటంతో, జాతీయ స్థాయిలోతిరిగి వెనుకబడిన తరగతుల ప్రజలకు రిజర్వేషన్ కల్పించాలనే ఉద్యమం తీవ్రతరం కావటంతో, 1977లో నాటి కేంద్ర ప్రభుత్వం మండల్ కమిషన్‌ను నియమించటం, 1989లో నాటి ప్రధానమంత్రి వి.పి.సింగ్ మండల్ కమిషన్ నివేదిక అమలుకు పూనుకోవటం, విద్యా ఉద్యోగ రంగాలలో దేశవ్యాప్తంగా రిజర్వేషన్లు వర్తించటం, డా. బి.ఆర్.అంబేద్కర్ స్ఫూర్తి కొనసాగింపే. ఇంకా బి.సి. వర్గాలకు లోక్‌సభ, శాసనసభలలో భాగస్వామ్యాన్ని కల్పించవలిసి ఉంది. 21 శతాబ్దంలో సామాజిక న్యాయంకోసం వర్ణవివక్షకు, కులవివక్షకు వ్యతిరేకంగా పలు ఉద్యమాలు ఆందోళనలు కొనసాగుతూనే ఉన్నాయి. ఇటీవల కాలంలో చట్ట సభలలో మహిళల భాగస్వామ్యాన్ని 33 శాతం కల్పించటానికే దేశవ్యాప్తంగా చర్చ జరుగుతుండటం నాటి హిందూ కోడ్ బిల్లు ప్రేరణ ప్రతిఫలమే.

## హిందూ వ్యవస్థ వివక్ష

వాస్తవానికి భారతీయ హిందూ వ్యవస్థ 2800 కులాలతో వర్ధిల్లుతున్నది. దళితులు 450 ఉపకులాలుగా, ఆదివాసులు 461 కులాలుగా, వెనుకబడిన తరగతులు 766 ఉపకులాలుగా మనుధర్మ శాస్త్రం విభజించింది. దళితులు 20 శాతం, ఆదివాసులు 10 శాతం, వెనుకబడిన తరగతులు 35 శాతం, ముస్లిం మైనారిటీలు 15 శాతం, క్రిస్టియన్లు 2.5 శాతం, సిక్కులు 2 శాతం, బౌద్ధులు, జైనులు ఇతరులు 5 శాతం మొత్తం 85 శాతంగా ఉన్నారు. మిగిలిన 15 శాతం అగ్రవర్ణాలకు చెందినవారున్నారు. కాని భారతీయ సామాజిక వ్యవస్థలో కొన్ని రంగాలలో ఈ తరగతుల ప్రజలు తగు భాగస్వామ్యాన్ని పొందుతున్నప్పటికీ, వెనుబడిన తరగతుల ప్రజలు నేటికి తగు భాగస్వామ్యాన్ని పొందలేకపోతున్నారు. ముఖ్యంగా ఆర్థిక రంగంలో అసమానతలు అధిగమించలేని స్థాయికి చేరుకోవటం, వ్యవసాయ రంగంలో భూ వికేంద్రీకరణ, భూసంస్కరణలు అమలుకు నోచుకోక పోవటం, మిగులు భూముల పంపిణీకి ప్రభుత్వం పూనుకోకపోవటం, భూసంబంధాలలో గుణాత్మక మార్పురాలేదు. పారిశ్రామిక రంగంలో సహితం ప్రభుత్వ రంగ పరిశ్రమలు బలహీనపడటంతో రాజ్యాంగ రక్షణలు పై తరగతుల భాగస్వామ్యం మౌలికంగా కోల్పోవటం జరుగుతోంది. అగ్రవర్ణాలకు చెందిన పెట్టుబడిదారులు సరళీకరణ, సంస్కరణల నేపథ్యంలో ఎస్.సి., ఎస్.టి., బి.సి వర్గాలకు భాగస్వామ్యాన్ని నిరాకరిస్తున్నారు. ప్రజల కనీస అవసరాలు తీర్చటంలో, మౌలిక సదుపాయాలు కల్పించటంలో, విద్య, వైద్య రంగాలలో సహితం ఈ తరగతుల ప్రజలు సమభాగస్వామ్యానికి నోచుకోవటం లేదు. ఈ సమయంలోనే ప్రాముఖ్యత గల అంశాలను నెమరు వేసుకోవల్సి ఉన్నది. హిందు కులచట్రం దిగ్బంధనంలో నేటికీ దళిత, ఆదివాసి ప్రజలు, వెనుకబడిన తరగతుల ప్రజలు దుర్భర జీవితాన్ని గడుపుతున్నది వాస్తవం. ఆకలి చావులు, నిరుద్యోగం, పేదరికం నిరంతరం వెంటాడుతోంది. దళితులలోనే దేశవ్యాప్తంగా 4 కోట్ల మంది వెట్టిచాకిరిలో మగ్గుతున్నారు. 1 కోటి 50 లక్షల మంది దళిత పిల్లలు వెట్టి చేస్తూ ఉండటం శోచనీయం. హత్యలు, అత్యాచారాలు నిరంతరం కొనసాగుతూనే ఉన్నాయి. గంటకు ఇద్దరు దళితుల పైదాడి, 24 గంటలలో ముగ్గురు మహిళలపై అత్యాచారాలు, రోజుకు ఇద్దరు హత్యకు గురి అవుతున్నారు. పోలీస్ నివేదికల ప్రకారం దేశవ్యాప్తంగా సాగుతున్న హత్యాచారాల సంఖ్య సంవత్సరానికి ముప్ఫైవేలుగా ఉన్నది. ఇంతటి దారుణ స్థితి అంబేద్కర్ కాంక్షించిన సామాజిక న్యాయాన్ని సుసాధ్యం చేస్తుందా?

## దర్బన్ వివక్ష

21వ శతాబ్దంలో ఐక్య రాజ్య సమితి ఆధ్వర్యంలో దక్షిణాఫ్రికాలోని దర్బన్ నగరంలో వర్ణవివక్షపై జరిగిన సదస్సులో, భారతీయ కులవివక్షత పై చర్చ జరగాలని దేశవ్యాప్తంగా దళితులు డిమాండ్ చేయగా, కుల వివక్షపై చర్చించటానికి వీలు లేదని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించటం, దళితుడైన ఎం.పి. బంగారులక్ష్మణ్ నాయకత్వాన ప్రతినిధి బృందాన్ని పంపి, భారతదేశంలో కుల వివక్ష లేదని ఆయన ద్వారానే అంతర్జాతీయ వేదిక మీద చాటింపు చేసింది. మెజారిటీ ప్రజల స్థితిని చెప్పటానికి నిరాకరించటం ద్వారా దళిత మానవహక్కుల భంగానికి పాల్పడింది.

## భోపాల్ ముందడుగు

దళితుల సామాజిక, ఆర్థిక మార్పు దిశగా 2002 జనవరి 12, 13 తేదీలలో భోపాల్‌లో జరిగిన సదస్సు భోపాల్ డిక్లరేషన్‌గా, సామాజిక న్యాయానికి మరొక ముందడుగుగా, దళితుల సామాజిక, ఆర్థిక అభివృద్ధికి తోడ్పడే సాధనంగా 21 అంశాలను ఆమోదించింది. భూపంపిణీ, ఆదివాసి భూముల రక్షణ, దళిత, ఆదివాసులకు వాటా లభించేలా పెట్టుబడిని సమీకరించటం, వెట్టి చాకిరి నిర్మూలన, దళిత, ఆదివాసులకు మౌలిక సదుపాయల కల్పన, ఉచిత విద్య, 1989 ఎస్.సి., ఎస్.టి., అత్యాచారాల నిరోధక చట్టాన్ని 1995 ఎస్.సి., ఎస్.టి., అత్యాచారాల రూల్స్‌ను అమలు చేయటం, ప్రభుత్వ ప్రైవేట్ రంగాలలో రిజర్వేషన్ వర్తింపు, రాష్ట్ర, కేంద్ర బడ్జెట్‌లలో నిష్పత్తి ప్రాతిపదికగా కేటాయింపు. బ్యాక్‌లాగ్ పోస్టుల భర్తీ రక్షణ, న్యాయ వ్యవస్థలో రిజర్వేషన్ వర్తింపు లాంటి పలు అంశాలను భోపాల్ డిక్లరేషన్ ప్రస్తావించటం ద్వారా దేశవ్యాప్తంగా సామాజిక న్యాయంపై చర్చ విస్తృతపరిచింది.

## అమలుకు నోచుకోని పున్నయ్య

రాష్ట్రంలో ఎస్.సి., ఎస్.టి.. కమిషన్‌ను ప్రకటించినప్పటికీ, జస్టిస్ పున్నయ్య కమిషన్ నివేదిక అమలులో వైఫల్యత కనపడుతున్నది. ప్రభుత్వం ఆమోదించిన 41 అంశాలు సహితం అమలుకు నోచుకోలేదు. ముఖ్యంగా పౌరహక్కుల చట్టం 1955, అత్యాచారం – హత్యా నిరోధక చట్టం, 1/70 గిరిజన భూముల రక్షణ చట్టం, 1991 భూసమస్యపై ముఖ్యమంత్రుల సమావేశం చేసిన నిర్ణయాలు నేటికీ అమలుకు నోచుకోలేదు. ఈ క్రమంలోనే సామాజిక న్యాయం కోసం, పీడిత ప్రజల భాగస్వామ్యం కోసం పరితపించిన డా.బి.ఆర్. అంబేద్కర్ కలల్ని సామాజిక న్యాయాన్ని సాధించాల్సి ఉన్నది.

## మౌలిక దృక్పథానికి ప్రతీక

తాను కాంక్షించి రాజ్యాంగంలో పొందుపర్చటంలో రాజ్యాంగ పరిషత్ వైఫల్యాన్ని, అంబేద్కర్ మౌలిక దృక్పథాన్ని నిశితంగా పరిశీలించాలి. రాజ్యాంగ సభకు అంబేద్కర్ సమర్పించిన నివేదికలో ఆర్థిక దోపిడీ, ప్రజల ప్రాథమిక హక్కులను దురాక్రమిస్తున్నదని, విరుగుడుగా దేశ ఆర్థిక వ్యవస్థను మార్చాలని ముసాయిదా రాజ్యాంగంలో పేర్కొంటు ఆర్టికల్ 2, సెక్షన్ 2, క్లాజు 4లో పరిశ్రమలలోని పునాది పరిశ్రమలు లేదా కీలక పరిశ్రమలుగా ప్రకటించిన వాటిని రాజ్యం స్వాధీనపర్చుకొని నిర్వహించాలని సూచించారు. వ్యవసాయరంగాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని భూమిని సమష్టి వ్యవసాయ క్షేత్రంగా నిర్వహించాలని ఆర్టికల్ 9 (ఎ) ప్రతిపాదనలో సూచించాడు. కాని డ్రాఫ్టింగ్ కమిటీ తోసిపుచ్చింది. జాతుల సమస్యను దృష్టిలో ఉంచుకొని ఇండియన్ రిపబ్లిక్‌గాక యునైటెడ్ స్టేట్ ఆఫ్ ఇండియాగా ప్రతిపాదించాడు. స్వేచ్ఛ, సమానత్వం, సోదరత్వం లక్ష్యాలను రాజ్యాంగంలో ఆచరణీయాంశాలుగా పొందుపర్చాలని వాదించాడు. డ్రాఫ్టింగ్ కమిటీలో అంబేద్కర్ చేసిన పోరాటాన్ని పాలకులు దాచి పెడుతున్నారు. భారీపరిశ్రమలను, భూమిని జాతీయం చేయాలని చేసిన ప్రతిపాదన డ్రాఫ్టింగ్ కమిటీలో మెజారిటీ సభ్యులు వ్యతిరేకించిన విషయాన్ని మార్పులను కాంక్షించే వారందరు గమనించాలి.

## ఆలోచనలలో శాస్త్రీయత

ఇటీవల కాలంలో కుల వ్యవస్థకు మూలాధారమైన హిందూత్వ ఉన్మాదులు, అంబేద్కరును హిందువుగా ఆవిష్కరించటానికి చేస్తున్న కుటిల ప్రయత్నాలను, కుట్రలను పీడితులు గమనించాలి. అంబేద్కర్ తన జీవితాంతం హిందూత్వ దుర్మార్గానికి వ్యతిరేకంగా పోరాడారు. గాంధీ అగ్రకులాల దోపిడి వర్గాల రాజ్యాధికారం కోసం పోరాడితే అంబేద్కర్ అణగారిన వర్గాల, కులాల విముక్తి లక్ష్యంగా ఆందోళన చేశాడు. గాంధీలో ఉన్న కర్మవాదం అంబేద్కర్‌లో లేదు. తిలక్‌లో ఉన్న హిందు సనాతన తత్వం, పటేల్‌లో ఉన్న ధార్మిక వర్ణ రుగ్మత, రాజేంద్రప్రసాద్‌లో ఉన్న పురోహిత బానిసత్వం అంబేద్కర్‌లో చూడలేం. హిందూ రుగ్మతలకు వ్యతిరేకంగా అంబేద్కర్ పోరాడాడు. స్త్రీల సమాన హక్కులకు సంబంధించిన హిందుకోడ్ బిల్లుకు తుదివరకు నిలబడినవాడు అంబేద్కర్ కాగా మధ్యలో మోసపూరితంగా జారుకున్నది నెహ్రూ. రాజ్యాధికారం లేకుండా విమోచన అసంభవమని అంబేద్కర్ ప్రకటించాడు. ఆయన మార్క్సిస్టు లెనినిస్టు కాదు. శత్రు శిబిరానికి చెందిన విరోధికాదు. రాజారాంమోహనరాయ్ నుండి కందుకూరి వీరేశలింగం పంతులు వరకు సంస్కర్తలు హిందు వ్యవస్థలోని అనేక రుగ్మతలకు వ్యతిరేకంగా పని చేసినా, వాటిని హిందుమత ధర్మ సూత్రాల పై ఆధారపడి కొనసాగించారు. వీరెవరు హిందు సమాజంలోని అతి పెద్ద రోగమైన కుల సమస్యను చేపట్టలేదు. మహాత్మ జ్యోతి బాపూలే వారసునిగా అంబేద్కర్ కుల నిర్మూలన ఆందోళనను చేపట్టటమే గాక ఈ అన్ని రుగ్మతలకు మూలమైన హిందూత్వ వివక్షను నిర్మూలించాలని పిలుపు నిచ్చాడు. ఈ పిలుపు మౌలికమైనది. అందుకే రాజారాంమోహన్ రాయ్ లాంటివారు సాంఘిక సంస్కరణవాదులు కాగా అంబేద్కర్ ప్రజా శిబిరానికి చెందిన సాంఘిక విప్లవకారుడు. రానున్న కాలంలో దళిత, ఆదివాసి, వెనుకబడిన తరగతులు, మైనారిటీ వర్గాలు సంఘటితంగా సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక మార్పు దిశగా ఉద్యమించాలి. సహజ వనరులు సామాజికం కావటానికి వివక్షత లేని దిశగా, సామాజిక న్యాయం కోసం సంఘటితంగా ఉద్యమించటమే అంబేద్కర్‌కు నిజమైన నివాళి. మూర్తిని ఆరాధించటమేకాదు, స్ఫూర్తిని కొనసాగించాలి. ◆

వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. మనీ ఆర్డర్లలోని స్పేస్ కాలంలో అడ్రస్ పూర్తిగా రాయాలి. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.

**- సర్క్యులేషన్ మేనేజర్**

జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం లక్ష్యాలు, ముఖ్యంగా తెలంగాణ ప్రాంతంలోని వరంగల్‌లో ఈ పథకం అమలౌతున్న తీరును వివరిస్తున్నారు **కె. సీతారామరావు, బూర విజయమోహన్**

# జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం - ఒక పరిశీలన

**భా**రతదేశ గ్రామీణ ప్రాంతాలలో ఇప్పటికీ దాదాపు అరవై ఐదు శాతం కంటే ఎక్కువ ప్రజలు వ్యవసాయం, వ్యవసాయాధారిత కార్యకలాపాలపై ఆధారపడి తమ జీవనోపాధిని కొనసాగిస్తున్నారు. గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికోసం భారతదేశానికి స్వాతంత్ర్యం సాధించినప్పటి నుండి కేంద్రంలో, వివిధ రాష్ట్రాలలో ఆయా ప్రభుత్వాలు ఎన్నోరకాల పథకాలు చేపట్టినా అవి సక్రమంగా అమలు కాక పేదరికం పూర్తిగా నిర్మూలించబడలేదు. అతివృష్టి, అనావృష్టి వంటి ప్రకృతి వైపరీత్యాలవల్ల భూగర్భజలాలు తగ్గిపోవడం, భూమిసారం, సహజ వనరుల క్షీణత వంటి సమస్యలు గ్రామీణ ప్రాంతాల్ని పట్టి పీడిస్తున్నాయి. వీటి ఫలితంగా గ్రామీణ ప్రజానీకం ఉపాధి కోల్పోయి పెద్ద సంఖ్యలో పట్టణాలకు వలసవెళ్లి అక్కడ జీవన్మరణ సమస్యలను ఎదుర్కోవడం జరుగుతోంది. ఆంధ్రప్రదేశ్‌లో నిర్వహించిన వివిధ ఆర్థిక సర్వేల ప్రకారం రాష్ట్రంలో సుమారు యాభై శాతం ప్రజలు పేదరికంలో మగ్గుతున్నారు.

గత కొన్ని సంవత్సరాలుగా పర్యావరణ విధ్వంసం మూలంగా ఏర్పడ్డ కరువుల వల్ల సరిగా పంటలు పండక, చేసేందుకు పని దొరకని పరిస్థితిలో కనీస బతుకుదెరువు కోసం గ్రామీణ ప్రజలు సొంత ఊళ్లను విడిచి పట్టణాలకు వలసవెళ్లవలసిన పరిస్థితి నెలకొని ఉంది. ఈ విధంగా వలసవెళ్లే జనాభాను పరిశీలిస్తే తెలంగాణ ప్రాంతంలోని ఒక్క మహబూబ్‌నగర్ జిల్లాలోనే సంవత్సరానికి 15 లక్షల మంది కూలీలు చిన్న, సన్నకారు రైతులు వలసవెళుతున్నట్లు ప్రభుత్వ అంచనా.

అంతేకాకుండా భారతదేశంలోని ఒకటి, రెండు రాష్ట్రాలు మినహా మిగతా అన్ని రాష్ట్రాలలో కూడా ఈ విధమైనటువంటి దుర్భర పరిస్థితులే నెలకొని ఉన్నాయనడంలో ఎలాంటి సందేహంలేదు. భారతదేశంలో ఇందిరాగాంధీ కాలంనాటి 'గరీబీ హఠావో' నినాదం నుండి అనేక రకాలైన ఉపాధి హామీ పథకాలను వివిధ పేర్లతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేయడానికి ఇప్పటివరకు సుమారు 85 వేల కోట్ల రూపాయలకు పైగా ఖర్చు పెట్టినప్పటికీ పేదరిక నిర్మూలన, ఉపాధి అవకాశాల కల్పనలో ప్రభుత్వాలు ఆశించిన ఫలితాలు సాధించలేదనే చెప్పవచ్చు. ఈ మధ్య కాలంలో మహారాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్న ఉపాధి హామీ పథకానికి కొన్ని మార్పులు చేపట్టి యు.పి.ఏ. ప్రభుత్వం జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని ప్రవేశపెట్టింది.

పదవ పంచవర్ష ప్రణాళికలో 26 శాతం ఉన్న పేదరికాన్ని 21 శాతానికి తగ్గించి నిరుద్యోగులు అయినటువంటి గ్రామీణ పేదలకు ఉపాధి అవకాశాలు కల్పించాలనే ఉద్దేశంతో ఇలాంటి ఉపాధి హామీ పథకాలను అమలు చేస్తున్నారు. ముఖ్యంగా ఒరిస్సాలోని కల్హాండిలో ఆకలితో అలమటిస్తున్న వేల మంది గిరిజన ప్రజలు తమ ఆకలిని ఎలాగైనా తీర్చుకునే ఉద్దేశంతో విషపు గడ్డలు, మామిడి టెంకలలోని జీడి పదార్థాన్ని తిని చాలామంది చనిపోయారు. అలాంటి పరిస్థితులలో గిరిజన ప్రజల పరిస్థితిని చూసి వారిని ఏ విధంగానైనా సరే ఆదుకోవాలనే ఉద్దేశంతో ఒక న్యాయవాది ప్రజా ప్రయోజనాల వ్యాజ్యం కింద సుప్రీంకోర్టులో కేసు వేయగా కోర్టు తీర్పునిస్తూ ఆకలితో అలమటిస్తున్న పేద ప్రజలకు ఆహార భద్రత కల్పించడం లేదా ఉపాధి అవకాశాలు కల్పించాల్సిన బాధ్యత ఆయా ప్రభుత్వాలపైననే ఉందని పేర్కొన్నది.

ఇంతవరకు భారతదేశంలోని గ్రామీణ పేద ప్రజలను ఆదుకోవడానికి, గ్రామీణ పేద ప్రజల ఆకలిని తీర్చడానికీ, ఆహార భద్రత, జీవనోపాధులను పెంచడం కోసం ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు అనేక పథకాలను అమలు జరుపుతున్నప్పటికీ కనీసం ఒక సంవత్సరంలో ఇన్ని రోజులు పని దొరుకుతుందని కానీ, ఒక కుటుంబానికి నిర్దిష్టమైన ఆదాయం లభిస్తుందని కానీ ఇప్పటివరకు ఒక చట్టబద్ధమైన హామీ పేద ప్రజలకు లభించలేదు. ఈ పరిస్థితులను అధ్యయనం చేసిన భారత ప్రభుత్వం గ్రామీణ పేద ప్రజలకు ఉపాధి భద్రతను కల్పించి జీవనోపాధి అవకాశాలను పెంచి దీర్ఘకాలిక ఆస్తులను సమకూర్చాలనే సదుద్దేశంతో గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని ప్రవేశపెట్టారు. గ్రామీణ ప్రాంతంలో నైపుణ్యం అవసరంలేని పని చేయడానికి సిద్ధంగా ఉండి, పని అడిగిన 18 సంవత్సరాలు నిండిన వయోజనులున్న ప్రతి కుటుంబంలో ఎంతమంది ఉన్నా వారికి ఇంతకుముందు వారు చేస్తున్న పనులకు అదనంగా ఒక ఆర్థిక సంవత్సరంలో వంద రోజులు పని కల్పించే లక్ష్యంతో జాతీయ గ్రామీణ ఉపాధి హామీ చట్టాన్ని ఆగస్ట్ 23, 2005న భారత పార్లమెంట్ ఆమోదించింది. ఈ చట్టం ప్రకారం కేంద్ర ప్రభుత్వం మొదటిదశగా దేశంలోని వివిధ రాష్ట్రాలలోని వెనుకబడిన రెండు వందల జిల్లాలలో ఈ పథకాన్ని అమలు చేయాలని నిర్ణయించింది. అందుకుగానూ ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు ఈ చట్టం అమలులోకి వచ్చి ఆరు నెలలోపు వారి వారి స్థానిక పరిస్థితులకు అనుగుణంగా రాష్ట్ర గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని రూపొందించాలి. అందులో భాగంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని రూపొందించి రాష్ట్రంలోని 13 జిల్లాలలో (ఆదిలాబాద్, మహబూబ్‌నగర్, రంగారెడ్డి, ఖమ్మం, నల్గొండ, వరంగల్, అనంతపురం, కడప, చిత్తూరు, మెదక్, నిజామాబాద్, కరీంనగర్, విజయనగరం) అమలు చేయ తలపెట్టింది. ఈ పథకాన్ని ఫిబ్రవరి 2, 2006లో అనంతపురం జిల్లా నార్పల మండలంలోని బండ్లపల్లి గ్రామంలో ప్రధాని డా. మన్మోహన్ సింగ్ ప్రారంభించారు. అనంతరం ఈ పథకాన్ని భారతదేశంలో 130 జిల్లాలకు విస్తరించారు. అందులో భాగంగా ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఆరు జిల్లాలలో గుంటూరు, కర్నూలు, నెల్లూరు,

ప్రకాశం, శ్రీకాకుళం, తూర్పుగోదావరి జిల్లాలో అమలు చేస్తున్నారు. ఈ పథకం అమలు కోసం మన రాష్ట్ర ప్రభుత్వం 1,409 కోట్ల రూపాయలు ఖర్చు చేసింది.

ఈ వ్యాసంలో ప్రధానంగా జాతీయ గ్రామీణ ఉపాధి హామీ (ఎన్.ఆర్.ఇ.జి.) పథకం లక్ష్యాలు, లక్షణాలు, ముఖ్యంగా తెలంగాణ ప్రాంతంలోని వరంగల్ జిల్లాలో అమలవుతున్న తీరును క్షుణ్ణంగా పరిశీలించే ప్రయత్నం చేసాం.

ఎన్.ఆర్.ఇ.జి. పథకంలో భాగంగా చేయవలసిన పనులను వార్డ్ సభలు, గ్రామసభల ద్వారా గుర్తిస్తుంది. ఈ పథకంలో భాగంగా గ్రామీణ ప్రాంతంలో చేపట్టాల్సిన (ప్రభుత్వం గుర్తించిన) పనులను కింద పేర్కొంది.

1. నీటి సంరక్షణ, వాననీటి నిల్వ.
2. కరువు నుండి రక్షణనిచ్చే పనులు (చెట్ల పెంపకం, తోటల పెంపకం)
3. సాగునీటి కాల్వలు, చిన్న సూక్ష్మ స్థాయి నీటిపారుదల వసతి.
4. షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగల భూ సంస్కరణల ఫలితంగా భూమిని పొందినవారు లేదా ఇందిరా ఆవాస్ యోజన లబ్దిదారుల భూములకు సాగునీటి సదుపాయాల కల్పన.
5. సంప్రదాయ నీటివనరుల పునరుద్ధరణ (చెరువుల పూడికతీయడం)
6. భూమి అభివృద్ధి పనులు.
7. వరద నియంత్రణ, వరద రక్షణ పనులు, నీరు నిలబడిపోయే ప్రాంతాలలో మురుగునీరు తీసే పనులు.
8. గ్రామీణ ప్రాంతాలకు అన్ని కాలాల్లో అనువైన రోడ్ల సౌకర్యం.

ఇటువంటి ముఖ్యమైన ఎనిమిది రకాల పనులతో పాటు రాష్ట్ర ప్రభుత్వాలతో చర్చించి కేంద్ర ప్రభుత్వం ప్రకటించే ఇతర పనులను చేపట్టడానికి ఈ పథకం ఉద్దేశింపబడింది. అయితే ఈ పథకాన్ని అమలు చేయడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి పనిచేస్తున్నాయి. రాష్ట్ర ప్రభుత్వం ఈ బాధ్యతను పంచాయితీ సంస్థలకు అప్పగించడం వలన గ్రామ స్థాయిలో ఉపాధి హామీ అమలు సంస్థలుగా గ్రామ పంచాయితీలు ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. ఇందుకోసం కావలసిన నిధులకు కేంద్ర ప్రభుత్వం పార్లమెంట్ ఆమోదంతో 'జాతీయ ఉపాధి హామీ నిధిని' ఏర్పాటు చేసి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 90:10 నిష్పత్తులలో నిధులను సమకూరుస్తున్నాయి.

పట్టిక - 1

| పనిపేరు | మొత్తం కూలీల సంఖ్య | వాస్తవంగా ఉపయోగించిన కూలీలు | డ్రాచేసిన నిధులు రు. | కూలీలకు చెల్లించిన నిధులు (రు.) |
|---|---|---|---|---|
| ఎత్తిపోతల పథకం, గాంధీపురం | 34 | 34 | 6,154 | 6,154 |
| మైసమ్మ చెరువు పంటకాల్వ మరమ్మత్తులు | 24 | 16 | 23,112 | 5,000 |
| మొద్దులకుంట చెరువు మరమ్మత్తులు | 43 | 31 | 33,239 | 9,920 |
| రామన్న చెరువుకు మరమ్మత్తులు | 106 | 106 | 24,455 | 24,455 |
| అనంతారం మొగిలచర్ల రోడ్డు మొక్కల పెంపకం | 115 | 95 | 44,198 | 36,511 |
| బత్తిని రవి చెరువుకట్ట మరమ్మత్తులు | 52 | 52 | 11,532 | 11,532 |

అయితే పైన పేర్కొన్నటువంటి పనులను చేయడానికి ఉపాధి హామీ పథకం ద్వారా కూలీలకు కొన్ని ప్రత్యేకమైన సదుపాయాలను ముందెన్నడూ లేని రీతిలో కల్పించడం జరిగింది. వాటిలో

1. ఉపాధి హామీ పథకం కింద పేరు నమోదు చేసుకున్న ప్రతి కుటుంబంలో ఉన్న వయోజనులకు ఆడ, మగ బేధం లేకుండా ఒక ఆర్థిక సంవత్సరంలో వంద రోజులకు తక్కువ కాకుండా పని కల్పించాలి.
2. పనికోసం దరఖాస్తు చేసుకున్న పదిహేను రోజులలోగా పని పొందడం, అలా కల్పించకపోతే చట్టప్రకారం పని కల్పించని రోజులకు నిరుద్యోగ భృతిని ఆ రోజులకు లెక్కగట్టి పదిహేను రోజుల లోపు చెల్లించాలి.
3. మహిళలకు సమానావకాశాలు కల్పించడం, సమాన వేతన చట్టం 1976 ప్రకారం ఆడ, మగ బేధం లేకుండా సమానవేతనాలు ఇవ్వడం.
4. నివసిస్తున్న ప్రాంతం నుండి ఐదు కిలోమీటర్ల లోపు పనిని కల్పించడం, ఒకవేళ ఐదు కిలోమీటర్లు దాటి పనిచేస్తే రోజువారి కూలీకి అదనంగా రవాణాచార్జీల కింద రోజు కూలీలో పది శాతం చెల్లించాలి.
5. పనిచేస్తూ గాయపడితే వైద్యం, మందుల ఖర్చులతోపాటు కూలీవేతనంలో యాభై శాతం తగ్గకుండా పొందడం, అంగవైకల్యం కలిగినచో లేదా మరణించినచో కేంద్రప్రభుత్వం కేటాయించిన 25,000 రూపాయల నష్టపరిహారాన్ని పొందవచ్చు. అంతేకాకుండా మంచినీటి సదుపాయాన్ని, విశ్రాంతి సమయాలలో కూలీలకు, చిన్న పిల్లలకు నీడ సదుపాయాలతో పాటు పిల్లల సంరక్షణకు ఆయాలను ఏర్పాటు చేయాలి.

ఎంతో సదుద్దేశంతో అనేక సౌకర్యాలతో పేద ప్రజలకు ఉపాధి అవకాశాలు కల్పించే మేలు చేయాలనే లక్ష్యంతో ప్రారంభించిన ఈ పథకం ద్వారా 2006 సెప్టెంబర్ నాటికి కేవలం ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే 13 జిల్లాలలో పేదవారికి పని కల్పించడానికి 44,37,029 జాబ్ కార్డ్‌లు మంజూరు చేసిందని ఒక అంచనా. దేశం మొత్తం మీద ఈ పథకాన్ని 200 నుండి 330 జిల్లాలకు విస్తరించిన అనంతరం, నూతనంగా ఈ పథకాన్ని ప్రారంభించిన ఆరు జిల్లాలను కలుపుకొని ఆంధ్రప్రదేశ్‌లో ఇప్పటివరకు ఈ పథకం ద్వారా మొత్తం 19 జిల్లాలలో 9,58,902 కూలీలు మాత్రమే పని చేయగా వారికి 69,38,22,564 రూపాయల ఉపాధి హామీ కింద చెల్లించారని, ఇంకా 19,83,31,227 రూపాయల ఉపాధి హామీ పనిముట్ల కోసం వ్యయం చేసినట్లు ఇటీవలే ప్రభుత్వం నిర్వహించిన సోషల్ ఆడిట్‌లో తేల్చింది.

మనదేశంలో ప్రభుత్వరంగ సంస్థలు, పరిశ్రమలలో ముప్పై శాతం అభివృద్ధి జరిగితే అందులో ఒక్కశాతం కూడా ఉపాధి అవకాశాలు మెరుగుపడే పరిస్థితిలేదు. అయితే ఇటువంటి పరిస్థితులలో రూపొందించిన ఉపాధి హామీ చట్టం ఎంతమందికి ఉపాధి కల్పించింది అనే కోణం నుండి కాకుండా గ్రామీణ ప్రాంతాల అభివృద్ధితో ఉపాధి అవకాశాల మెరుగు ఎంతవరకు తోడ్పడుతుంది అన్న కోణం నుండి పరిశీలించడం అవసరం. ఆ దృష్టితో పరిశీలిస్తే ఈ పథకం ఎక్కువగా ప్రజా ప్రతినిధుల స్వార్థ ప్రయోజనాలకు, అవినీతికి, ప్రభుత్వ అధికారుల మోసాలకు, అక్రమాలకు నిలయంగా మారిందని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

వరంగల్ జిల్లాలో 2006లో ఒక్క మహబూబాబాద్ మండలం లోనే వివిధ రకాలైన పనులలో అనేక రకాలైన అవినీతి అక్రమాలు జరిగాయి. వాటిని పట్టిక-1లో చూడవచ్చు.

పట్టికను పరిశీలిస్తే వాస్తవంగా పనిచేసిన కూలీలతో పాటు పని చేయనటువంటి మరికొంతమంది బినామీ పేర్లను కూడా అధికారులు రికార్డులలో చూపించి కూలీ డబ్బులను బ్యాంకు నుండి డ్రా చేసి స్వాహా చేసినట్లు గమనించవచ్చు.

పరకాల మండలం నర్సక్కపల్లె గ్రామంలో 1400 మంది కూలీలుండగా 614 జాబ్ కార్డులు మాత్రమే ఇవ్వగా వారికి కూడా కేవలం 16 రోజులు మాత్రమే పని కల్పించడం జరిగింది. దాంతో పూటగడవటం ఇబ్బందిగా ఉన్నటువంటి 30 పేద కుటుంబాలు చుట్టు పక్కల ఉన్న శాయంపేట వంటి గ్రామాలకు ఇటుకల తయారీ వంటి పనులకోసం వలస వెళ్లారు. ఇందుకు ప్రధాన కారణం బినామీ పేర్లతో ఫీల్డ్ అసిస్టెంట్ నిధులు స్వాహా చేయడమే అని అక్కడి ప్రజలు వాపోయారు.

వరంగల్ జిల్లాలో డిసెంబర్ 2006 నాటికి మొత్తం 4.14 లక్షల మందికి ఉపాధి హామీ పథకం ద్వారా వంద రోజులు పని కల్పిస్తామని జాబ్ కార్డులు అందజేయగా గడిచిన తొమ్మిది నెలల్లో కేవలం 2.73 లక్షల మందికి మాత్రమే పని కల్పించారు. ఇందుకు అధికారుల అలసత్వమే కారణంగా చెప్పవచ్చు. అంటే పనులు ఉండి నిధులు ఉన్నప్పటికి కూడా కొన్ని మండలాల్లో అతి తక్కువ మందికి మాత్రమే పని కల్పించడం జరిగింది. వివరాలు పట్టిక-2 లో చూడవచ్చు.

అంతే కాకుండా డిసెంబర్ 2006 నాటికి జిల్లాలోని 28 మండలాల్లో ఒక్క పని కూడా పూర్తి చేయకపోగా ఎనిమిది మండలాల్లో ఒకటి, రెండు పనులు మాత్రమే పూర్తిచేశారు. ఈ విధంగా పరిశీలిస్తే డిసెంబర్ 2006 నాటికి జిల్లాలో మొత్తం 8737 రకాల గుర్తించిన పనులుండగా అధికారులు పూర్తిచేసిన పనులు కేవలం 232 అంటే మొత్తం పనుల్లో 2.65 శాతం మాత్రమే. 2007 ఏప్రిల్‌లో వరంగల్ జిల్లాలో దినపత్రికల సమాచారం మేరకు నర్మెట మండలంలో బొత్తలపర్రె గ్రామంలో మర్రికుంట నుండి కన్నారం చెరువు వరకు చెరువు ఫీడర్ చానల్, గుట్టకుంట మట్టి పనులకు 35 మంది పదిహేను రోజులు పనిచేయగా నాలుగు నెలల వరకు కూడా వారికి డబ్బులు ఇవ్వలేదని పేర్కొన్నారు. కాగా నెల్లికుదురు మండలంలో రత్తిరాం తండాలో ఆరు రోజులు చెరువు మరమ్మత్తు పనులకు వెళ్లితే రోజుకు 39 రూపాయలు మాత్రమే చెల్లించారని మిగతా డబ్బులు అధికారులు స్వాహాచేశారని అక్కడి కూలీలు ఆవేదన వ్యక్తం చేశారు.

అదే విధంగా మహబూబాబాద్ మండలంలో జరిపిన సోషల్ ఆడిట్‌లో కూడా అనేక అక్రమాలు జరిగినట్లు దినపత్రికల సర్వేలో పేర్కొనడం జరిగింది. అందులో

1. వి.ఎస్. లక్ష్మీపురంలో ఫీల్డ్ అసిస్టెంట్ తన బంధువుల కుటుంబీకుల ఇతర బినామీ పేర్లతో పనిచేయకున్నా 20,524 రూపాయల స్వాహాచేశారు.
2. బలిగొండలో బి.పి.ఎం.లు (బ్రాంచ్ పోస్ట్‌మాస్టర్) బినామీ పేర్లతో 8694 స్వాహాచేశారు.
3. నడివాడలో జాబ్‌కార్డుల కోసం ఫీల్డ్ అసిస్టెంట్ 1,950 రూపాయల పనులు చేశారు.
4. కంబాలపల్లిలో యాభై మంది కూలీలు ఒకరోజు పనిచేస్తే పదకొండు రోజులు చేసినట్లు రిజిస్టర్‌లో చేర్చి ఆ నిధులు స్వాహాచేశారు.
5. ఈదులపల్లిలో పదిహేడు మంది బినామీ పేర్లతో ఫీల్డ్ అసిస్టెంట్ పన్నెండు వేల రూపాయల స్వాహాచేశాడు.

డోర్నకల్ మండలంలో పని కొలతలలో ఎక్కువ చూపించామని

**పట్టిక - 2**

| మండలం పేరు | దరఖాస్తు చేసుకుని జాబ్‌కార్డులు పొందిన కూలీల సంఖ్య | పనిపొందిన కూలీల సంఖ్య | పనిపొందిన కూలీల శాతం |
|---|---|---|---|
| హసన్‌పర్తి | 6,074 | 914 | 15.04 |
| తాడ్వాయి | 3,987 | 986 | 24.73 |
| గీసుగొండ | 7,754 | 1,239 | 15.93 |
| గూడూరు | 9,705 | 1,826 | 18.81 |
| ధర్మసాగర్ | 11,168 | 2,276 | 20.37 |
| వెంకటాపూర్ | 9,054 | 2,692 | 29.73 |
| జఫర్‌గడ్ | 7,855 | 2,732 | 34.78 |
| కురవి | 10,146 | 2,907 | 28.65 |
| మరిపెడ | 14,033 | 2,967 | 21.14 |
| నెల్లికుదురు | 9,937 | 3,106 | 31.25 |
| మహబూబాబాద్ | 12,702 | 3,307 | 26.03 |
| | **4,14,385** | **1,40,489** | **33.90** |

ముఠా మేస్త్రీలు డబ్బులు వసూలు చేశారు. కూలీ డబ్బులు చెల్లించేటప్పుడు బి.పి.ఎం.లు ఒక్కొక్కరి వద్ద 10 నుండి 30 రూపాయల వరకు వసూలు చేశారని సోషల్ ఆడిట్‌లో వెల్లడైంది.

గీసుగొండ మండలంలోని వివిధ గ్రామాల్లో కూడా అనేక అక్రమాలు జరిగినట్లు సోషల్ ఆడిట్‌లో వెల్లడైంది. అందులో ముఖ్యంగా

1. ఎలుకుర్తి హవేలీ గ్రామంలో ఫీల్డ్ అసిస్టెంట్ ఉపాధి హామీ పథకంలో భాగంగా రోడ్డుకు ఇరువైపుల చెట్లునాటించి కూలీలకు ఒక్కొక్కరోజుకు 120 రూపాయలు చెల్లించవలసి ఉండగా కేవలం 35 నుండి 40 రూపాయలు మాత్రమే చెల్లించి మూప్పై వేల రూపాయలు స్వాహా చేశారు. అదే విధమైన పనిచేయించినందుకు గాను ఆరెపల్లె ఫీల్డ్ అసిస్టెంట్ తన బంధువుల బినామీ పేర్లతో ముప్పై వేల రూపాయలు స్వాహా చేశారు.
2. విశ్వనాథపురం గ్రామంలో కూలీలకు మంచినీరు పోయడానికి ప్రత్యేక కూలీని నియమించకపోయినా రికార్డులలో మాత్రం నియమించినట్లు చూపించి 1000 రూపాయలు ఫీల్డ్ అసిస్టెంట్ స్వాహా చేశారు.
3. కూలీలకు పోస్టాఫీస్ ద్వారా డబ్బులు చెల్లించేందుకు ప్రభుత్వమే ఖాతాలు తెరిచినప్పటికీ ఖాతాలు తెరవాలని గొర్రెకుంట గ్రామ ఫీల్డ్ అసిస్టెంట్ ఒక్కొక్కరి వద్ద యాభై రూపాయలు వసూలు చేశారు.

స్వాతంత్ర్యం సాధించిన తరువాత మొదటిసారి గ్రామీణ కూలీలకు ఉపాధి కల్పించి వారి ఆకలిని కొంతవరకైనా తీర్చగలిగిన ఘనత జాతీయ ఉపాధి హామీ పథకానికే దక్కుతుంది. అయితే ఈ పథకం కింద చేపడుతున్నటువంటి పనుల్లో అవినీతి, అక్రమాలు బయటపడటమే కాకుండా నాణ్యతాపరమైనటువంటి లోపాలు కూడా ఉన్నట్లు చెప్పవచ్చు. గ్రామీణ ప్రాంతాల్లో ఈ ఉపాధి హామీ పథకం అమలులో జరుగుతున్న అవినీతికి ముఖ్యకారణాలు స్థానిక రాజకీయ నాయకులు, పాలనాధికారులు. ఈ పథకంలో అవినీతిని అరికట్టడానికి సంబంధించిన చట్టాలున్నా కూడా వాటిని సైతం తమకు అనుకూలంగా మలచుకొని అవినీతిని తమ 'హక్కు'గా భావిస్తున్నారు. నిజానికి ఈ ఉపాధి హామీ పథకాన్ని సక్రమంగా అమలు చేసినట్లయితే గ్రామీణ ప్రాంతాల్లో సుమారు నలభై శాతం పేద ప్రజలు రోజు రెండుపూటలు భోజనం చేసే అవకాశం దొరుకుతుంది. కాని పథకం అమలుతీరును పరిశీలిస్తే అది జరగడం దుర్లభమనిపిస్తుంది. ◆

**సన్న, చిన్నకారు రైతుల్లో డెబ్బై శాతం మేర సంస్థాగత పరపతికి నోచుకోలేదనీ, రుణాల రద్దు పథకం వారికి ఎలాంటి ప్రయోజనం చేకూర్చదనీ అంటున్నారు డా. పి.ఎస్.ఎం. రావు**

# ఉదార విధానాల్ని బలపరుస్తున్న కేంద్ర బడ్జెట్

ఐక్య ప్రగతిశీల కూటమి (యు.పి.ఎ.) ప్రభుత్వ నాల్గవ బడ్జెట్ ఈ ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాల్ని మరింత బలపరిచే ఉపకరణం గానే రూపొందింది. మే 2009లో లోక్‌సభ ఎన్నికలు జరుగనున్న నేపథ్యంలో ఇదే పూర్తిస్థాయి చివరి బడ్జెట్ అయిన కారణంగా ప్రజాహితమే తమ ప్రథమ ప్రాధాన్యమని చూపించే కసరత్తు ఎంత చేసినప్పటికీ ప్రభుత్వం అసలు రంగును బడ్జెట్ నివేదిక దాచలేక పోయింది.

సాధించిన ఘనతను చాటుకొనే బడ్జెట్ ప్రసంగపు ఉపోద్ఘాతంలోనే ఆర్థిక మంత్రి చిదంబరం తమ అసలు లక్ష్యాన్ని తెలియజేశారనే విషయం జాగ్రత్తగా పరిశీలిస్తే స్పష్టమవుతోంది. బడ్జెట్ లోటులను ఎఫ్.ఆర్.బి.ఎం. చట్ట లక్ష్య పరిధిలో నియంత్రించగలిగామని ఆయన సగర్వంగా ఉటంకించడం 2008-09 సంవత్సరపు బడ్జెట్ స్వరూప స్వభావాల్ని విస్పష్టంగా ఆవిష్కరించింది. నడుస్తున్న ఆర్థిక సంవత్సరం 2007-08 బడ్జెట్‌లోని విత్తలోటు అంచనా స్థూల జాతీయోత్పత్తి (జి.డి.పి.)లో 3.3 శాతానికి సమానం కాగా దాన్ని సవరించి 3.1 శాతానికే కుదించగలిగి నందుకు తమ ప్రభుత్వాన్ని తామే అభినందించుకున్నారు. అలాగే రెవెన్యూ లోటు తొలి అంచనా జిడిపిలో 1.5 శాతానికి సమానం కాగా సవరించిన అంచనాలో మరింత తగ్గి 1.4 శాతంగా తేలింది. ఈ విజయపరంపరని కొనసాగించడమే ధ్యేయంగా 2008-09 బడ్జెట్‌లో విత్తలోటుని 2.5 శాతానికి, రెవెన్యూ లోటుని 1 శాతానికి తగ్గిస్తున్నట్టు అధికారపక్ష సభ్యుల కరతాళ ధ్వనుల మధ్య చిదంబరం ప్రకటించారు.

లోటు తగ్గిస్తున్నారంటే ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించే కృషి చేస్తున్నార నేది స్పష్టం. ఒక పక్క ప్రభుత్వ ఆదాయం పెరిగిందని పన్నుల వసూళ్లు అపూర్వ స్థాయిలో నమోదయ్యాయని ప్రభుత్వం అంగీకరిస్తూనే మరొ పక్క ఈ అవకాశాన్ని ఆసరాగా అభివృద్ధి వ్యయాన్ని పెంచే దిశగా కృషి చేయడానికి బదులు లోటు తగ్గించడమే ధ్యేయంగా కేటాయింపుల్ని కుదించే ప్రయత్నం చేసింది. నయా ఉదారవాద ఆర్థిక విధానానికి కట్టుబడ్డ ప్రభుత్వం మాటల్లో ఎన్ని చెప్పనప్పటికీ చేతల్లో మటుకు అణుమాత్రం కూడా తన విధానాలకు విరుద్ధంగా ప్రవర్తించలేదు. 1990 తర్వాత అమలైన సంస్కరణలను మరింత లోతుగా విస్తరించే యత్నమే తాము పగ్గాలు చేపట్టినప్పటి నుండీ ఐక్య ప్రగతిశీల కూటమి ప్రభుత్వం కొనసాగిస్తూ ఉంది. బడ్జెట్ లోటును నియంత్రించాలనే అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐ.ఎం.ఎఫ్.) నిబంధనని ఇప్పుడు యు.పి.ఎ.ని విమర్శిస్తున్న ఎన్.డి.ఎ తాను పాలనలో ఉన్నప్పుడు 2003లో ఎఫ్.ఆర్.బి.ఎం. పేరిట చట్టబద్ధం చేసింది. అధికారంలోకి రాగానే 2004లో యు.పి.ఎ ఎఫ్.ఆర్.బి.ఎం.ని శాసనాత్మకంగా ప్రకటించి (నోటిఫై చేసి) దాని అమలుకు వీలు కలిగించింది.

లక్ష్యాలుగా ఏం చెప్పినప్పటికి అనుత్పాదక వ్యయం పేరిట సబ్సిడీ లను తగ్గించడం, ప్రజోపయోగకర అభివృద్ధి వ్యయాన్ని కత్తిరించడం, సామాజికరంగ పెట్టుబడులను తగ్గించడం, ప్రభుత్వ వ్యయంలో కోతపెట్టి ప్రైవేట్ రంగాన్ని ప్రోత్సహించడమే లోటు తగ్గించడం తత్సంబంధ చర్యలలోని తాత్పర్యం. ఈ విధానాన్నునుసరిస్తున్న కారణంగానే దేశంలో నిరుద్యోగిత పెరగడం, వ్యవసాయరంగం సంక్షోభంలో పడడం, ఆహార భద్రతకు ముప్పు వాటిల్లడం జరిగింది. రెండంకెల సంఖ్యకు చేరువగా జాతీయోత్పత్తిలో వృద్ధి జరుగుతున్నప్పటికీ దాని ఫలాలు మాత్రం జన బాహుళ్యానికి అందని స్థితి ఏర్పడింది. ఆర్థిక వ్యవస్థ పయనిస్తున్న ఈ దిశను మార్చే ప్రయత్నమేదీ ఈ బడ్జెట్‌లోనూ జరగలేదు.

అయితే ఎన్నికలు రానున్న నేపథ్యంలో రైతులను ఆకర్షించడానికి రుణమాఫీ పథకాన్ని ప్రకటించారు. నిజంగా రైతుల పట్ల ప్రేమే గనక ఉంటే ఈ పథకాన్ని అధికారంలో ఉండే చివరి సంవత్సరంలో కాక గద్దెనెక్కిన తొలి ఏడే ప్రకటించి ఉండేవారనే వాదన నిరాధారమైంది కాదు. పోనీ ప్రజాస్వామ్య ఒత్తిడితో ఇప్పుడైనా తప్పనిసరి పరిస్థితిలో ఒక్క చక్కటి పథకాన్ని అమలు చేస్తున్నరనడానికి వీలు లేకుండా అసంబద్ధ నిబంధనలతో పథకం తయారైంది. రైతుల కడగండ్లు తొలగించే దివ్యౌషధమని ప్రభుత్వ వర్గాలు ఢంకా భజాయిస్తున్నా వాస్తవానికి ఈ పథకం కలిగించే ప్రయోజనం కొద్ది శాతం రైతులకే పరిమిత ప్రయోజనం కలిగిస్తుంది. 31 మార్చ్ 2007 కి పూర్వం సంస్థాగత వ్యవసాయ పరపతి పొంది అదే సంవత్సరం డిసెంబర్ చివరకు గడువు మీరిన బాకీగా మారి 28 ఫిబ్రవరి 2008 నాటికి చెల్లించకుండా ఉంటేనే అదీ ఐదెకరాల లోపు రైతులకు పథకం వర్తిస్తుంది. ఇలాంటి వారు మూడు కోట్ల మంది ఉంటారని ప్రభుత్వం అంచనా. వారికి తోడు ఐదెకరాల పై బడిన భూమి కలిగి ఇదే రీతిలో మార్చ్‌కి పూర్వం అప్పు పొంది డిసెంబర్‌లో గడువు మీరనిచ్చి 29 ఫిబ్రవరి 2008 దాకా చెల్లించని వారు మరో కోటి మంది ఉంటారని, వారి బకాయలో 75 శాతం చెల్లిస్తే 25 శాతం రాయితీ ఇస్తామని ప్రభుత్వం తెలియజేసింది. ఈ పథకంలో చిన్న రైతుల రుణాల మాఫీకి 50,000 కోట్ల రూపాయలు

పెద్ద రైతుల రాయితీకి మరో 10,000 కోట్లు మొత్తం 60,000 కోట్లు ఖర్చవుతుందని ప్రభుత్వ అంచనా. కాని బడ్జెట్‌లో మటుకు ఈమేర కేటాయింపులు చేయలేదు. ఈ ఏడు జూన్ చివరికల్లా సంపూర్ణంగా అమలయ్యే ఈ పథకానికి సంబంధించిన రొక్కం బ్యాంకులకు మూడేళ్లలో ప్రభుత్వం సమకూరుస్తుంది.

బడ్జెట్ కేటాయింపులు అందుకు సంబంధించిన తిరకాసులు బ్యాంకులకు చేసే సర్దుబాట్లు అటుంచి ఈ పథకం రైతులకు ఏమేర వాస్తవ ప్రయోజనం కలిగిస్తుందనేది ఇక్కడ పరిశీలించాలి. ఆర్థిక సంస్కరణలు దానిలో భాగంగా అమలైన బ్యాంకింగ్ రంగ సంస్కరణల అనంతరం సంస్థాగత వ్యవసాయ పరపతి తగ్గుతూ వస్తోంది. మరింత దురదృష్టకర విషయమేమంటే వ్యవసాయ రుణాల్లో చిన్న, సన్నకారు రైతుల వాటా తగ్గుతూ వస్తోంది. వ్యవసాయ కమతాల్లో చిన్న కమతాల సంఖ్య 90 శాతం పైగా ఉంటుందనేది గమనార్హం. వ్యవసాయ పరపతి సుమారు 50 శాతం మేర మాత్రమే సంస్థల నుండి అందుతోందని మిగతాది ప్రైవేట్ వడ్డీ వ్యాపారులు ఇతరుల నుండి సమకూరుతోందని ప్రభుత్వ లెక్కలే తెలియజేస్తున్నాయి. ఇక సన్న, చిన్నకారు రైతుల్లో 70 శాతం మేర సంస్థాగత పరపతికి నోచుకోలేదు. అంటే చిన్న రైతుల్లో 70 శాతం వ్యక్తులకు రుణాల రద్దు పథకం ఎలాంటి ప్రయోజనం కలిగించదనేది స్పష్టం. ఇక అప్పులు పొందిన 30 శాతంలో కూడా అత్యధికుల రుణాలు తిరగరాయడం వల్లను లేక ఉన్న ఆస్తులు అమ్మి తిరిగి చెల్లించడం వల్లను వారి అప్పులు గడువు మీరిన బాకీల జాబితాలోకి రావు. అలాగే బంగారు అభరణాలు కుదువబెట్టి ఇతర మార్గాలలోనే సంస్థల నుండి పొందిన రుణాలలో అధికభాగం వ్యవసాయ రుణాల వర్గీకరణలోకి రావు. దీనికితోడు ఐదెకరాలు దాటిన భూమి ఉన్నప్పటికి దాని ఉత్పాదకత అంతంత మాత్రంగానే ఉంటుంది కనుక పెద్ద రైతులుగా పేరున్న ఈ రైతుల బతుకులు కూడా సాంకేతికంగా చిన్న రైతులుగా పరిగణించే వారి జీవితాల కంటే భిన్నంగా ఉండవు. వాస్తవానికి విదర్భ ప్రాంతంలో ఆత్మహత్యలు చేసుకొన్న రైతుల్లో ఎక్కువ మందికి ఐదెకరాలు దాటిన నిస్సారమైన భూమి ఉంది. అంటే ఆత్మహత్యలకు పాల్పడే దుర్భర జీవితాలు గడుపుతున్న స్థాయి బతుకులీడుస్తున్న వారికి కూడా ఈ పథకం ఎలాంటి ప్రయోజనాన్ని కలిగించదు. మొత్తం పైన ప్రభుత్వం చెబుతున్నదానికి ఈ పథకం కలిగించనున్న వాస్తవ ప్రయోజనానికి పెద్ద అఖాతమే ఉందనేది వాస్తవం.

ఇక్కడ దృష్టి సారించాల్సిన మరో ప్రధానాంశం లేదా చర్చించాల్సిన అత్యంత ప్రధానాంశం రైతులు తీసుకున్న రుణాలు తిరిగి చెల్లించలేని నేపథ్యానికి సంబంధించింది. వ్యవసాయం ప్రత్యేకించి చిన్న కమతాల్లోని సేద్యం ఏ మాత్రం లాభదాయకంగా లేదు. అందుకు కారణాలు అందరికీ తెలిసినవే. ఉత్పాదకాల ధరలు అధికంగా ఉండడం, వ్యవసాయాన్ని వృద్ధిచేసే మౌలిక వ్యవస్థ బలహీనంగా ఉండడం, రైతులకు తగు విజ్ఞానాన్ని అందించే ఏర్పాటు లేకపోవడం, మార్కెటింగ్ సౌకర్యాల లోపం, గిట్టుబాటు గాని ఉత్పత్తులు, పెట్టుబడి వ్యయానికి అవసరమయ్యే నిధుల కొరత వీటిలో ప్రధానమైనవి. ఈ పరిస్థితిని చక్కదిద్దడానికి బదులు సమస్యని మరింత జటిలం చేసే విధంగానే ప్రభుత్వ విధానాలు సంస్కరణానంతర కాలంలో కొనసాగాయి. వ్యవసాయం పైన తగుస్థాయిలో పెట్టుబడులు సమకూరడంలేదు. 2006-07లో దేశ ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడుల పెరుగుదల 33.8 శాతం కాగా వ్యవసాయ మూలధన వృద్ధిరేటు కేవలం 12.5 శాతంగా నమోదైంది. స్థూల జాతీయోత్పత్తిలో వృద్ధి 8 నుండి 9 శాతంగా ఉండగా వ్యవసాయ వృద్ధిరేటు మటుకు 2.6 శాతం దాటలేదు. అయినా వ్యవసాయం కోసం తగు స్థాయిలో కేటాయింపు జరుగలేదు. కేంద్ర ప్రణాళికా వ్యయంగా వ్యవసాయం, తదనుబంధ కార్యకలాపాలు, గ్రామీణాభివృద్ధి, నీటి పారుదల, వరదల నిరోధం వంటివన్నీ కలిపి 2008-09 బడ్జెట్‌లో పొందిన వాటా 34,316 కోట్ల రూపాయలు. 2007-08 లో కేటాయించిన 30,145 కోట్ల రూపాయలకంటే ఇది కేవలం 4,171 కోట్ల రూపాయలు మాత్రమే ఎక్కువ. ద్రవ్యోల్బణం ప్రభావాన్ని లెక్కిస్తే వాస్తవంగా పెరిగిన మొత్తం సుమారు రు. 2,500 కోట్లు మాత్రమే. అంటే వ్యవసాయాన్ని సంక్షోభం నుండి గట్టించే ప్రయత్నమేదీ బడ్జెట్‌లో జరుగలేదనే చెప్పాలి. దానర్థం రైతులు రుణాలు చెల్లించలేని స్థితి పునరావృతం కాదనే భరోసా బడ్జెట్‌లో దొరకదు. కేవలం కొద్ది మందికి స్వల్ప మొత్తంలో కలిగే తాత్కాలిక ఉపశమనంగానే రుణాల రద్దు పథకాన్ని అర్థం చేసుకోవాలి.

అస్తవ్యస్థ విధానాల కారణంగా వ్యవసాయరంగంలో అనేక వైరుధ్యాలు వ్యక్తమవుతున్నాయి. ఒక దశలో పుష్కలమైన ఆహారధాన్యాల నిల్వలు కనిపిస్తుండగా మరోపక్క ఆకలి చావులు, ప్రజలు అర్ధాకలితో మలమలలాడడం కనిపించింది. రైతులకు గిట్టుబాటు ధర రాని వైనం ఒక పక్క, సామాన్యుడు కొనలేని స్థాయిలో నిత్యావసరాల ధరలు మరో పక్క ఏకకాలంలో వ్యక్తమవుతున్నాయి. ఆహార ధాన్యాల స్వయం సమృద్ధంపై గొప్పలు పోతున్న తరుణంలో భారీఎత్తున దిగుమతులు చేసుకోవాల్సిన వైనం ఎదురవుతున్నది. ప్రజా పంపిణీ ధర కంటే తక్కువ ధరకు ఎగుమతులు చేయడం, మద్దతు ధరకు మించిన ధరలో దిగుమతి చేసుకోవడం జరుగుతున్నది. తలసరి ఆహారధాన్యాల లభ్యత పడిపోతున్న స్థితి, కొనుగోలువ్యయం పడిపోతున్న పరిస్థితి సర్వేలు అద్దం పడుతున్నాయి.

ద్రవ్యోల్బణం పెరిగి సామాన్యుడి బతుకు దుర్భరమైతున్నప్పటికీ ఆహార సబ్సిడీని తగు స్థాయిలో పెంచలేదు. 2007-08 సంవత్సరపు సవరించిన అంచనా మొత్తం రు. 31,546 కోట్ల కంటే కేవలం రు. 1121 కోట్లు అదనంగా రు. 32,667 కోట్ల మేర 2008-09లో ఈ పద్దు కింద పెంచారు. ద్రవ్యోల్బణాన్ని లెక్కలోకి తీసుకొంటే రు. 600 కోట్లు తక్కువ కేటాయించినట్టు లెక్క.

సామాజిక రంగానికంతా కలిపి కేటాయించిన మొత్తం రు. 95,915 కోట్లు. నిరుటేడు రు. 80,315 కోట్ల కంటే ఇది రు. 15,600 కోట్లు ఎక్కువ. అంటే వాస్తవ అదనపు కేటాయింపు రు. 10,000 కోట్లు దాటదు. విద్యా, వైద్య రంగాలకు చేసిన కేటాయింపులు కనీస ఉమ్మడి ప్రణాళిక పత్రం సూచనకి దరిదాపుల్లో కూడాలేవు. అనేక రంగాలలో కేటాయింపులు నామమాత్రంగానే ఉన్నాయి. ఉదాహరణకు 13.9 కోట్ల పిల్లలకు లబ్ధిచేకూర్చడానికి ఉద్దేశించిన మధ్యాహ్న భోజనానికి రు. 8,000 కోట్లు కేటాయించారు. అంటే రోజుకు ఒక విద్యార్థికి రు. 1.57 అన్నమాట. కాని ప్రభుత్వ

**కేంద్రానికైనా, రాష్ట్రానికైనా బడ్జెట్ తయారీలోనూ, అంకెల్లోనూ, అమలులోనూ జవాబుదారీతనం ఉన్నప్పడే బడ్జెట్‌కు సార్థకత అని అంటున్నారు ఎన్. శ్రీదేవి**

# కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లు

ఇటీవల కేంద్ర ప్రభుత్వం, మన రాష్ట్ర ప్రభుత్వం 2008-09 ఆర్థిక సంవత్సరానికి బడ్జెట్‌ను ప్రవేశపెట్టాయి. ఈ రెండు ప్రభుత్వాలు గత నాలుగేళ్లలో ఐదు బడ్జెట్లను ప్రతిపాదించాయి. ఇదే కాలంలో ఎఫ్.ఆర్.బి.ఎం. చట్టాన్ని ప్రవేశపెట్టారు. ఈ చట్టం ప్రకారం రెవెన్యూ లోటు 2008-09 కల్లా రూపు మాపాలి. ద్రవ్యలోటు (ఫిక్స్‌డ్ డెఫిసిట్) 2009-10 కల్లా జి.డి.పి.లో (రాష్ట్రంలో జి.డి.పి.లో) మూడు శాతానికి అధిగమించకుండా ఉండేటట్లు చూడాలి. ఈ నేపథ్యంలో 2008-09 బడ్జెట్‌కు ప్రాముఖ్యత (రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ) ఉందనే చెప్పాలి. అందుకే 2008-09 బడ్జెట్‌లో ఏమి ప్రతిపాదించారు అనే విషయం పై చర్చకన్నా ఈ నాలుగేళ్లలో ఆర్థిక లావాదేవీలు ఎలా ఉన్నాయి? ఎఫ్.ఆర్.బి.ఎం. చట్టం ఉద్దేశం నెరవేరిందా? వంటి అంశాలు ఇక్కడ చూడడం జరిగింది.

### కేంద్ర బడ్జెట్ 2008-09

ఆర్థిక సంవత్సరం 2004-05లో బడ్జెట్ మొత్తం రు. 4,97,682 కోట్లు కాగా 2008-09 సంవత్సరానికి వేసిన అంచనా రు. 7,50,884 కోట్లు. అంటే ఈ నాలుగేళ్లలో 1.5 రెట్లు పెరిగింది. (పట్టిక 1)

రెవెన్యూ రాబడులు దాదాపు రెండింతలు పెరిగితే రెవెన్యూ వ్యయం 1.7 రెట్లు పెరిగింది. కాని మొదటి నుండి రెవెన్యూ వ్యయం రెవెన్యూ ఆదాయం కన్నా ఎక్కువగా ఉండడం వల్ల, రెవెన్యూ వ్యయం రేటు తక్కువగా ఉన్నా, రెవెన్యూ లోటు కొనసాగుతూనే ఉంది. ఎఫ్.ఆర్.బి.ఎం. చట్టం నిర్దేశించిన స్థాయికి ద్రవ్యలోటు చేరినా, రెవెన్యూ లోటు ఇంకా చేరుకోలేదు.

### రాబడులు

మొత్తం రాబడులలో రెవెన్యూ రాబడులు 61.49 శాతం (2004-05) నుండి 74 శాతంకి (2007-08) పెరిగాయి. 2008-09లో ఇది 80 శాతానికి చేరుకుంటుందని అంచనా. వీటిలో పన్ను రాబడి ఈ కాలంలో 2.3 రెట్లు పెరగగా, పన్నేతర ఆదాయం 1.2 రెట్లు పెరిగింది.

ఇక మూలధన రాబడులు, మొత్తం రాబడులలో దాదాపు 39 శాతంగా (2004-05) ఉంది. రాను రాను 26 శాతం (2007-08) తగ్గింది. 2008-09 నాటికి దీని శాతం ఇంకా తగ్గి 19.7 శాతానికి చేరుతుందని అంచనా. దీనికి కారణాలు మూలధన రాబడులు క్రమేపి తగ్గడం, రెవెన్యూ రాబడులు ఆ మేరకు పెరగడం. మూలధన రాబడులు ముఖ్యంగా చేస్తున్న, అంటే 2004-05 నుండి 2008-09 వరకు రుణాల మీద ఆధారపడి ఉంటుంది. ఈ రుణాలు ఈ కాలంలో ఆరు శాతం మాత్రమే పెరిగాయి.

### వ్యయాలు

మొత్తం వ్యయాన్ని రెండు రకాలుగా విభజించవచ్చు.

---

లెక్కల ప్రకారం ఒక్కో విద్యార్థికి వండి పెట్టడానికయ్యే వ్యయమే రు. 1.50. ఇక మిగిలేది కేవలం 7 పైసలు మాత్రమే. ఇలా వివరాల్లోకి వెళితే అనేక నామమాత్రపు హాస్యాస్పద కేటాయింపులు బయటపడతాయి.

ఇలా సామాన్యుడికి మొండి చేయి చూపించిన ప్రభుత్వం ధనికులకు, కార్పొరేట్ వర్గాలకు కావలసినన్ని తాయిలాలు సమకూర్చింది. కార్పొరేట్ పన్నులు తగ్గించనందుకే వారికి లాభం చేకూర్చనట్టు కొందరు భావిస్తున్నారు. కాని కడపటి బడ్జెట్‌లో వారికి విపరీతమైన రాయితీలు ఇస్తూ వచ్చారు. ఉదాహరణకు కార్పొరేట్ పన్ను ప్రస్తుతం 30 శాతంగా ఉండి దానిపై 10 శాతం సర్‌చార్జ్, మరో 2 శాతం విద్యా సెస్ ఉన్నప్పటికీ అనేక రాయితీలు పోను వాస్తవంగా చెల్లించేది 19 శాతం మాత్రమే. అలాగే ఆదాయం పన్నులో అధికాదాయాల వారికి సంస్కరణానంతర బడ్జెట్‌లు మితిమీరిన రాయితీలను కలిగించి సంపద పునఃపంపిణీకి ఆదాయం పన్నుని ఒక ఉపకరణంగా చూడవచ్చనే ఆలోచనకి తిలోదకాలిచ్చాయి. వినిమయాన్ని ప్రోత్సహించాలనే నెపంతో కార్లు ఇతర విలాసవస్తువులకు పరోక్ష పన్నుల్లో రాయితీలు ఇవ్వడం జరిగింది.

మొత్తంపైన సామాజిక రంగానికి, పేదలకు కేవలం మాటల ద్వారానో లేదా వివిధ బీమా పథకాల ద్వారా రక్షణ కలిగిస్తామని చెప్పడం జరిగింది. పేదలకు మేలు చేస్తామనే ఉత్తుత్తి మాటలు చెప్పడం కాని, తగు ప్రయోజనం వాస్తవంలో కలిగించని రుణాల రద్దు వంటి పథకాలు కాని ప్రజలను మభ్యపెట్టలేవు. 'భారత్ వెలిగిపోతుందని' ఎన్.డి.ఎ. ప్రభుత్వం చెబితే ప్రజలు నమ్మి ఓట్లు వేయలేదు. అలాగే 'సామాన్యుడి బడ్జెట్' అని చెప్పినంత మాత్రాన ప్రజలు గుడ్డిగా నమ్మి కాంగ్రెస్‌కు తిరిగి పట్టం కడతారనుకోవడం భ్రమగానే మిగిలిపోవచ్చు. ◆

పట్టిక 1
కేంద్ర బడ్జెట్
ఆదాయం

(రు. కోట్లలో)

| | వసూళ్లూ / ఖర్చు | 2004-05 అకౌంట్స్ | 2005-06 అకౌంట్స్ | 2006-07 అకౌంట్స్ | 2007-08 రెవెన్యూ అంచనా | 2008-09 బడ్జెట్ అంచనా |
|---|---|---|---|---|---|---|
| 1 | రెవెన్యూ వసూళ్లు (2+3) | 306013 | 347462 | 434387 | 525098 | 602935 |
| | | (61.49) | (68.65) | (74.46) | (74.02) | (80.30) |
| 2 | పన్నుల ద్వారా వచ్చిన ఆదాయం (కేంద్రం) | 224798 | 270264 | 351182 | 431773 | 507150 |
| | | (4517) | (53.40) | (60.20) | (60.87) | (67.54) |
| 3. | టాక్సేతర ఆదాయం | 81215 | 77198 | 83205 | 93325 | 95785 |
| | | (16.32) | (15.25) | (14.26) | (13.15) | (12.76) |
| 4. | మూలధన వసూళ్లు (5+6+7) | 191669 | 158661 | 149000 | 184275 | 147949 |
| | | (38.51) | (31.35) | (25.54) | 25.97) | (19.70) |
| 5. | బాకీ వసూళ్లు | 62043 | 10645 | 5893 | 4497 | 4497 |
| | | (12.47) | (2.10) | (1.01) | (0.63) | (0.60) |
| 6. | ఇతర వసూళ్లు | 4424 | 1581 | 534 | 36125 | 10165 |
| | | (0.89) | (0.31) | (0.09) | (5.09) | (1.35) |
| 7. | అప్పులు, ఇతర ఖర్చులు | 125202 | 146435 | 142573 | 143653 | 133287 |
| | | (25.15 | (28.93) | (24.44) | (20.25) | (17.75) |
| **8.** | **మొత్తం వసూళ్లు (1+4)** | **497682** | **506123** | **583387** | **709373** | **750884** |
| | | **(100.00)** | **(100.00)** | **(100.00)** | **(100.00)** | **(100.00)** |
| | **వ్యయం** | | | | | |
| 9. | ప్రణాళికేతర ఖర్చు | 365406 | 365485 | 413527 | 501849 | 507498 |
| | | (73.41) | (72.20) | (70.88) | (70.74) | (67.58) |
| 10. | రెవెన్యూ అకౌంట్ | 296857 | 327903 | 372191 | 412975 | 448352 |
| | | (59.64) | (64.79) | (63.79) | (58.21) | (59.70) |
| 11. | అందులో వడ్డీ చెల్లింపులు | 126934 | 132630 | 150272 | 171971 | 190807 |
| | | (25.50) | (26.20) | (25.76) | (24.24) | (25.41) |
| 12. | మూలధన అకౌంట్ | 68549 | 37582 | 41336 | 88874 | 59146 |
| | | (13.77) | (7.42) | (7.08) | (12.53) | (7.88) |
| 13. | ప్రణాళికా వ్యయం | 132276 | 140638 | 169860 | 207524 | 243386 |
| | | (26.58) | (27.78) | (29.11) | (29.25) | (32.41) |
| 14. | రెవెన్యూ అకౌంట్ | 87495 | 111858 | 142418 | 175611 | 209767 |
| | | (17.58) | (22.10) | (24.41) | (24.75) | (27.93) |
| 15. | మూలధన అకౌంట్ | 44781 | 28780 | 27442 | 31913 | 33619 |
| | | (9.00) | (5.69) | (4.70) | (4.50) | (4.48) |
| **16.** | **మొత్తం ఖర్చు (9+13)** | **497682** | **506123** | **583387** | **709373** | **750884** |
| | | **(100.00)** | **(100.00)** | **(100.00)** | **(100.00)** | **(100.00)** |
| 17. | రెవెన్యూ ఖర్చు (10+14) | 384352 | 439761 | 514609 | 588586 | 658119 |
| | | (77.22) | (86.88) | (88.20) | (82.96) | (87.64) |
| 18. | మూలధన ఖర్చు (12+15) | 113330 | 66362 | 68778 | 120787 | 92765 |
| | | (22.77) | (13.11) | (11.79) | (17.03) | (12.35) |
| 19. | రెవెన్యూ లోటు (17-1) | 78339 | 92299 | 80222 | 63488 | 55184 |
| | జి.డి.పి. లో శాతం | (2.5) | (2.6) | (1.9) | (1.4) | (1.0) |
| 20. | ద్రవ్య లోటు (16-(1+5+6)) | 125202 | 146435 | 142573 | 143653 | 133287 |
| | జి.డి.పి.లో శాతం | (4.0) | (4.1) | (3.5) | (3.1) | (2.5) |
| 21. | ప్రాథమిక లోటు (20-11) | -1732 | 13805 | -7699 | -28318 | -57520 |
| | జి.డి.పి. లో శాతం | (-0.1) | (0.4) | (-0.2) | (-0.6) | (-1.1) |

నోట్ : బ్రాకెట్‌లో ఉన్న అంకెలు మొత్తంలో శాతం; మూలం : సంవత్సరాల వారి కేంద్ర బడ్జెట్ పత్రాలు

1) ప్రణాళికా వ్యయం 2) ప్రణాళికేతర వ్యయం. ఈ రెంటిలోనూ రెవెన్యూ వ్యయం, పెట్టుబడి వ్యయం ఉంటాయి.

మొత్తం వ్యయంలో ప్రణాళికేతర వ్యయం 73 శాతం (2004-05) నుండి 68 శాతం (2008-09) తగ్గింది. అంటే ప్రణాళికా వ్యయం 27 శాతం (2004-05) నుండి 32 శాతానికి (2008-09) పెరిగిందన్నమాట. అంటే మొత్తం వ్యయంలో 1/3 వంతు ప్రణాళికలపై ఖర్చు అవుతుందని భావన. ఈ ప్రణాళికా వ్యయం పెట్టుబడి వ్యయంలో కాకుండా రెవెన్యూ వ్యయంలో పెరగటం గమనించాల్సిన విషయం.

క్లుప్తంగా చెప్పాలంటే ఎఫ్.ఆర్.బి.ఎం. చట్టం ప్రకారం రెవెన్యూ లోటు రూపుమాపలేక పోవడానికి కారణాలు 1) రెవెన్యూ రాబడుల కన్నా రెవెన్యూ వ్యయం ఎక్కువగానే ఉంటూరావడం, 2) ప్రణాళికా వ్యయం రెవెన్యూ ఎకౌంట్‌లో పెరగడం (పెట్టుబడి వ్యయం అంటే క్యాపిటల్ ఎకౌంట్‌లో పెరిగి ఉంటే రెవెన్యూ మిగులు సాధించడం జరిగేది), 3) వడ్డీ చెల్లింపులు మొత్తం వ్యయంలో 25 శాతంగా ఉండడం. మిగిలిన 75 శాతంలో ఎక్కువ భాగం సహజంగానే రెవెన్యూ వ్యయంలో ఉండడం, లేక ప్రణాళికేతర వ్యయంగా ఉండడం.

ఇక 2008-09 సంవత్సరానికి అన్ని వర్గాల వారిని మెప్పించే దిశలో కేటాయింపులు గానీ, రాయితీలు గానీ ఉన్నాయి. అన్నిటికన్నా ముఖ్యంగా రు. 60,000 కోట్ల మేరకు రైతుల రుణాలు మాఫీ చేయడం. ఈ మొత్తాన్ని బ్యాంకులకు రాబోయే మూడేళ్ల కాలంలో (2011-12 కల్లా) సర్దుబాటు చేయాలనుకోవడం. ఈ సర్దుబాటు 'పన్ను ఆదాయం' నుండి 'పన్నేతర ఆదాయం' నుండి, 'అప్పుకాని పెట్టుబడి రాబడుల' నుండి కాని, తప్పనిసరి పరిస్థితులలో 'అప్పుగా తీసుకున్న మొత్తం' నుండి గాని బ్యాంకులకు సర్దుబాటు చేస్తారట. ఈ మూడేళ్లలో జి.డి.పి. వృద్ధిరేటులో కుంటుగాని, ద్రవ్యోల్బణం శృతిమించడం కాని ఉండవని ఆర్థిక మంత్రి ప్రగాఢ విశ్వాసం.

ఆర్థికమంత్రి ఆలోచన చేయని విషయం ఏమిటంటే వసూలు కాని వివాదరహితమైన పన్ను బకాయిలు ఐదు ఏళ్లలోపువి సుమారు రు. 9,000 కోట్లు, పదేళ్ల లోపువి రు. 11,000 కోట్లు, పదేళ్లు పైబడ్డవి అన్ని కలిపి దాదాపు రు. 33,769 కోట్లు. అంటే వీటిని వసూలు చేయగలిగితే ఈ మొత్తం రుణ మాఫీ మొత్తంలో సగానికి పైగా చేతికి అందివచ్చేది. ఇక వివాదాల్లో చిక్కుకున్న మొత్తం కలిపితే (ఈ వివాదాలు త్వరగా పరిష్కారమైతే) మొత్తం బకాయిపడ్డ రాబడులు రు. 99,293 కోట్లు. దీనిపై ప్రభుత్వం దృష్టి సారిస్తే వృథా తగ్గడమే కాదు ఈ సొమ్ము ఉత్పాదకత రాబోయే కాలంలో వచ్చే పన్ను ఆదాయం ఉత్పాదకతను పెంచుకోవచ్చు కదా (రాష్ట్ర ప్రభుత్వానికి ఈ విషయం వర్తిస్తుంది). ఇక రాష్ట్ర బడ్జెట్‌కు వద్దాం.

## రాష్ట్ర బడ్జెట్

2004-05 ఆర్థిక సంవత్సరంలో మొత్తం రాబడులు రు. 46,204 కోట్లు అయితే మొత్తం ఖర్చు రు. 45,747 కోట్లు. ఇవి వాస్తవ లెక్కలు. కాగా 2008-09 బడ్జెట్ అంచనాల్లో ఇవి రెండింతలు కన్నా ఎక్కువ. అంటే లక్షకోట్లు దాటాయన్న మాట. ప్రతి ఏడాది ఇవి అధిక శాతాల్లో పెరుగుతోంది. (పట్టిక 2)

ఎఫ్.ఆర్.బి.ఎం. చట్టం ప్రకారం, రాష్ట్ర ప్రభుత్వం 2008-09 కల్లా రెవెన్యూ లోటును తొలగించి రెవెన్యూ మిగులు సాధించాలి. అలాగే ద్రవ్యలోటును 2009-10 నాటికి రాష్ట్రాదాయంలో (జి.ఎస్.డి.పి.లో) మూడు శాతం మించకుండా చూడాలి. మన రాష్ట్రం 2006-07 నాటికే రెవెన్యూ మిగులును, ద్రవ్యలోటు జి.ఎస్.డి.పి.లో మూడు శాతం కన్నా తక్కువగా ఉండేలా చూడగలిగింది. ఈ రెండింటిని సాధిస్తూనే ఇంత భారీ బడ్జెట్ రూపొందించడం మూదావహం.

కాని ఈ భారీబడ్జెట్‌కు వనరుల మార్గాలేమిటి? వీటిని సాధించ గలమనడానికి గల కారణాలేమిటి? ఈ వనరులను ఏయే అంశాలకు కేటాయిస్తున్నారు? అన్న విషయాలపై స్థూలంగా పరిశీలించే ప్రయత్నమే ఇది.

## నిధుల సమీకరణ

ఈ నిధుల సమీకరణలో రెవెన్యూ రాబడుల శాతం 62 శాతం (2004-05) నుండి 78 శాతం (2006-07)కి పెరిగింది. సవరించిన, బడ్జెట్ అంచనాల ప్రకారం ఇది 70 శాతంగా ఉంది. అంటే మిగిలిన వనరులన్నీ మూలధన ఖాతా కిందవస్తాయి.

మొదట రెవెన్యూ రాబడులలో మూడింట రెండువంతులు సొంత వనరులైతే మిగితావి కేంద్ర పన్నుల్లో రాష్ట్రం వాటా, కేంద్రం నుండి వచ్చే గ్రాంట్లు. ఈ వివరణలో ఆశ్చర్యం కలిగించే విషయం ఏది లేదు. కానీ ఆసక్తికరమైన విషయం ఏమిటంటే ప్రతి ఏడాది ఈ వనరులు క్రితం సంవత్సరం కన్నా ఎక్కువ శాతంలో పెరగడం. ఇది వివిధ కారణాల వల్ల సాధ్యపడింది. అందులో ముఖ్యమైనవి (ఎ) ఆర్థిక వ్యవస్థ నిలకడగా వృద్ధి చెందడం (రాష్ట్రస్థాయిలోనూ, దేశస్థాయిలోనూ) (బి) పన్ను సంస్కరణలు ముఖ్యంగా వ్యాట్ (సి) పన్నెండవ ఆర్థిక సంఘం సిఫార్సుల మేరకు కేంద్ర పన్నుల్లో రాష్ట్రాల వాటా, గ్రాంట్లు పెరగడం, (డి) రాష్ట్రంలో పన్నుల వృద్ధి రేటు మొదలైనవి.

ఇక మూలధన ఖాతాలో పెట్టుబడి రాబడుల విషయానికి వస్తే ఇదివరకు చెప్పుకున్నట్లుగా మొత్తం రాబడులలో దీని శాతం దాదాపు 38 శాతంగా 2004-05లో ఉంటే, 2006-07 నాటికి 21 శాతం గాను, సవరించిన, బడ్జెట్ అంచనాల్లో దాదాపు 30 శాతంగా ఉంది. ఇందులో ఎక్కువ భాగం, మొదట మూడు సంవత్సరాల్లో పబ్లిక్ ఖాతా నుండి తీసుకున్న సొమ్ము కాగా ఆ తర్వాత స్థానంలో ప్రజా రుణం ఉండేది. కాని చివరి రెండు సంవత్సరాల్లో ప్రజా రుణం శాతం పెరిగి, తర్వాత స్థానంలో పెట్టుబడి రాబడులున్నాయి. పబ్లిక్ ఖాతా నుండి తీసుకుంటున్న సొమ్ము శాతం తగ్గడానికి ప్రత్యక్ష కారణం ఈ ఖాతాలో చిన్న మొత్తాల పొదుపు శాతం తగ్గడమైతే, మిగతా వనరులపై (పెట్టుబడి రాబడులు, ప్రజారుణం) ఈ రెండేళ్లలో ఎక్కువ ఆధారపడడం కావచ్చు. ప్రజారుణంపై ఎక్కువ ఆధారపడితే వచ్చే సమస్యలు (దాని ఉత్పాదకత అనుకున్నంత లేకపోతే) ఒకవైపు, పెట్టుబడి రాబడులు పెంచుకునే ఆలోచనతో స్థిరాస్తులను అమ్మడం వల్ల (స్థిరాస్తులను అమ్మగా వచ్చిన మొత్తాన్ని పెట్టుబడి రాబడులుగా రాష్ట్రం చూపించినట్లు కాగ్ నివేదిక 2006-07 పేర్కొంది) వచ్చే సమస్యలు అంటే పర్యవసానం మరోవైపు – ఈ రెండింటినీ పాలకులు చర్చించవలసి ఉంది. ఎందుకంటే ఉత్పాదకత ఉండాల్సిన మేరకు ఉండకపోతే ఆర్థిక సంక్షోభం

పట్టిక 2
రాష్ట్ర బడ్జెట్

(రు. కోట్లలో/శాతం)

| | వసూళ్లు / ఖర్చు | 2004-05 అకౌంట్స్ | 2005-06 అకౌంట్స్ | 2006-07 అకౌంట్స్ | 2007-08 రెవెన్యూ అంచనా | 2008-09 బడ్జెట్ అంచనా |
|---|---|---|---|---|---|---|
| **I** | **ఒపెనింగ్ బ్యాలెన్స్** | **-171** | **286** | **-89** | **-281** | **-14** |
| **II** | **రెవెన్యూ వసూళ్లు** | **28750** | **34161** | **44245** | **56127** | **70927** |
| | | **(100.00)** | **(100.00)** | **(100.00)** | **(100.00)** | **(100.00)** |
| 1. | సొంత పన్ను రాబడి | 16255 | 19611 | 23926 | 31402 | 37866 |
| | | (56.5) | (57.4) | (54.1) | (55.9) | (53.4) |
| 2. | సొంత పన్నేతర రాబడి | 3756 | 3598 | 6488 | 6872 | 8873 |
| | | (13.1) | (10.5) | (14.7) | (12.2) | (12.5) |
| 3. | కేంద్ర పన్నులలో వాటా | 6059 | 6951 | 8866 | 10498 | 12597 |
| | | (21.1) | (20.3) | (20.0) | (18.7) | (17.8) |
| 4. | కేంద్రం నుంచి గ్రాంట్లు | 2681 | 4002 | 4965 | 7355 | 11591 |
| | | (9.3) | (11.7) | (11.2) | (13.1) | 16.3 |
| | **మొత్తం రాబడిలో రెవెన్యూ వసూళ్ల శాతం** | **62.2** | **71.8** | **78.6** | **70.3** | **70.5** |
| **III** | **మూలధన రాబడి** | **17455** | **13402** | **12064** | **23739** | **29644** |
| | | **(100.0)** | **(100.0)** | **(100.0)** | **(100.0)** | **100.0** |
| 5. | ఒపెన్ మార్కెట్ లోన్స్ | 3318 | 1956 | 2726 | 8603 | 7633 |
| | | (19.0) | (14.6) | (22.6) | (36.2) | (25.7) |
| 6. | ఫ్లోటింగ్ డెబ్ట్ (గ్రాస్) | 0 | 0 | 0 | 1000 | 3000 |
| | | (0.0) | (0.0) | (0.0) | (4.2) | (10.1) |
| 7. | కేంద్ర ప్రభుత్వం నుంచి రుణాలు | 1841 | 522 | 315 | 1098 | 2569 |
| | | (10.5) | (3.9) | (2.6) | (4.6) | (8.7) |
| 8. | ఇతర రుణాలు | 4674 | 1492 | 1510 | 1937 | 2467 |
| | | (26.8) | (11.1) | (12.5) | (8.2) | (8.3) |
| 9. | డిపాజిట్ల లావాదేవీలు ఇతరాలు (నికర) | 6226 | 9250 | 5153 | 2625 | 1620 |
| | | (35.7) | (69.0) | (42.7) | (11.1) | (5.5) |
| 10. | రుణాలు, అడ్వాన్సులు | 1373 | 182 | 471 | 276 | 356 |
| | | (7.9) | (1.4) | (3.9) | (1.2) | (1.2) |
| 11. | ఇతర రాబడులు | 0 | 0 | 1889 | 8200 | 12000 |
| | | (0.0) | (0.0) | (15.7) | (34.5) | (40.5) |
| 12. | కంటింజెన్సి ఫండ్ (నికర) | 23 | -1 | 1 | 0 | 0 |
| | | (0.1) | (0.0) | (0.0) | (0.0) | (0.0) |
| | **మొత్తం రాబడిలో మూలధన రాబడి శాతం** | **37.8** | **28.2** | **21.4** | **29.7** | **29.5** |
| **IV** | **మొత్తం రాబడులు** | **46204** | **47563** | **56310** | **79866** | **100571** |
| **V** | **ప్రణాళికేతర ఖర్చు** | **33300** | **34125** | **36891** | **46624** | **51885** |
| | | **(72.8)** | **(70.2)** | **(65.3)** | **(58.6)** | **(51.7)** |
| 13. | రెవెన్యూ అకౌంట్ | 24572 | 28432 | 31920 | 39910 | 44252 |
| | | (53.7) | (58.5) | (56.5) | (50.1) | (44.1) |
| 14. | వడ్డీ | 7091 | 7008 | 7280 | 8629 | 8985 |
| | | (15.5) | (14.4) | (12.9) | (10.8) | (8.9) |
| **VI** | **మూలధన వితరణ** | **8728** | **5693** | **4971** | **6714** | **7633** |
| | | **(19.1)** | **(11.7)** | **(8.8)** | **(8.4)** | **(7.6)** |
| 15. | మూలధన ఖర్చు | 323 | -38 | -5 | 45 | 14 |
| | | (0.7) | (-0.1) | (0.0) | (0.1) | (0.0) |
| 16. | ఫ్లోటింగ్ డెబ్ట్ | 0 | 0 | 0 | 1000 | 3000 |
| | | (0.0) | (0.0) | (0.0) | (1.3) | (3.0) |
| 17. | ప్రజా రుణాల చెల్లింపులు | 438 | 574 | 530 | 1008 | 1783 |
| | | (1.0) | (1.2) | (0.9) | (1.3) | (1.8) |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 18. కేంద్ర ప్రభుత్వం నుంచి రుణాలు | 4418<br>(9.7) | 607<br>(1.2) | 1190<br>(2.1) | 783<br>(1.0) | 800<br>(0.8) |
| 19. ఇతర రుణాలు | 2576<br>(5.6) | 4114<br>(8.5) | 2533<br>(4.5) | 2968<br>(3.7) | 1912<br>(1.9) |
| 20. రుణాలు, అడ్వాన్సులు | 972<br>(2.1) | 436<br>(0.9) | 723<br>(1.3) | 910<br>(1.1) | 123<br>(0.1) |
| **VII ప్రణాళికా ఖర్చు** | **12447**<br>**(27.2)** | **14503**<br>**(29.8)** | **19611**<br>**(34.7)** | **32975**<br>**(41.4)** | **48551**<br>**(48.3)** |
| 21. రెవెన్యూ అకౌంట్ మీద | 6735<br>(14.7) | 6483<br>(13.3) | 9519<br>(16.8) | 15766<br>(19.8) | 25965<br>(25.9) |
| 22. మూలధన అకౌంట్ మీద | 5091<br>(11.1) | 7699<br>(15.8) | 9909<br>(17.5) | 12868<br>(16.2) | 17838<br>(17.8) |
| 23. రుణాలు, అడ్వాన్సులు | 621<br>(1.4) | 321<br>(0.7) | 184<br>(0.3) | 4341<br>(5.5) | 4748<br>(4.7) |
| **VIII మొత్తం ఖర్చు** | **45747**<br>**(100.0)** | **48628**<br>**(100.0)** | **56502**<br>**(100.0)** | **79599**<br>**(100.0)** | **100437**<br>**(100.0)** |
| 24. రెవెన్యూ ఖర్చు | 31307<br>(68.4) | 34915<br>(71.8) | 41438<br>(73.3) | 55676<br>(69.9) | 70218<br>(69.9) |
| 25. మూలధన ఖర్చు | 5414<br>(11.8) | 7662<br>(15.8) | 9904<br>(17.5) | 12912<br>(16.2) | 17852<br>(17.8) |
| 26. రుణాలు, అడ్వాన్సులు | 1593<br>(3.5) | 757<br>(1.6) | 907<br>(1.6) | 5251<br>(6.6) | 4871<br>(4.8) |
| 27. మూలధన వితరణ | 7432<br>(16.2) | 5295<br>(10.9) | 4253<br>(7.5) | 5759<br>(7.2) | 7496<br>(7.5) |
| మూలం : వేరు వేరు సంవత్సరాల కేంద్ర బడ్జెట్ పత్రాలు | | | | | |

పునరావృతం కావచ్చు. అలాగే స్థిరాస్తుల అమ్మకం మూలంగా వచ్చే రాబడి మొత్తం రాబడులలో 12 శాతంగానూ, పెట్టుబడి రాబడులలో 40 శాతంగానూ ఆశించడం ఎంతవరకు శ్రేయస్కరం?

## వ్యయాలు – తీరుతెన్నులు

మొత్తం వ్యయంలో రెవెన్యూ ఖర్చు చివరి రెండేళ్లలో 70 శాతంగా ఉంది. (మొదట మూడేళ్లలో ఇదే ధోరణి) పెట్టుబడి వ్యయం పెరిగిందనే చెప్పాలి. ఈ మొత్తం వ్యయాన్ని ప్రణాళిక, ప్రణాళికేతర వ్యయంగా విభజిస్తే, మొదటిది క్రమక్రమంగా పెరుగుతోంది. 27 శాతం (2004–05) నుండి 48 శాతం (2008–09) రెండవది ఆ మేరకు తగ్గుతోంది. ఇది అందరి మెప్పు పొందే అంశమే.

వివరాల్లోకి వెళితే, 2004–05లో మొత్తం రెవెన్యూ ఖర్చులో 33 శాతం ఆర్థిక సేవలకు, 31 శాతం సాంఘిక సేవలకు మిగిలిన 36 శాతం సాధారణ సర్వీసులకు ఖర్చుపెట్టారు. 2006–07 నాటికి సాధారణ సర్వీసులు, సాంఘిక సర్వీసులు విడివిడిగా 30 శాతం కాగా, ఆర్థిక సర్వీసులు 39 శాతంగా చెప్పవచ్చు. 2008–09 ఆర్థిక సంవత్సర బడ్జెట్ అంచనాల్లో ఆర్థిక సర్వీసులు 42 శాతం సాంఘిక సర్వీసులు 35 శాతం, మిగిలిన 23శాతం సాధారణ సర్వీసులుగా అంచనా వేశారు.

ఈ వివరాల్ని ఇంకో కోణంలోంచి చూస్తే, రెవెన్యూ ఖర్చులో సామాజిక ఆర్థిక సేవల్లో ప్రతి సంవత్సరం క్రితం ఏడాది కన్నా ఎక్కువ ఖర్చు పెట్టినట్లు అకౌంట్స్ తెలుపుతున్నాయి. అదే దిశలో 2007–08 సవరించిన అంచనాలు 2008–09 బడ్జెట్ అంచనాలు చెబుతున్నాయి. ఈ వివరాలు ఎంత ఆశాభావాన్ని కల్పిస్తాయో అసలు కేటాయింపులకు (బడ్జెట్ / సవరించిన అంచనాలు) జరిగిన ఖర్చుకు మధ్య తేడాలను లెక్కించినప్పుడు అంతే నిరుత్సాహాన్ని కలిగిస్తాయి.

బడ్జెట్ అంచనాలు రాబోయే ఆర్థిక సంవత్సరానికి తయారు చేస్తే, సవరించిన అంచనాలు దాదాపు ఎనిమిది నెలల వాస్తవాలను (లెక్కలను) ఆదాయం కానీ, వ్యయం కానీ, ఆధారంగా తీసుకొని లెక్కించబడతాయి. అటువంటప్పుడు అకౌంట్స్ సవరించిన అంచనాలకు దగ్గరగా ఉండాలి. కాని 'విద్య, క్రీడలు, కళ, సంస్కృతి' పద్దు కింద జరిగిన ఖర్చు (అకౌంట్స్) 2004–05, 2005–06, 2006–07 సంవత్సరాలలో సవరించిన అంచనాల కన్నా 15 శాతం తక్కువ. 'కార్మిక సంక్షేమం'పై 10 నుండి 30 శాతం వరకు తక్కువ. 'గృహ నిర్మాణం', 'ఆరోగ్యం, కుటుంబసంక్షేమం' మొదలైన వాటిలో కూడా ఇదే ధోరణి.

ఇంకా కొన్ని అంశాల్లో, లేక పద్దుల్లో అకౌంట్స్ సవరించిన అంచనాల కన్నా ఎక్కువగా ఉన్నాయి. ఈ రెండు రకాల తేడాలు సమర్థనీయం కావు. ఎందుకంటే దీనివల్ల ఉన్న మితవనరుల ఉత్పాదకత తగ్గి, ఈ సర్వీసుల సార్థకత ప్రశ్నార్థకం అవుతుంది. కాబట్టి అంచనాల నాణ్యత ఎంతైనా అవసరం.

కేంద్రానికైనా, రాష్ట్రానికైనా బడ్జెట్ తయారీలోనూ, అంకెల్లోనూ, అమలులోనూ జవాబుదారీతనం ఉన్నప్పుడే బడ్జెట్ తయారీకీ చట్ట సభలలో ప్రవేశపెట్టడానికీ సార్థకత కదా. ◆

**గత నాలుగు సంవత్సరాల్లో రాష్ట్ర ప్రభుత్వం ఓవర్ డ్రాఫ్టులు, అడ్వాన్సులు తీసుకోకుండా ఆర్థిక క్రమశిక్షణ పాటించడం వలన మిగులు కానవస్తోందంటున్నారు జె. శివరామ్**

# ఎన్నికల బడ్జెట్

ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజలు ఎన్నుకొన్న ఏపార్టీ ప్రభుత్వమైనా అధికార పగ్గాలు చేపట్టిన వెనువెంటనే ఓటరు మహాశయులకు ఎన్నికల సమయంలో చేసిన వాగ్దానాలను ఫలవంతం చేసేందుకు అనుగుణంగా అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడం సహజం. మరి ఈ అభివృద్ధి కార్యక్రమాలు సజావుగా అమలు జరగాలంటే ఆర్థిక వనరులు ఎంతైనా అవసరం. మరి ఈ ఆర్థికవనరులు ఎలా సంపాదించాలి అన్నది బడ్జెట్ రూపకల్పన ద్వారా ప్రభుత్వం ప్రతి ఏటా తెలియజెప్పటమే కాక సేకరించిన వనరులను ఏయే పద్దుల ద్వారా వ్యయం చేయాలన్నది కూడా బడ్జెట్‌లో పొందుపరుస్తారు. 'ఈ దశలో భాగంగానే మన రాష్ట్ర ఆర్థికామాత్యులు కొణిజేటి రోశయ్య 16 ఫిబ్రవరి 2008న రాష్ట్ర వార్షిక బడ్జెట్ 2008-09న రాష్ట్ర శాసనసభలో ప్రవేశ పెట్టారు. బడ్జెట్ రూపకల్పన ఆషామాషి వ్యవహారం కాదు. మన రాష్ట్ర ఆర్థిక మంత్రి రానున్న కాలంలో శాసనసభకు జరుగనున్న సాధారణ ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని బడ్జెట్ కేటాయింపులు చేసినట్లు విస్పష్టంగా తెలుస్తోంది.

1994 జనవరిలో రాష్ట్ర శాసనసభకు జరిగిన సాధారణ ఎన్నికల లో తెలుగుదేశం అధినేత నందమూరి తారకరామారావు భారీ మెజారిటీతో గెలిచి రాష్ట్ర ముఖ్యమంత్రి పదవి బాధ్యతలు చేపట్టినా అనూహ్యమైన రీతిలో ప్రశాంత విప్లవం ద్వారా ఎన్.టి.ఆర్. మంత్రివర్గం లో రెవెన్యూ - ఆర్థిక మంత్రిగా ఉన్న నారా చంద్రబాబునాయుడు ఎన్.టి.ఆర్.ను తోసిరాజని రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతలు చెపట్టి ఆ ఐదు సంవత్సరాల కాలంలో తన అధికారాన్ని ఏకత్రపరచుటకు శతవిధాల ప్రయత్నించి సఫలీకృతులైనా రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని మాత్రం మెరుగు చెయ్యలేకపోయారు. 1999 లో జరిగిన ఎన్నికలలో తన బలం నిరూపించుకొని పార్టీలో ఎదురులేని నేతగా ఎదిగినా ఆయన పాలనలో అన్ని రంగాలలోను తిరోగమనం గోచరించింది. తత్ఫలితం గానే 2004 రాష్ట్ర శాసనసభకు జరిగిన సాధారణ ఎన్నికలలో రాష్ట్ర ప్రజానీకం తెలుగుదేశం పాలనతో విసిగిపోయి కాంగ్రెస్ పార్టీకి ఘనవిజయం సాధించిపెట్టారు. డా. వై.ఎస్. రాజశేఖర రెడ్డి రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవి బాధ్యతలు చేపట్టి, ఆర్థికామాత్యులుగా కొణిజేటి

పట్టిక - 1
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రెవెన్యూ రాబడులు

(రు. కోట్లలో)

| సంవత్సరం | పన్నుల ద్వారా రాబడి | కేంద్ర పన్నుల వాటా | సొంత పన్నుల ద్వారా రాబడి | భూమిశిస్తు | అమ్మకపు పన్ను | ఆబ్కారి | పన్నేతర రాబడి | గ్రాంట్లు | మొత్తం రెవెన్యూ రాబడి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1999-2000 | 12352 | 3343 | 9009 | 112 | 6172 | 1038 | 2442 | 2011 | 16805 |
| 2000-01 | 14531 | 3979 | 10552 | 116 | 7303 | 1243 | 2743 | 2201 | 19475 |
| 2001-02 | 15612 | 4062 | 11550 | 19 | 7741 | 1652 | 2918 | 3315 | 21845 |
| 2002-03 | 16933 | 4316 | 12617 | 86 | 8322 | 1856 | 3529 | 2540 | 23003 |
| 2003-04 | 18874 | 5069 | 13805 | 34 | 9187 | 1915 | 3605 | 4389 | 26869 |
| 2004-05 | 22313 | 6058 | 16255 | 34 | 11041 | 2093 | 3756 | 2681 | 28750 |
| 2005-06 | 26562 | 6951 | 19611 | 69 | 12946 | 2685 | 4691 | 3597 | 34851 |
| 2006-07 | 32792 | 8866 | 23926 | 113 | 15467 | 3437 | 6488 | 4965 | 44245 |
| 2007-08 | 41899 | 10498 | 31401 | 129 | 20568 | 4125 | 6872 | 7355 | 56127 |
| 2008-09 | 50646 | 12598 | 37866 | 130 | 24887 | 4991 | 8873 | 11591 | 70927 |

గమనిక : 2007-08 : సవరణ అంచనాలు; 2008-09 : బడ్జెట్ అంచనాలు
మూలం : బడ్జెట్ సంగ్రహం 2008-09

పట్టిక - 2
రాష్ట్ర రెవెన్యూ రాబడులలో కాంపౌండ్ అభివృద్ధి రేటు

(శాతం)

| అంశం | 1999-2000 నుండి 2003-04 | 2004-05 నుండి 2008-09 |
|---|---|---|
| పన్నుల ద్వారా రాబడి | 10.53 | 23.22 |
| కేంద్ర పన్నులలో వాటా | 9.57 | 20.64 |
| సొంత పన్నుల రాబడి | 8.78 | 24.14 |
| భూమి శిస్తు | (-) 24.0 | 39.21 |
| అమ్మకపు పన్ను | 9.70 | 23.22 |
| ఆబ్కారి | 17.65 | 24.21 |
| పన్నేతర రాబడి | 10.86 | 23.39 |
| గ్రాంట్లు | 18.58 | 43.96 |
| మొత్తం రెవెన్యూ రాబడి | 11.68 | 25.64 |

గమనిక కాంపౌండ్ అభివృద్ధి రేటు అను ఫార్ములాను ఉపయోగించి లెక్కించబడినది.

రోశయ్యను నియమించారు. మరి రానున్న సంవత్సరంలో తిరిగి రాష్ట్ర శాసనసభకు ఎన్నికలు జరుగనున్నాయి. ఈ నేపథ్యంలో రాష్ట్ర ఆర్థిక పరిస్థితి 1999-2000 నుండి 2003-04 వరకు, 2004-05 నుండి 2008-09 వరకు ఎలా ఉన్నది వీక్షించడం ఎంతైనా ఆవశ్యకం.

రాష్ట్ర ఆర్థిక వనరులు రెండు రకాలు అవి కేంద్రం నుండి బదలాయింపబడే వనరులు, రాష్ట్ర సొంతవనరులు. కేంద్రం నుండి బదలాయింపబడే వనరులు తిరిగి రెండు రకాలు, అవి కేంద్రం వసూలు చేసే పన్నులలో వాటా, సహాయానుదానం (గ్రాంట్స్-ఇన్-ఏయిడ్).

## కేంద్ర పన్నులలో వాటా

కేంద్ర ప్రభుత్వం ప్రతి అయిదు సంవత్సరాలకొకసారి నియమించే ఆర్థిక కమిషన్ సిఫార్సుల ఆధారంగా ప్రతి రాష్ట్రానికి కేంద్రం వనరులను బదలాయిస్తుంది. కేంద్రం వసూలుచేసే పన్నులలో మన రాష్ట్రానికి లభించిన వాటా 1999-2000లో రు. 3343 కోట్లు. ఇది క్రమేపి పెరిగి 2003-04లో రు. 5049 కోట్లకు పెరిగి ఆ అయిదు సంవత్సరాల తెలుగుదేశం పాలనలో 9.57 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదయింది. పిమ్మట 2004-05లో కేంద్రం నుండి లభించిన పన్నుల వాటా రు. 6058 కోట్లకు చేరి అంచెలంచెలుగా పెరిగి 2008-09 లో బడ్జెట్ అంచనా ప్రకారం రు. 12598 కోట్లకు పెరుగుతుందని అంచనా. మరి అయిదు సంవత్సరాల ప్రస్తుత కాంగ్రెస్ పాలనలో కేంద్రం నుండి రాష్ట్రానికి లభించిన పన్నులలో 20.64 శాతం కాంపౌండ్ అభివృద్ధి కింద నమోదయిందే. గమనించ దగ్గ విశేషమేమిటంటే, మొత్తం రాష్ట్ర రెవెన్యూ రాబడిలో కేంద్రం నుండి లభించే పన్నుల వాటా. 1999-2000 లో 19.9గా ఉండగా 2003-04 లో 18.9 శాతం వాటాకు పడిపోయింది. కాగా 2004-05 లో ఈ వాటా 21 శాతానికి పెరిగినా 2008-09 బడ్జెట్ ప్రకారం 17.8 శాతం వాటాకు తగ్గుతుందని అంచనా.

## సహాయాను దానం

కేంద్రం నుండి రాష్ట్రానికి లభించిన సహాయనుదానం 1999-2000 లో రు. 2011 కోట్లు ఉండగా 2001-02లో రు. 3315 కోట్లకు పెరిగినా, 2002-03 లో రు. 2540 కోట్లకు తగ్గి 2003-04లో రు. 4389 కోట్లకు పెరిగి ఈ అయిదు సంవత్సరాల తెలుగుదేశం పార్టీ పాలనలో 18.58 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదయింది. 2004-05లో ప్రస్తుత ప్రభుత్వం మొదటి సంవత్సర పాలనలో కేంద్రం నుండి లభించిన గ్రాంట్లు రు. 2681 కోట్లకు తగ్గినా అటు పిమ్మట క్రమక్రమంగా పెరిగి 2008-09 బడ్జెట్ అంచనాల ప్రకారం రు. 11591 కోట్లకు పెరుగుతాయని అంచనా. అనగా ఈ అయిదు సంవత్సరాల కాంగ్రెస్ పార్టీ పాలనలో సహాయానుదానంలో 43.96 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదవుతుందని అంచనా.

## సొంత పన్నుల ద్వారా రాబడి

రాష్ట్రానికి సొంత పన్నుల ద్వారా లభించిన రాబడి 1999-2000 లో రు. 9009 కోట్లకు ఉండగా, క్రమక్రమంగా పెరిగి 2003-04లో రు. 13805 కోట్లకు, ఈ అయిదు సంవత్సరాల కాలంలో 8.78 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదయింది. ప్రజల మీద అధిక పన్నుభారం మోపినా. 2004-05లో రాష్ట్రానికి సొంత పన్నుల ద్వారా లభించిన రాబడి రు. 16255 కోట్లు ఉండగా 2008-09 లో రు. 37866 కోట్లకు పెరుగుతుందని అంచనా. మొత్తం మీద ఈ అయిదు సంవత్సరాల పాలనలో సొంత పన్నుల ద్వారా లభించిన రాబడిలో 24.14 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదవుతుందని అంచనా. ఈ అయిదు సంవత్సరాల కాంగ్రెస్ పార్టీ పాలనలో అందునా 2008-09

పట్టిక - 3
రాష్ట్రంలో రెవెన్యూ వ్యయం

(రు. కోట్లలో)

| సంవత్సరం | అభివృద్ధి వ్యయం | అభివృద్ధేతర వ్యయం | మొత్తం రెవెన్యూ వ్యయం |
|---|---|---|---|
| 1999-2000 | 11007 | 3031 | 18038 |
| 2000-01 | 14110 | 8960 | 23070 |
| 2001-02 | 14910 | 9816 | 24726 |
| 2002-03 | 14551 | 11506 | 26057 |
| 2003-04 | 17281 | 12549 | 29830 |
| 2004-05 | 17676 | 13631 | 31307 |
| 2005-06 | 20696 | 14219 | 34915 |
| 2006-07 | 25270 | 16169 | 41439 |
| 2007-08 | 36244 | 19432 | 55676 |
| 2008-09 | 49508 | 20710 | 70218 |
| కాంపౌండ్ అభివృద్ధి రేటు | | | |
| 1999-2000 వరకు 2003-04 వరకు | 9.78 | 15.13 | 11.93 |
| 2004-05 నుండి 2008-09 వరకు | 29.96 | 12.17 | 23.15 |

మూలం : బడ్జెట్ సంగ్రహం 2008-09

పట్టిక - 4
రాష్ట్రంలో మూలధన వ్యయం
(రు. కోట్లలో)

| సంవత్సరం | సాధారణ సర్వీసులు | సామాజిక సర్వీసులు | ఆర్థిక సర్వీసులు | మొత్తం మూల ధల వ్యయం |
|---|---|---|---|---|
| 1999-2000 | 30 | 199 | 1763 | 1992 |
| 2000-01 | 51 | 284 | 2389 | 2724 |
| 2001-02 | 72 | 497 | 2522 | 3091 |
| 2002-03 | 278 | 836 | 2682 | 3796 |
| 2003-04 | 261 | 591 | 3399 | 4251 |
| 2004-05 | 280 | 777 | 4357 | 5414 |
| 2005-06 | 26 | 156 | 7480 | 7662 |
| 2006-08 | 344 | 164 | 9396 | 9904 |
| 2007-08 | 112 | 632 | 12168 | 12912 |
| 2008-09 | 210 | 1286 | 16356 | 17852 |

గమనిక : 2007-08 : సవరణ అంచనాలు; 2008-09 : బడ్జెట్ అంచనాలు
మూలం : బడ్జెట్ సంగ్రహం 2008-09

లో ప్రస్తుతం ఉన్న పన్నులను పెంచకుండా, ఎటువంటి కొత్త పన్నులను విధించకుండా సొంత పన్నులలో ఇంత అభివృద్ధి రేటు సాధించడం ముదావహం. సొంత పన్నులలో ప్రత్యక్ష పన్నులైన స్టాంపులు, రిజిస్ట్రేషన్ ఫీజులు 1999-2000 నుండి 2003-04 వరకు 18.05 శాతం అభివృద్ధి రేటు నమోదు కాగా 2004-05 నుండి 2008-09 వరకు 34.87 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు ఉంటుందని అంచనా. ఇట్లాగే అమ్మకపు పన్ను ద్వారా లభించిన రాబడిలో కూడా ప్రస్తుత పాలనలోని అభివృద్ధి రేటు ఎక్కువగా ఉండబోతోందని, సొంత పన్నుల రాబడిలో సింహభాగం అమ్మకపు పన్ను ద్వారా లభిస్తోందని తెలుస్తోంది.

## పన్నేతర రాబడి

పన్నులు కాని రాబడినే పన్నేతర రాబడి అంటారు. పన్నేతర రాబడి రాష్ట్రానికి నాలుగు రకాలుగా లభిస్తోంది. అవి వడ్డీ రాబడులు, సాధారణ సేవలు, సామాజిక సేవలు, ఆర్థిక సర్వీసులు. రాష్ట్రానికి పన్నేతర రాబడి ద్వారా లభించిన రాబడి 1999-2000 లో రు. 2442 కోట్లు అటు పిమ్మట అంచెలంచెలుగా పెరిగి 2003-04 లో రు. 3605 కోట్లకు పెరిగి ఆ ఐదు సంవత్సరాల తెలుగుదేశం పార్టీ పాలనలో 10.86 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదయింది. 2004-05 లో రాష్ట్రానికి లభించిన పన్నేతర రాబడి రు. 3756 కోట్లు ఉండగా క్రమక్రమంగా పెరిగి 2008-09 లో బడ్జెట్ అంచనాల ప్రకారం రు. 8873 కోట్లకు పెరిగి మొత్తంమీద ఈ ఐదు సంవత్సరాల కాలంలో 23.39 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదవుతుందని అంచనా.

మొత్తం రాష్ట్రానికి లభించిన రెవెన్యూ రాబడి 1999-2000 లో రు. 16805 కోట్లు ఉండగా 2003-04 లో రు. 26869 కోట్లకు పెరిగి ఆ అయిదు సంవత్సరాల తెలుగుదేశం పాలనలో 11.68 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదయింది. కాగా 2004-05లో మొత్తం రాష్ట్ర రెవెన్యూ రాబడి రు. 28750 కోట్లు నుండి క్రమక్రమంగా పెరిగి 2008-09 లో బడ్జెట్ అంచనాల ప్రకారం రు. 70927 కోట్లకు పెరుగుతుందని అంచనా, మొత్తం మీద 2004-05 నుండి 2008-09 వరకు రాష్ట్ర రెవెన్యూ రాబడిలో 25.64 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు ఉంటుందని అంచనా.

## రాష్ట్ర రెవెన్యూ వ్యయం

రాష్ట్ర రెవెన్యూ వ్యయం రెండు రకాలు. అభివృద్ధి వ్యయం, అభివృద్ధేతర వ్యయం. రాష్ట్ర రెవెన్యూ వ్యయంలో అభివృద్ధి వ్యయం 1999-2000లో రు. 11007 కోట్లు ఉండగా (2002-03 లో ) 2003-04లో రు. 17281 కోట్లకు పెరిగి ఈ అయిదు సంవత్సరాల కాలంలో మొత్తం మీద 9.78 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదయింది. కాగా 2004-05లో రాష్ట్ర రెవెన్యూ పద్దు కింద అభివృద్ధి వ్యయం రు. 17676 కోట్లు ఉండగా 2008-09 లో బడ్జెట్ అంచనాల ప్రకారం రు. 49508 కోట్లకు అభివృద్ధి వ్యయం పెరుగుతుందని అంచనా, మొత్తం మీద ఈ అయిదు సంవత్సరాల కాంగ్రెస్ పాలనలో అభివృద్ధి వ్యయంలో 29.96 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు ఉంటుందని అంచనా.

## అభివృద్ధేతర వ్యయం

అభివృద్ధేతర వ్యయం రెవెన్యూ పద్దుకింద 1999-2000లో రు. 7031 కోట్లు ఉండగా క్రమక్రమంగా పెరిగి 2003-04లో రు. 12549 కోట్లకు పెరిగి మొత్తం మీద ఈ అయిదు సంవత్సరాల కాలంలో 15.13 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నదమోయింది. కాగా 2004-05 లో అభివృద్ధేతర వ్యయం రు. 13631 కోట్లు నుండి 2008-09 లో బడ్జెట్ అంచనాల ప్రకారం రు. 20710 కోట్లకు పెరుగుతుందని అంచనా. మొత్తంమీద ఈ అయిదు సంవత్సరాల

పట్టిక - 5
మిగిలి ఉన్న ప్రజారుణం
(రు. కోట్లలో)

| సంవత్సరం | బహిరంగ మార్కెట్ రుణాలు | కేంద్రంనుండి తీసుకున్న రుణాలు | స్వయంపాలక సంస్థల నుండి రుణాలు | ప్రత్యేక రెగ్యులేటరీస్ | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1999-2000 | 7739 | 15415 | 1808 | 4152 | 29114 |
| 2000-01 | 9138 | 16510 | 3639 | 6364 | 35651 |
| 2001-02 | 11039 | 19033 | 4590 | 7830 | 42492 |
| 2002-03 | 14259 | 19289 | 5632 | 10903 | 50083 |
| 2003-04 | 17086 | 18706 | 8090 | 14888 | 58770 |
| 2004-05 | 19965 | 16129 | 10188 | 20111 | 66393 |
| 2005-06 | 21348 | 16045 | 7566 | 25449 | 70408 |
| 2006-08 | 23544 | 15169 | 6543 | 30165 | 75421 |
| 2007-08 | 31139 | 15484 | 5512 | 31753 | 83888 |
| 2008-09 | 36989 | 17252 | 6066 | 33286 | 93593 |

మూలం : బడ్జెట్ సంగ్రహం 2008-09

పట్టిక - 6
రెవెన్యూ రాబడి వడ్డీ చెల్లింపుల వాటా

| సంవత్సరం | వడ్డీ చెల్లింపులు (రు. కోట్లలో) | రెవెన్యూ రాబడి (రు. కోట్లలో) | రెవెన్యూ రాబడిలో వడ్డీ చెల్లింపుల వాటా (శాతం) |
|---|---|---|---|
| 1999-2000 | 3161 | 16805 | 18.8 |
| 2000-01 | 3870 | 19475 | 19.9 |
| 2001-02 | 4675 | 21845 | 21.4 |
| 2002-03 | 6131 | 23003 | 26.7 |
| 2003-04 | 6856 | 26869 | 25.5 |
| 2004-05 | 7091 | 28750 | 24.7 |
| 2005-06 | 7208 | 34851 | 20.7 |
| 2006-07 | 7494 | 44245 | 16.9 |
| 2007-08 | 9006 | 56127 | 16.0 |
| 2008-09 | 9404 | 30927 | 13.3 |

గమనిక : 2007-08 : సవరణ అంచనాలు; 2008-09 : బడ్జెట్ అంచనాలు
మూలం : బడ్జెట్ సంగ్రహం 2008-09

కాంగ్రెస్‌పార్టీ పాలనలో అభివృద్ధేతర వ్యయంలో కాంపౌండ్ అభివృద్ధిరేటు 12.17 శాతం మాత్రమే ఉంది. గమనించదగ్గ విషయమేమిటంటే మొత్తం రాష్ట్ర రెవెన్యూ వ్యయంలో అభివృద్ధి వ్యయం వాటా 1999-2000 లో 61 శాతం ఉండగా 2003-04లో 57.9 శాతం వాటాకు పడిపోయింది. అనగా తెలుగుదేశం హయాంలో అభివృద్ధి కుంటుపడినట్లుగా కానవస్తోంది. 2004-05 లో అభివృద్ధి వ్యయం వాటా 56.5 ఉండగా క్రమక్రమంగా పెరిగి 2008-09 లో బడ్జెట్ అంచనాల ప్రకారం 70.5 శాతం వాటాకు పెరుగుతుందని అంచనా. అభివృద్ధేతర వ్యయం మొత్తం రెవెన్యూ వ్యయంలో 1999-2000 లో 39 శాతం ఉండగా 2003-04లో 42.1 శాతం వాటాకు పెరగడం శోచనీయం. కాగా 2008-09 లో అభివృద్ధేతర వ్యయం వాటా 29.5 శాతంకు తగ్గడం గమనార్హం.

## మూలధన వ్యయం

మూలధన వ్యయాన్ని పెట్టుబడి వ్యయం అని అంటారు. పెట్టుబడి వ్యయం వల్ల ఆస్తులు సమకూరుతాయి. అంతే కాకుండా ప్రభుత్వేతర సంస్థల్లో, ప్రభుత్వ రంగ సంస్థల్లో, కార్పొరేషన్లు మొదలైన వాటిలో పెట్టుబడిగా పెట్టిన డబ్బు వల్ల కూడా ఆస్తులు ఏర్పడతాయి. రాష్ట్ర ప్రభుత్వ పెట్టుబడి వ్యయం 1999-2000 లో రు. 1992 కోట్లు ఉండగా 2003-04లో రు. 4251 కోట్లకు ఆ అయిదు సంవత్సరాల తెలుగుదేశం పాలనలో 20.30 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదయింది. మూలధన వ్యయం రాష్ట్ర మొత్తం మీద రు. 5414 కోట్లు ఉండగా 2008-09లో బడ్జెట్ అంచనాల ప్రకారం రు. 17852 కోట్లకు పెరుగుతుందని అంచనా. ఈ అయిదు సంవత్సరాల కాంగ్రెస్ పాలనలో మూలధన వ్యయంలో 33.75 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు ఉంటుందని అంచనా. మూలధన వ్యయంలో ఆర్థిక సర్వీసుల వాటా 2003-04లో 80 శాతం ఉండగా 2008-09లో 91.6 శాతం ఉంటుందని అంచనా. 2003-04లో నీటిపారుదల - వరద నివారణకు చేసిన మూలధన వ్యయం రు. 1538 కోట్లు. ఇది మొత్తం రాష్ట్ర మూలధన వ్యయంలో 36.5 శాతం ఉండగా 2008-09 సంవత్సరంలో ఈ రంగం వాటా 78.6 శాతం. అనగా రాష్ట్రంలో ప్రస్తుతం అధికారంలో ఉన్న కాంగ్రెస్ ప్రభుత్వం నీటిపారుదల రంగానికి అధిక ప్రాధాన్యత ఇవ్వడానికి నిదర్శనం.

## మిగిలి ఉన్న ప్రజారుణం

రుణం అందరూ చేస్తారు. కాని ఈ చేసిన రుణం సద్వినియోగ పరచుకోవడంలోనే ఉంటుంది అసలు రహస్యం. గతంలో తెలుగుదేశం ప్రభుత్వ హయాంలో రాష్ట్రాన్ని అప్పుల ఊబిలో ముంచిందని విమర్శలు వచ్చినా, ఇప్పుడు రాష్ట్రంలో అధికార పగ్గాలు చేపట్టిన కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలో కూడ రుణభారం శరవేగంగా పెరిగిపోతోంది. రాష్ట్ర ప్రభుత్వం చేసే అప్పులు నాలుగు రకాలు. అవి బహిరంగ మార్కెట్ రుణాలు, కేంద్ర ప్రభుత్వం నుండి తీసుకొనే రుణాలు, స్వయంపాలన సంఘం నుండి తీసుకొనే రుణాలు, ప్రత్యేక సెక్యూరిటీలు.

మిగిలి ఉన్న ప్రజారుణం 1999-2000 లో రు. 29114 కోట్లు ఉండగా 2003-04 లో రు. 58770 కోట్లకు పెరిగింది. కాగా 2004-05 లో మిగిలి ఉన్న ప్రజారుణం రు. 66393 కోట్లు. 2008-09లో ఈ మిగిలి ఉన్న ప్రజారుణం రు. 93593 కోట్లకు పెరుగుతుందని అంచనా. తలసరి అప్పు 2003-04లో రు. 7524 ఉండగా 2008-09లో తలసరి అప్పు రు. 11317 కు పెరుగుతుందని అంచనా.

## వడ్డీ చెల్లింపులు

వడ్డీ చెల్లింపులు 1999-2000లో రు. 3161 కోట్లు ఉండగా 2003-04లో రు. 6856 కోట్లకు పెరిగి 2008-09 సంవత్సరంలో బడ్జెట్ అంచనా ప్రకారం రు. 9404 కోట్లకు పెరుగుతాయని అంచనా. కేంద్ర ప్రభుత్వం నియమించిన 11వ ఆర్థిక సంఘం తన సిఫార్సులలో పేర్కొన్నది ఏమంటే రాష్ట్ర ప్రభుత్వ రాబడిలో వడ్డీ చెల్లింపుల వాటా 18 శాతం మించరాదు. కాని తెలుగుదేశం పార్టీ ప్రభుత్వ హయాంలో రాష్ట్ర రెవెన్యూ నుండి 2003-04లో వడ్డీ చెల్లింపుల వాటా దాదాపు 26 శాతంగా ఉంది. కాగా కాంగ్రెస్ రాష్ట్ర అధికార పగ్గాలు చేపట్టిన తరువాత ఆర్థిక క్రమశిక్షణ పాటిస్తూ 2007-08లో రాష్ట్ర రెవెన్యూ రాబడిలో వడ్డీ చెల్లింపుల వాటాను 16 శాతంకు తగ్గించడమే కాకుండా రానున్న 2008-09లో బడ్జెట్ అంచనాల ప్రకారం 13.3 శాతానికి తగ్గించాలని అంచనా వేసింది.

తెలుగుదేశం ప్రభుత్వ హయాంలో రాష్ట్రం లోటు బడ్జెట్‌తో ఉండేది. 2003-04లో రెవెన్యూ లోటు రు. 2962 కోట్లు. గత నాలుగు సంవత్సరాల రాష్ట్ర ప్రభుత్వం ఓవర్ డ్రాఫ్టులు తీసుకోకుండా, లీవ్ అండ్ మీన్స్ అడ్వాన్సు పోకుండా ఆర్థిక క్రమశిక్షణను పాటించడంవల్ల రాష్ట్ర బడ్జెట్ 2008-09లో బడ్జెట్ అంచనాల ప్రకారం రు. 709 కోట్లు మిగులుకానవస్తోంది. ఇలా రాష్ట్ర ప్రభుత్వం మిగులు బడ్జెట్‌ను సమర్పించడం గతంలో చివరిసారిగా 1993-94లో జరిగింది. అందుకని ఆర్థికమంత్రి కొణిజేటి రోశయ్య ప్రవేశపెట్టిన 2008-09 బడ్జెట్‌ను అంకెల గారడీల బడ్జెట్‌గా అభివర్ణించవచ్చును. ◆

దీర్ఘకాలిక ప్రయోజనాలకన్నా స్వల్పకాలిక రాజకీయ ఎన్నికల ప్రయోజనాలనే ఈ బడ్జెట్ ప్రతిబింబించిందని అంటున్నారు **ఎం.ఎల్. కాంతారావు, డా. వి. వెంకటరత్నం**

# కేంద్ర బడ్జెట్ - ఓ విశ్లేషణ

కలల బడ్జెట్‌లు ప్రతిపాదిస్తారనే ఖ్యాతి బడసిన చిదంబరం గారు, 2008-09 సంవత్సరానికి - ఎన్నికల బడ్జెట్‌ను ప్రతిపాదించారు. ఇందులో అన్నివర్గాల ఓటర్లను సంతోషపెట్టే ప్రయత్నం ఉంది. తమ పార్టీకి మేలు చేసే అంశాలపై దృష్టికేంద్రీకరించి, బడ్జెట్ కేటాయింపులు చేశారు. వ్యవసాయ ప్రాధాన్య దేశంలో రైతే వెన్నెముక, రాజు కాబట్టి రుణగ్రస్తులైన రైతులకు కొన్ని షరతులకు లోబడి, సంస్థాగత రుణాలమాఫీ ద్వారా, కొంత వెసులుబాటు కల్పిస్తూ, వారు తమకు రుణగ్రస్తులై ఉండే వీలు కలిగించారు. ఈ పథకం వల్ల రైతాంగానికి లబ్దిసుమారు రు. 60,314 కోట్లు. ఈ మేరకు బ్యాంకులకు కలిగే నష్టాన్ని, నాలుగు సంవత్సరాలలో పూరించే పథకాన్ని ప్రకటించారు.

| సంవత్సరం | రుణమాఫీ కేటాయింపులు (రు. కోట్లు) |
|---|---|
| 2008-09 | 25,000 |
| 2009-10 | 15,000 |
| 2010-11 | 12,000 |
| 2011-12 | 8,000 |

ఈ రుణమాఫీ పథకం ద్వారా ప్రభావితం అయ్యే బ్యాంకుల వర్గీకరణ ఇలా ఉంటుంది.

| బ్యాంకులు | శాతం |
|---|---|
| సహకార బ్యాంకులు | 55 |
| షెడ్యూల్డ్ వాణిజ్య బ్యాంకులు | 35 |
| గ్రామీణ బ్యాంకులు | 10 |

రుణమాఫీ ప్రయోజనం పొందిన ప్రతి రైతు అధికాహారోత్పత్తికి తన వంతు కృషి చేసి, కనీసం అరటన్ను చొప్పున తిండిగింజల ఉత్పత్తి అధికంగా చేసినా, నాలుగు కోట్లమంది రైతులు సుమారు రెండు కోట్ల టన్నుల తిండిగింజల అధికోత్పత్తికి దోహదం చేయవచ్చు. ఇది ఆర్థిక వ్యవస్థకు కలిగే పరోక్ష ప్రయోజనం. ఐతే ఇది జరిగేనా?

రుణమాఫీ పథకం ఏ మేరకు రైతులకు ప్రయోజనం చేకూర్చ గలదన్నది ముఖ్యమైన ప్రశ్న. ఈ వివరాలు చూడండి - దేశంలోని రైతుల్లో సుమారుగా సగం మంది అప్పుల్లో ఉన్నారు. రుణగ్రస్తులైన వారిలో 84 శాతం మంది చిన్న, సన్నకారు రైతులే. వీరిలో 70 శాతం మందికి ఉన్నది ప్రైవేట్ అప్పులే. ప్రస్తుత పథకం ద్వారా ప్రైవేట్ అప్పు చేసినవారికి ఏ విధంగా ప్రయోజనం ఉండదు. రాధాకృష్ణ రిపోర్ట్ ప్రకారం 36 శాతం ప్రైవేట్ అప్పులపై చెల్లించాల్సిన వడ్డీ - ఇరవై నుండి ఇరవై ఐదు శాతం.

38 శాతం అప్పులపై చెల్లించాల్సిన వడ్డీ శాతం 36 శాతం కంటే హెచ్చు. ప్రైవేట్ వడ్డీ వ్యాపారుల నుండి తీసుకొన్న అప్పుల పై వడ్డీని తగ్గించకుండా, అసలుకు సంబంధించి కొంత మేరకైనా రాయితీ కల్పించకుంటే, వ్యవసాయరంగంలోని సంక్షోభ నివారణ సాఫల్యత తక్కువగా ఉంటుంది. ఈ సందర్భంలో గత కొన్ని సంవత్సరాలలో సమకూరిన తిండిగింజల ఉత్పత్తి వివరాలు ఆసక్తిదాయకంగా ఉంటాయి.

| సంవత్సరం | తిండిగింజల ఉత్పత్తి (మిలియన్ టన్నులు) | |
|---|---|---|
| 2003-04 | 213 | |
| 2004-05 | 198 | (-15 మి.ట.) |
| 2005-06 | 209 | (+11 మి.ట.) |
| 2006-07 | 217 | (+18 మి.ట.) |
| 2007-08 | 219 | (+02 మి.ట.) |

అంతేకాదు ఆహారోత్పత్తికి వినియోగించిన స్థూల విస్తీర్ణం 1990-91లో 128 మిలియన్ హెక్టార్లు కాగా, 2006-07లో 123.5 మిలియన్ హెక్టార్లు. వ్యవసాయరంగంపై మరింత శ్రద్ధ చూపాలనే విషయాన్ని పై గణాంకాలు స్పష్టీకరిస్తున్నాయి. మరో విషయం - బడ్జెట్‌లో కేటాయింపులు (ఔట్‌లే అలోకేషన్స్) ముఖ్యంకాదు. ఉత్పత్తి కేటాయింపుల వల్ల సమాజానికి చేకూర్చే ప్రయోజనం పరిణామ ఫలం ముఖ్యమని ఆర్థిక మంత్రిగారు చెబుతూ వచ్చారు. అటువంటి సందర్భంలో ఈ రుణమాఫీ పథకం ద్వారా ఏ మేరకు ఫలితాలు ఆర్థిక పరమైనవిగా ఉంటాయి, ఏ మేరకు రాజకీయ పరమైనవో బేరీజు వేసుకోవాల్సిన అవసరం ఉంది. స్థూల జాతీయోత్పత్తిలో వ్యవసాయ రంగం వాటా 2000-01లో 23.9 శాతం కాగా, 2007-08 నాటికి అంచనా 17.5 శాతం మాత్రమే. 2006 లో రైతుల ఆత్మహత్యల సంఖ్య అసాధారణ మరణాల సంఖ్య - 17,060.

2004 నుండి 2008 వరకు అవిచ్ఛన్నంగా ఐదు బడ్జెట్‌లు ప్రవేశపెట్టిన చిదంబరంగారు, తమ ప్రసంగంలో వారే చెప్పుకొన్నట్లు చాలా అదృష్టవంతులు. వారి అదృష్టం ప్రభుత్వ పన్నుల రాబడి

పెరుగుదలలో కూడా ప్రతిబింబించింది. కేంద్ర ప్రభుత్వానికి పన్నుల ద్వారా లభించిన నికర రాబడి 2006-07లో 3 లక్షల 51 వేల కోట్ల రూపాయలు (దీన్ని 100 అనుకోండి), 2007-08 సవరించిన అంచనాల ప్రకారం ఈ రాబడి 4 లక్షల, 32 వేల కోట్ల రూపాయలు (123 సూచీ సంఖ్య), 2008-09 సంవత్సరానికి ఇది 5 లక్షల, 7 వేల కోట్ల రూపాయలకు పెరుగుతుందని అంచనా (సూచీ సంఖ్య 144).

మరో రకంగా చెప్పుకుంటే స్థూల దేశీయోత్పత్తిలో కేంద్ర ప్రభుత్వ పన్నుల రాబడి శాతం 9.2. ఇది 2007-08 చివరకు 12.5 శాతానికి పెరిగినట్లు అంచనా. అంటే వృద్ధి శాతం 36. కేంద్ర ప్రభుత్వ నికర పన్నుల భారం సగటున ఒక్కో వ్యక్తి పై రోజుకు 2006-07లో రు. 8.58 కాగా 2007-08లో రు. 10.39. పెరుగుదల శాతం ఒక్క సంవత్సరంలో 21 శాతం.

ప్రధానమైన ప్రత్యక్ష పన్నులైన కార్పొరేషన్ పన్ను (33 శాతం), ఆదాయపు పన్నుల (20 శాతం) ద్వారా ప్రభుత్వానికి పన్నుల రాబడిలో 53 శాతం చేకూరగా ప్రధాన పరోక్ష పన్నులైన కేంద్ర ఎక్సైజ్ పన్నుల ద్వారా, కస్టమ్స్ సుంకం ద్వారా (20+17) 37 శాతం రాబడి చేకూరుతున్నది. ఇటీవల బాగా వృద్ధి చెందుతున్న సేవల పన్నుల ద్వారా ప్రభుత్వానికి సుమారు 9.4 శాతం రాబడి ఒనగూరుచున్నది. పన్నుల వ్యవస్థలో ప్రత్యక్ష పన్నుల ప్రాముఖ్యం పెరుగుతున్నదనే వాస్తవాన్ని పై గణాంకాలు స్పష్టీకరిస్తాయి.

2008-09లో ప్రభుత్వం వ్యయం చేయదలచుకొన్న మొత్తం రు. 7,50,884 కోట్లు కాగా, అందులో పాత అప్పులపై వడ్డీ చెల్లింపులు సుమారు రు. 1,90,807 కోట్లు. సబ్సిడీల వ్యయం రు. 71,431 కోట్లు, రక్షణ వ్యయం రు. 1,05,600 కోట్లు, ప్రణాళికా వ్యయం రు. 2,43,386 కోట్లు కాగా (32 శాతం) ప్రణాళికేతర వ్యయం రు. 5,07,498 కోట్లు (68 శాతం).

2008-09 బడ్జెట్‌లో మధ్యతరగతి ప్రజానీకాన్ని బాగా ఆకట్టుకొన్న మరో అంశం, ఆదాయపు పన్ను రేట్లలో / స్లాబులలో మార్పులు.

ఆదాయపు పన్ను మినహాయింపు స్థాయిని రు. 1,50,000 కు పెంచడం వల్ల అంతకంటే తక్కువ ఆదాయం వచ్చేవారు పన్ను చెల్లింపులు పరిధిలోకి రారు. అందువల్ల ఆదాయపు పన్ను చెల్లింపులో ఒనగూరే లాభం రు. 4000. ఇది కనీస స్థాయిలో లాభిస్తుంది. స్త్రీల విషయంలో ఈ మినహాయింపు స్థాయి రు. 1,80,000. సీనియర్ సిటిజన్లకు రు. 2,25,000గా నిర్ణయించారు. అంతేగాక 30 శాతం పన్ను చెల్లింపు ఐదు లక్షల రూపాయల కంటే హెచ్చుగా పొందే ఆదాయ వర్గానికి మాత్రమే వర్తిస్తుంది. ఈ మార్పులన్నీ ఆదాయపు పన్ను చెల్లింపుదార్లకు సంతోషాన్ని, ప్రయోజనాన్ని కలుగచేసేవే. ఈ మార్పులవల్ల ప్రయోజనం పొందే వారి సంఖ్య సుమారు కోటి వరకు ఉండవచ్చని అంచనా. ఐదు లక్షల ఆదాయంపై పన్ను చెల్లించేవారికి చేకూరే లాభం సుమారు రు. 45,000.

ఎక్సైజ్ సుంకాలలోని గరిష్ఠ రేటును 16 నుండి 14కు తగ్గించారు. కేంద్ర ప్రభుత్వం విధించే అమ్మకపు పన్ను రేటును మూడు శాతం నుండి రెండు శాతానికి తగ్గించారు. ప్రత్యక్ష, పరోక్ష పన్నులలోని ఈ మార్పులు పౌరుల వ్యయార్హ ఆదాయాన్ని పెంచుతాయి కాబట్టి, వస్తు సేవలకు డిమాండ్ పెరగవచ్చు లేదా పొదుపు పెరగవచ్చు.

2008-09 సంవత్సరపు బడ్జెట్‌కు మూడు ప్రధాన లక్ష్యాలు ఉన్నట్లుగా ఆర్థికమంత్రిత్వ శాఖ కార్యదర్శి తెలియచేశారు. 1) ఆర్థికాభివృద్ధికి అవసరమైన రంగాలలో సామర్థ్యాన్ని పెంచుకుంటూ - వృద్ధి రేటు గమనాన్ని పరిరక్షించుకోవడం - భారత్ నిర్మాణ్, జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ లాంటి పథకాలకు కేటాయింపులు హెచ్చించడం ద్వారా లక్ష్యసిద్ధికి ప్రయత్నించడం, 2) పన్ను చెల్లింపుదార్ల వ్యయార్హ ఆదాయం పెరిగినప్పటికి, ద్రవ్యోల్బణాన్ని నియంత్రించడం, 3) జాతీయ ఉపాధి హామీ పథకం లాంటి కార్యక్రమాల ద్వారా సాంఘిక సంక్షేమ పరిధిని పెంచడం. పారదర్శకత స్థాయిల్లో పెరుగుదలకు సంకేతంగానే 2008-09 సంవత్సరపు స్థూల దేశీయోత్పత్తి పెరుగుదల (జిడిపి) అంచనాను రు. 53,03,077 కోట్లుగా పేర్కొనడం ఒక ఉదాహరణ. బడ్జెట్‌కు బాహ్యంగా బయట సుమారు రు. 47,500 కోట్ల అప్పులు ఉన్నట్లు కూడా కార్యదర్శి తెలిపారు. ఇది కూడా పారదర్శకత ఉదాహరణగా తెలిపారు.

ద్రవ్యోల్బణాన్ని అరికడతామనే లక్ష్యం చెవులకు ఎంతో ఇంపుగా మంచిగా అనిపిస్తుంది. గత సంవత్సరం సిమెంట్ ధర నియంత్రణ ప్రయత్నం బెడిసి కొట్టింది. కాగా ఈ మార్చ్ నెల 8వ తేదీతో ముగిసిన వారానికి ద్రవ్యోల్బణం రేటు 5.92 శాతానికి పెరిగినట్లు నివేదికలు తెలుపుతున్నాయి. ఇది 11 నెలల గరిష్ఠ స్థాయిగా చెబుతున్నారు. కాబట్టి ద్రవ్యోల్బణ నియంత్రణకు గట్టి కృషి చేయాల్సిన అవసరం ఉంది. సెన్సెక్సులో భారీ పతనం కూడా శుభసంకేతం కాదు.

ఎంతో ప్రతిష్ఠాత్మకంగా తీసుకొన్న పథకం - గ్రామీణ ఉపాధి హామీ పథకం. ఇది, దేశంలోని చాలా రాష్ట్రాలకంటే ఆంధ్రప్రదేశ్‌లో చక్కగా అమలు జరుగుతున్నట్లు ప్రకటనలు వెలువడ్డాయి. ఈ నేపథ్యంలో, ఆంధ్రప్రదేశ్ లో పథకం అమలుకు సంబంధించి ఇంటర్‌నెట్‌లో లభ్యమైన ఈ గణాంకాలు చూడండి. ఈ పథకం ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం 19 జిల్లాలలో అమలులో ఉంది. కాగా ఫిబ్రవరి 2008 నాటికి లభ్యమైన సమాచారం ప్రకారం - సుమారు 82 లక్షల జాబ్ కార్డులు జారీచేశారు. సుమారు రు. 1937 కోట్ల వ్యయం చేశారు. అందులో కూలీలకైనా మొత్తం రు. 1,605 కోట్లు. ఒక్కో ఇంటికి వంద దినాల పనికల్పించాల్సి ఉండగా, ఇవ్వగలిగింది సుమారు 33 రోజులు మాత్రమే (32.92 శాతం). కనీసం 16 లక్షల కుటుంబాలకు 100 దినాల పని కల్పించాలని లక్ష్యంగా పెట్టుకొన్నప్పటికి, చేయగలిగింది ఒకలక్షా 67 వేల కుటుంబాలకు మాత్రమేనని పై గణాంకాలు చూపెడుతాయి. రానున్న ఆర్థిక సంవత్సరంలో ఈ పథకాన్ని దేశంలోని అన్ని జిల్లాలకు విస్తరించవలసి ఉన్న సందర్భంలో దిద్దుబాటు చర్యలు తీసుకోవడం ఎంతైనా అవసరం. నిరుద్యోగిత ఒక భయంకరమైన జాడ్యం. చిరకాలం నిరుద్యోగులుగా ఉన్నందున, నేర్చుకొన్న నైపుణ్యాలు కూడ తుప్పుపట్టిపోతాయి, అడుగంటుతాయి. దైన్యం అసూయ, ద్వేషాలను పెంచుతుంది. అందువల్ల నిరుద్యోగిత కేవలం ఆర్థిక సమస్యగానే చూడక సామాజిక, రాజకీయ సమస్యగా పరిగణించి, పరిష్కారమార్గాలను యుద్ధ ప్రాతిపదికన శుద్ధ మనస్సులైన సిబ్బంది సహాయంతో చేబట్టాలి.

# తిరునగరి రామాంజనేయులు



తెలంగాణ సాయుధ పోరాట యోధుడు, సాంస్కృతిక యోధుడు తిరునగరి రామాంజనేయులు మార్చ్ 13న మరణించారు. ఆయన 1922 లో గుంటూరు జిల్లా, మాచవరం మండలం, ఇన్నెల్లిలో జన్మించారు. తెలంగాణలోని చిలుకూరుకు ఇల్లరికం అల్లుడుగా వచ్చి, ఇక్కడ ప్రజల దుర్భర పరిస్థితులను చూసి సహించలేక కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో సాగిన రైతాంగ పోరాటంలో భాగమయ్యారు. అజ్ఞాత జీవితంలోకి వెళ్లి, తెలంగాణ సాయుధ పోరాటంలో పాల్గొని, మానుకోట ప్రాంతంలో ఉద్యమ నిర్మాణం చేశారు. 1942 లో క్విట్టిండియా ఉద్యమంతో రాజకీయాల్లో ప్రవేశించారు. చిలుకూరు తాలుకాలోని కొంతమంది యువకులతో కలిసి ఆంధ్ర మహాసభను స్థాపించారు. ఆ తరువాత నల్లగొండ జిల్లా వైజ్ఞానిక రంగ నిర్మాణానికై, ఉద్యమవసరాలకై వివిధ రచనలు, కళారూపాలతో వైజ్ఞానిక దళాలను తయారు చేశారు. ఆయన రచనలు – 'వెట్టిచాకిరి', 'వీరకుంకుమ' (నాటికలు), 'వీర తెలంగాణ' (నాటకం), 'తెలంగాణ', 'రాష్ట్ర వాంఛ', 'కొత్తబాట', 'అల్లూరి సీతారామ రాజు' (గొల్ల సుద్దులు), 'తెలంగాణ వీరయోధులు' (బూర్గుల ప్రభుత్వం నిషేధించింది), 'వీరబందగీ', 'కన్నెగంటి హనుమంతు', 'అనాథ', 'పేదరైతు' (బుర్రకథలు), 'వల్లభాయి నెహ్రూ వీధిబాగోతం', 'రైతు బాగోతం' (నృత్యనాటిక), 'కష్టజీవి', 'వీరబందగి' (హరికథలు), 'తెలంగాణ పోరాట గేయాలు' (సంకలనం), 'జ్వలితజ్వాల', 'రగులుతున్న కొలిమి' (గేయసంపుటాలు), 'సంగం' (పోరాటనవల), 'పలనాటి వీరహనుమంతు' (సంగ్రహ చరిత్ర) ఇలా విస్తృతంగా ప్రజా సాహిత్యానికి ఎనలేని సేవచేశారు. కవిగా, కథకుడిగా, నవలాకారుడిగా సుప్రసిద్ధులు. ◆

మానవాభివృద్ధి సూచికలో భారతదేశ ర్యాంకు 128 అనే విషయం తెలిసినదే. అయినా విద్య, వైద్య రంగాలలో మన ప్రగతి ఆశించిన మేరకు లేదు. సహస్రాబ్ది లక్ష్యాలకు మనం ఎంత దూరంలో ఉన్నామో పరిశీలించుకోవాలి. సర్వశిక్ష అభియాన్ కు కేటాయింపు 23 శాతం పెరిగింది. అయినా విద్య, వైద్య రంగాలలో గుణాత్మకంగా, పరిణామాత్మకంగా చేయవలసినది ఎంతో ఉంది. ఈ సంవత్సర ప్రారంభంలో యూనిసెఫ్ విడుదల చేసిన నివేదికలు కనీసం మనకు కనువిప్పు కలిగించాలి. కేటాయింపులో పెరిగిన తత్సబంధిత సేవలను ప్రజలకు అందించడంలో యంత్రాంగ వైఫల్యం గురించి ఆర్థిక మంత్రిగారే ప్రస్తావించారు. పేదరిక శాతం తగ్గింపు ప్రయత్నాలు ఉన్నప్పటికి ఆర్థిక అసమానతలు మరింతగా పెరుగుతున్నాయి. ప్రభుత్వం ద్వారా , ఉదారంగా గ్రాంట్లు, సహానుభూతి, దయ, న్యాయ పాలన, అణగారిన వర్గాలకు చేయూత సత్‌పరిపాలనకు సూచికలని చిదంబరం గారే సెలవిచ్చారు.

ఈ సమీక్ష ముగించే ముందు, తాము సాధించిన విజయాలపై ప్రభుత్వ వివరణను కూడా పరిశీలించాలి. గత మూడు సంవత్సరాలలో ఆర్థిక వృద్ధి రేటు సగటు 8.8. సేవారంగం 10.7 శాతం, పారిశ్రామిక ఉత్పత్తి రంగం 9.4 శాతం చొప్పున పెరగనున్నాయి. వ్యవసాయ రంగానికి పరపతి స్థాయి 2008 మార్చ్ నాటికి 2 లక్షల 40 వేల కోట్లకు పెరగనుంది. సుమారు 11 కోట్ల 40 లక్షల మందికి మధ్యాహ్న భోజన పథకం ద్వారా లబ్ధిచేకూరుతుంది. ప్రతిరోజు 290 జనావాసాలు కొత్తగా మంచి నీటిసౌకర్యం పొందుతున్నాయి. అన్ని కాలాలలోను ఉపయోగపడే రోడ్లు, రోజుకు 17 గ్రామాలకు లభిస్తుంది. 52 గ్రామాలకు కొత్తగా టెలిఫోన్ సౌకర్యం లభిస్తుంది. ప్రతిరోజు కొత్తగా 42 గ్రామాలు విద్యుచ్ఛక్తి సౌకర్యం పొందుతున్నాయి. 4113 గ్రామీణ గృహాలు ప్రతిరోజూ అందుబాటులోకి వస్తున్నాయి.

భారత్, ప్రపంచంలోనే క్షయరోగ రాజధాని కానున్నదన్న భయాలు ఉన్నప్పటికీ, విద్యాపరంగా వెల్లివిరిసిన జ్ఞానసమాజం – నాలెడ్జ్ సొసైటి కానున్నది. చాలామంది పారిశ్రామికవేత్తలు ఈ బడ్జెట్‌ను స్వాగతించారు. వ్యవసాయ రంగంపైన, గ్రామీణ ఆర్థిక వ్యవస్థపైన దృష్టిని కేంద్రీకరించి నందుకు కొంత మంది ప్రశంసించారు. ఇది ఉభయతారకంగా మంచి రాజకీయానికి, ఆర్థిక శాస్త్రానికి ప్రతీక అన్నారు. ప్రగతి పథంలో మనల్ని మరింత ముందుకు తీసుకెడుతుందన్నారు.

పరిశీలించి చూస్తే 2008–09 బడ్జెట్ ఆర్థిక నిబద్ధతకు, కోశపర మైన క్రమశిక్షణకు ప్రతీకగా కనిపించదు. కోశపరమైన క్రమశిక్షణకు అనుగుణమైన మైలురాళ్ల నిర్ణయం 13వ ఫైనాన్స్ కమిషన్‌కు నెట్టారు. భావితరాల ఆర్థిక ప్రయోజనాలకన్నా, ప్రస్తుత పాలకుల రాజకీయ భవిష్యత్ పై హెచ్చుగా దృష్టి సారించారు. కేంద్ర ఆర్థిక మంత్రిగారి అంతరంగాన్ని గుర్తించిన కొన్ని రాష్ట్రాలు అదే పంథాను అవలంబిం చాయి. ఆర్థికపరమైన నియమనిష్ఠలు, రాజకీయ భవితకంటే మిన్న కావు. బడ్జెట్ తాయిలాలు, ఎన్నికలలో ప్రభుత్వ పక్షానికి ఓట్లు తెచ్చిపెట్టే సాధనాలుగా రూపొందాలి. అప్పుడే దీని రాజకీయ సాఫల్యత – నీతులు చెప్పడానికైతే ఆర్థిక సర్వే ఉంది. రాజకీయ మనుగడకైతే ప్రభుత్వ బడ్జెట్ కేటాయింపులే అనిశ్చిత సాధనాలు. పరిమితంగానైనా మాఫీలు తప్పు కాబట్టి, మాఫ్‌కీజియే! తాము కూర్చుని ఉన్న రాజకీయ పట్టుకొమ్మలను ఎవరూ బుద్ధిపూర్వకంగా నరుక్కోరు గదా? అందుకే తన తర్వాతే ప్రళయం అని లూయీ 14 ఆనాడే అన్నాడు. అది రాజకీయమైనదా, లేక ఆర్థికమైనదా లేదా రెండిటి సమ్మిళితమా అనేది కాలమే తెలపాలి. 2008–09 సంవత్సరానికి రు. 6,02,935 కోట్లు రెవెన్యూ రాబడి గల కేంద్ర ప్రభుత్వం, వడ్డీ చెల్లింపులకై రు. 1,90,807 కోట్లు వ్యయం చేస్తూ, సుమారు 60 వేల కోట్ల రూపాయల వ్యవసాయదారుల రుణాల మాఫీ చేయడమే చిత్రం – భళారే విచిత్రం. ◆

**ప్రభుత్వ కేటాయింపులకు వాస్తవంగా ఖర్చు చేస్తున్నదానికి చాలా తేడా ఉంటోందనీ, విద్యా, వైద్య రంగాల పరిస్థితి మరీ దయనీయంగా ఉందనీ అంటున్నారు వి. హనుమంతరావు**

# కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లలో విద్య, వైద్యం

రాష్ట్రంలో రోశయ్య, కేంద్రంలో చిదంబరం విద్యా రంగాన్ని ఆకాశానికెత్తేస్తున్నారు. కానీ విద్యనభ్యసించాల్సిన బాలబాలికలు నేలమీదే ఉండిపోతున్నారు. ప్రాథమిక పాఠశాలల మూసివేత, ఒకటవ తరగతి నుంచి ఆంగ్ల భాషాబోధన, భుక్తికోసం తల్లిదండ్రుల వలసలు తదితర కారణాల వల్ల బాలబాలికలు విద్యావకాశాలకు దూరం అవుతున్నారు. కేంద్ర మంత్రి విద్యారంగానికి కేటాయింపు ప్రస్తుత సంవత్సరం కన్నా రాబోయే ఏడాదికి 20 శాతం ఎక్కువ కేటాయించామని చెబుతుంటే, రాష్ట్రంలో రోశయ్య కేవలం పాఠశాల విద్యకోసమే 40 శాతం కేటాయించామంటున్నారు. వీరి కేటాయింపులేమోగాని మధ్యన విద్యార్థులు నలిగిపోతున్నారు. గుణాత్మకంగా విద్యగుంట పూలు పూస్తోంది. విద్యార్థుల సంఖ్య పెరుగుతోంది, ఉపాధ్యాయుల సంఖ్య పెరగటం లేదు. ఇక్కడ కేటాయింపులకే పరిమితమై రాష్ట్రంలో పరిస్థితిని విశ్లేషించుకొందాం.

ఈ ప్రభుత్వం 2004-05లో అధికారంలోకి వచ్చినపుడు ప్రాథమిక, సెకండరీ, ఉన్నత, కాలేజీ విద్య, వయోజన విద్య, విశ్వవిద్యాలయ విద్య, భాషాభివృద్ధి, సాంకేతిక విద్యలన్నిటికీ రు. 4471 కోట్లు ఖర్చు చేయగా, 2008-09లో రు. 10277 కోట్లు ఖర్చు చేయబోతోంది. కేటాయింపు ఘనంగానే ఉన్నట్లు కనిపిస్తుంది కాని వివరాల్లోకి పోయి చూస్తే గత సంవత్సరం కన్నా నడుస్తున్న సంవత్సరంలో రు. 2532 కోట్లు అదనంగా ఖర్చు చేయగా, ప్రస్తుత సంవత్సరంతో రాబోయే సంవత్సరం కేటాయింపు పోలిస్తే అదనంగా రు. 1889 కోట్లు మాత్రమే ఖర్చు చేయబోతోంది. (చేసిన కేటాయింపును పూర్తిగా ఖర్చు చేస్తే గీస్తే). డ్రాపవుట్లతో కుదేలవుతున్న ప్రాథమిక విద్య కేటాయింపులు చూస్తే అదనంగా చేయబోయేది కేవలం రు. 307 కోట్లు మాత్రమే. పోనీ, గత సంవత్సరాల ప్రణాళికల్లో జనరల్ విద్యకు కేటాయింపులు, ఖర్చులు ఎలా ఉన్నాయో చూడండి.

| సంవత్సరం | కేటాయింపు (కోట్లలో) | ఖర్చు (కోట్లలో) |
|---|---|---|
| 2004-05 | 472 | 444 |
| 2005-06 | 546 | 462 |
| 2006-07 | 486 | 533 |
| **మొత్తం** | **1504** | **1439** |

అసలే అరకొర కేటాయింపులు, అవి కూడా ఖర్చు కాకపోవడం చూస్తే విద్యపై ప్రభుత్వం ఎంత శ్రద్ధ చూపుతుందో అర్థమవుతోంది.

డ్రాపవుట్ల శాతం పాఠశాల విద్యను వెన్నాడుతూనే ఉంది. 2007-08 సామాజికార్థిక సర్వే ప్రకారం 2004-05, 2005-06 రెండేళ్లలో ప్రాథమిక పాఠశాలల్లో చేరే ప్రతి నూరు మంది విద్యార్థుల్లో పదవ తరగతి వచ్చేసరికి 63-64 మంది డ్రాపవుట్ అవుతున్నారు. కాలేజీ స్థాయిలో పది మంది మాత్రమే చేరగలుగుతున్నారు.

పిల్లలు కూడా పనిచేసి నాలుగు డబ్బులు సంపాదిస్తే గాని ఇల్లు గడవని పరిస్థితి, పాఠశాల వాతావరణంలాంటి కారణాల వల్ల ఈ డ్రాపవుట్లు కొనసాగుతున్నాయి.

ఈ సమస్య పరిష్కరించే దిశగా అయిదవ తరగతి వరకు మధ్యాహ్న భోజనం పథకం కేంద్ర ప్రభుత్వం నూరు శాతం ఆర్థిక సాయంతో అమలు చేస్తోంది. 2008-09లో ఈ పథకాన్ని ఆరు, ఏడు తరగతులకు, వచ్చే సంవత్సరంలో పదవ తరగతి వరకు విస్తరిస్తోంది. ఈ పథకం గ్రామసీమల్లో ఎలా అమలు జరుగుతుందో, ఎలాంటి భోజనం పెడుతున్నారో, ఎటువంటి పరిసరాల్లో వంటావార్పు చేస్తున్నారో మీకు తెలియచెప్పటం మనకు తెలియంది కాదు. 2006-07, 2007-08 సంవత్సరాల్లో ఈ పథకం అమలు గురించిన వివరాలివి.

| సంవత్సరం | కేటాయింపు (కోట్లలో) | పిల్లల సంఖ్య (లక్షల్లో) | ఆహారం (కేలరీలు, 8-12 గ్రాముల ప్రోటీన్లు) |
|---|---|---|---|
| 2006-07 | 402.85 | 68 | 300 |
| 2007-08 | 416.18 | 60 | 450 |

కేటాయింపు పెరిగింది, పిల్లల సంఖ్య తగ్గింది. కేలరీలు పెరిగాయి, గ్రామాల్లో పిల్లలకు వడ్డించేటపుడు కేలరీలు కొలత వేసి వడ్డిస్తారా? ఈ కేటాయింపు గురించి ప్రభుత్వం సర్కస్ ఫీట్స్ చేయిస్తోంది. పైన ఉదహరించినట్లు 2007-08లో కేటాయింపు రు. 416.15 కోట్లు అయితే 2008-09లో కేవలం రు. 150 కోట్లు మాత్రమే (పేజి 156, సామాజికార్థిక సర్వే 2008-09) కేటాయించినట్లు ఉండగా అదే సర్వే పుస్తకంలో మరోచోట (పే. 340) రు. 482.64 కోట్లు అని ఉంది. అలాగే ఆర్థిక మంత్రి తన ఉపన్యాసంలో పాఠశాలల విద్యకు రు. 8655 కోట్లు అని చెప్పగా, ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ - ఇన్ - బ్రీఫ్ పుస్తకంలో రు. 8431 కోట్లు అని ఉంది. ఈ సర్కస్ ఫీట్లకు ఆర్థిక

మంత్రి బాధ్యులని అననుగాని, ఆయనకు ఈ గణాంకాలందజేసిన విద్యాశాఖ అధికారులు, ఆర్థికశాఖ అధికారుల నేమనాలి? వాళ్ల శాఖలో విద్యార్థులకు లెక్కలిలాగే చెబుతారా? విద్యా రంగాన్నంతటినీ విశ్లేషించాలంటే ఓ పుస్తకమే రాయవచ్చు. కాగా ప్రధానంగా ప్రాథమిక విద్యకు, దాని కేటాయింపులకు మాత్రమే మనం పరిమితమౌదాం.

## కేంద్రం

విద్యకోసం ప్రస్తుత సంవత్సరంలో రు. 28674 కోట్ల నుంచి రాబోయే ఆర్థిక సంవత్సరంలో రు. 34400 కోట్లకు అంటే 20 శాతం పెంచనున్నామని ఆర్థిక మంత్రి చిదంబరం ఆర్భాటంగా ప్రకటించారు. ఆ రంగంలో సర్వశిక్షా అభియాన్‌కు పెద్దపీట వేస్తూ వచ్చారు. కేటాయింపయితే పెరిగింది కాని, వివిధ పథకాల కింద ఏమి సాధించారోనని 2006-07, 2007-08 ఆర్థిక సర్వేలను దగ్గర పెట్టుకొని చూడటం జరిగింది. పై రెండు సంవత్సరాల్లోనూ సెప్టెంబర్ నెలాఖరు వరకు మాత్రమే గణాంకాలు ఇవ్వబడ్డాయి.

| సర్వశిక్షా అభియాన్ | 2006-07 | 2007-08 |
|---|---|---|
| కొత్త పాఠశాలల ప్రారంభం | 1,64,477 | 1,86,988 (మార్చ్ వరకు) |
| భవనాల నిర్మాణం | 97,999 | 1,70,320 |
| కొత్త పాఠశాల గదుల నిర్మాణం | 2,81,001 | 7,13,179 |
| తాగునీటి సరఫరా ఏర్పాటు | 1,50,202 | 1,72,381 |
| మరుగుదొడ్లు | 1,93,608 | 2,18,075 |
| ఉచిత పాఠ్యపుస్తకాలు (కోట్లు) | 5.78 | 6.64 |
| ఉపాధ్యాయుల నియామకాలు | 6,66,848 | 8,10,000 |
| కేటాయింపు (కోట్లు) | 11,000 | 10,671 |
| ఇంకా పాఠశాలలో చేర్చని పిల్లల సంఖ్య (లక్షలు) | 70.5 | - |

పై పట్టిక కొన్ని లొసుగులను ఎత్తి చూపడాన్ని గమనించవచ్చు. సర్వశిక్షా అభియాన్ ప్రారంభించినప్పుడు 6-14 వయస్సు మధ్య గల 70.5 లక్షల బాలబాలికలందరినీ పాఠశాలల్లో 2005 లోగా చేర్చడం లక్ష్యంగా ప్రకటించింది. 2007-08 ఆర్థిక సర్వే ఈ లక్ష్యాన్ని మార్చేసింది. 2005 బదులు 2010 అని పేర్కొంది. 2006-07లో ఇంకా 70.5 లక్షలు పాఠశాలల బయటనే ఉన్నారని ప్రభుత్వమే అంగీకరించటం దాని ఘోర వైఫల్యాన్ని తెలియజేస్తుంది. ఇది మొదటి వైఫల్యం. పైన ఉదహరించిన రెండు సంవత్సరాల మధ్య కాలంలో అన్ని సూచికలు పెరుగుదల చూపిస్తున్నాయంటే అదనపు ఖర్చు అవుతుంది కాబట్టి, అదనపు కేటాయింపు చేయాలి. కాని విచిత్రంగా కేటాయింపు రు. 11,000 కోట్లు నుంచి రు. 10,671 కోట్లకు తగ్గింది. తగ్గించిన కేటాయింపులతో పెరిగిన లక్ష్యాలను ఎలా సాధిస్తారో చెప్పలేదు. ఇది రెండో వైఫల్యం. కొత్త భవనాల నిర్మాణం ఒక్క సంవత్సరంలో 97,999 నుంచి 1,70,320 కు ఎలా నిర్మించేశారో, అలాగే పాఠశాల గదులు కేవలం 12 నెలల కాలంలో 2,81,001 నుంచి 7,13,179 (సుమారుగా మూడురెట్లు) ఎలా నిర్మాణం పూర్తి చేసారో ఆర్థిక సర్వే రచయితలు చెప్పి ఉంటే బావుండేది. నువ్వు నివాసాల్లో లెక్కలు దొక్కలు ఎక్కువగా ఇస్తావు, చదివేవాళ్లను ఇది ఇబ్బంది పెట్టడమేనని నన్ను దెప్పుతుంటారు. కానీ ఆ అంకెలను అధ్యయనం చేస్తేనే పై లొసుగులు వెలుగుచూసాయి. అలాంటి నేపథ్యంలో మిగతా గణాంకాలను, పెరుగుదలను అనుమానించాల్సి వస్తుంది.

## మధ్యాహ్న భోజనం

2006-07లో 12 కోట్ల బాలబాలికలకు మధ్యాహ్న భోజనం పెడితే, ఆ తర్వాతి సంవత్సరంలో 10,671 కోట్ల మందికే భోజనం పెట్టారు. అయినా కేటాయింపు రు. 5348 కోట్ల నుంచి రు. 7324 కోట్లకు పెంచారు. పోనీ కేలరీలు పెంచారా అంటే అదీలేదు. 94,500 వంట షెడ్ల నిర్మాణం కోసం నిధులు రాష్ట్రాలకు కేటాయించినట్లు 2006-07 ఆర్థిక సర్వేలో చెప్పారు. అయితే 2007-08 సర్వేలో దాని ఊసేలేదు. అలాగే వంట సామాగ్రి కోసం, రిపేర్ల కోసం నిధులు కేటాయింపు గురించి కూడా 2007-08 సర్వేలో సమాచారం నిల్. ఈ పథకం ఎంత సొంపుగా నడుస్తుందో పత్రికల్లో అప్పుడప్పుడు వెలువడుతున్న వార్తలే చెబుతున్నాయి. ఇపుడు ఈ పథకాన్ని బిస్కెట్లు తినిపించే పథకంగా మార్చనున్నట్లు, ఏదో ప్రైవేట్ సంస్థకు ఈ బాధ్యతను అప్పగిస్తున్నట్లు వార్తలు ప్రచారంలో ఉన్నాయి. ఎన్ని బిస్కెట్లు పెడితే చిన్న పిల్లల కడుపులు నిండుతాయి?

పై విశ్లేషణ కేవలం ప్రాథమిక విద్యకు మాత్రమే పరిమితమైంది. మొత్తం విద్యా రంగాన్ని విశ్లేషించాలంటే, ఆ సమాచారం మే నెలలోనే లభిస్తుంది. మొత్తం మీద చూసినపుడు ప్రభుత్వ దృష్టి అంతా ఉన్నత విద్యవైపు మరలిందని, ప్రాథమిక, ఉన్నత పాఠశాలలను నిర్లక్ష్యం చేస్తున్నట్లు స్పష్టంగా కనిపిస్తుంది. ఉదాహరణకు పైన ఉదహరించిన రెండు సర్వేలలోని గణాంకాలను చూస్తే ఉన్నత పాఠశాల స్థాయి వరకూ పాఠశాలల సంఖ్య అవే గణాంకాలు కనిపిస్తున్నాయి. ఉన్నత కాలేజీ విద్య వచ్చేసరికి కాలేజీల సంఖ్య పెరగటం జరిగింది. విశేషమేమంటే పాఠశాలల సంఖ్య అలాగే ఉన్నా విద్యార్థుల సంఖ్య తగ్గిపోయింది. అదొక విషయమైతే, మరొక విషయంలో ఒకే సంవత్సరంలో (2004-05)లో పైనుదహరించిన రెండు సర్వేల్లో రెండు రకాల గణాంకాలు కనిపించాయి. పాఠశాలల్లో చేర్చినవారి స్థూల రేషియో 2004-05 వివిధ తరగతులకు కింది విధంగా ఉంది

| | 1-5వ తరగతి | 6-8వ తరగతి | 1-8వ తరగతి |
|---|---|---|---|
| 2006-07 సర్వే | 108.56 | 70.51 | 94.23 |
| 2007-08 సర్వే | 107.80 | 69.93 | 93.54 |

ఒకే సంవత్సరానికి రెండు సంవత్సరాల సర్వేలు రెండు రకాల అంకెలు ఇవ్వటం ఒకటయితే, 2006-07 సర్వేతో పోలిస్తే 2007-08 సర్వేలో శాతాలు తగ్గాయి. చిదంబరంగారూ, ఇవేమి లెక్కలండి బాబూ, మావి మట్టి బుర్రలు సరే, మీది మట్టి బుర్ర కాదుకదా, ఇదేమిటో మీకైనా అర్థం అవుతుందేమో చెబుతారా?

### రాష్ట్రంలో

వైద్యం, ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం పద్దుకు నడుస్తున్న 2007-08లో ప్రణాళికకు రు. 760 కోట్లు (స.అం.) కేటాయించగా 2008-09లో రు. 1317 కోట్లు కేటాయింపు జరిగింది. ఇది 58 శాతం పెరుగుదల. రెవెన్యూ పద్దు కింద అదే కాలంలో రు. 2429 కోట్ల నుంచి రు. 3126 కోట్లకు పెరిగింది. ప్రణాళికా ఖర్చు + ప్రధానంగా పరిపాలనా వ్యయం = రెవెన్యూ వ్యయం కాబట్టి ప్రణాళికా పద్దు, అంటే అభివృద్ధికి రు. 1317 కోట్లు ఖర్చు చేయడానికి పరిపాలనా వ్యయం రు. 1808 కోట్లు. అంటే ఒక రూపాయి విలువ గల అభివృద్ధికి రు. 1.37 పరిపాలనా ఖర్చు. రెవెన్యూ పద్దు కింద వచ్చే ఏడాది చేయబోయే ఖర్చులో పట్టణాల్లో, నగరాల్లో రు. 1432 కోట్లు, గ్రామీణ ప్రాంతాల్లో రు. 401 కోట్లు ఖర్చు చేయబోతోంది. మరో విధంగా చెప్పాలంటే 70 శాతం నివసించే గ్రామాల్లో రు. 401 కోట్లు, పట్టణాలు, నగరాల్లో రు. 1432 కోట్లు ఖర్చు చేయనుంది. గ్రామ ప్రజలు, వారి ఆరోగ్య, వైద్య అవసరాల పట్ల ఎంత చిన్న చూపు చూస్తుందో అర్థమవుతోంది. ప్రణాళికా ఖర్చు రు. 1317 కోట్లలో ఆసుపత్రి భవనాలు, నిర్మాణం, యంత్ర సామాగ్రి కొనుగోలుకే రు. 764 కోట్లు ఖర్చవుతుంది.

### ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

నేతి బీరకాయలో నెయ్యి ఎంత ఉంటుందో, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో అంత ఆరోగ్యం లభిస్తుందదనేది గ్రామీణులు అనుభవంలో తెలుసుకున్న విషయం. 30 వేల జనాభాకు ఒక ఆరోగ్య కేంద్రం, అంటే 2666 కేంద్రాలుండాల్సి ఉండగా 1546 మాత్రమే ఉన్నాయి. మూడువేల మంది డాక్టర్లుండాల్సి ఉండగా 2007 నాటికి 800 పోస్టులు ఖాళీలున్నాయని ఒక అంచనా. ఈ విషయం గురించి శాసన సభలో ఎన్నిసార్లు ప్రశ్నలడిగినా కొరత ఉందని, పోస్టింగ్ ఇస్తే డాక్టర్లు వెళ్లటం లేదని జవాబు వస్తుంది. విధిగా రెండేళ్ల గ్రామాల్లో పనిచేస్తేనే గాని డాక్టర్ సర్టిఫికెట్ ఇవ్వవద్దని కొన్నేళ్లుగా సూచనలు వస్తున్నా ప్రభుత్వం నిర్ణయం తీసుకునే సాహసం చేయలేకపోతోంది. డాక్టర్ చదివేవాళ్లు ఎక్కువలో ఎక్కువగా సంపన్న వర్గాలనుంచే ఉంటారు. ఆ వర్గాల ప్రయోజనాలు కాపాడే ప్రభుత్వం ఆ పని చేయలేదు. కాగా సమస్య అపరిష్కృతంగానే మిగిలిపోతుంది. ఒక్కో ప్రాథమిక వైద్య కేంద్రానికి కేటాయింపు రు. 90 వేలు. 2006-07లో అన్ని కేంద్రాలకు విడుదల చేసింది రు. 1046 లక్షలు. 2007-08కి కేటాయింపు రు. 392 లక్షలు. ఈ కేంద్రాలంటే ప్రభుత్వానికి ఎంత అలక్ష్యం.

### ఆరోగ్య శ్రీ

ఈ పథకం గురించిన శబ్ద కాలుష్యం జోరుగా ఉంది. గ్రామాల్లో సామాన్య ప్రజలు సరైన పౌర సౌకర్యాలు లేకపోవటం వల్ల కాలుష్య - ఆధారిత జబ్బులు, రోత, దగ్గు, జ్వరాలు ప్రధాన ఆరోగ్య సమస్యలుగా ఉన్నాయి. కానీ గ్రామాల్లో నివసించే నిరుపేదలకు గుండె జబ్బులు, క్యాన్సర్, ఆపరేషన్లు, కెమో-థెరపీ, రేడియో థెరపీ, న్యూరో సర్జరీ లాంటి రోగాలు రావు. కాని అలాంటి రోగాలకే ఆరోగ్య శ్రీ వర్తిస్తుందని, నయా పైసా ఖర్చు లేకుండా అలాంటి అరుదైన రోగాలు నయం చేస్తామని నిర్ణయించటంలో ప్రభుత్వం అసలు ఉద్దేశం వేరే ఉంది. ఈ ఆసుపత్రులు ప్రభుత్వానివి లేదా ప్రైవేట్ ఆసుపత్రులు కావచ్చు. ప్రతీ చికిత్సకు, ఆపరేషన్‌కు ప్రభుత్వమే మూల్యం చెల్లిస్తుంది. రోగ నిర్ధారణ, చికిత్స, ఆహారం, ప్రయాణఖర్చులు - వీటిలో దేనికీ రోగులు చెల్లించాల్సిన అవసరం లేదని, నియమ నిబంధనలు తెలియజేస్తున్నాయి. ఇవన్నీ కాగితానికే పరిమితం. ఆచరణ తద్విరుద్ధం. ఉదాహరణకు శ్రీకాకుళం జిల్లాలో 2846 మందికి చికిత్సలు చేశారు. వీరు విశాఖనుండి విజయవాడ వెళ్లి నిర్దేశించిన ప్రైవేట్ ఆసుపత్రిలో వైద్యం చేయించు కొన్నారు. టెస్టులు, చార్జీలు కింద వేల రూపాయలు రోగుల బంధవులు ఖర్చు చేసారు. కొంతమంది విశాఖ జిల్లాలోని కేర్, సెవెన్ హిల్స్, శ్రీ సూర్య ప్రైవేట్ ఆసుపత్రులకు ఏడున్నర కోట్లు ప్రభుత్వం చెల్లించింది. విశాఖలోని ప్రభుత్వ కింగ్‌జార్జి ఆసుపత్రికి చెల్లించింది 30 లక్షలే. ఈ పథకం పుణ్యమా అంటే ప్రైవేట్ ఆసుపత్రులు కిటికిటలాడుతున్నాయి. ప్రభుత్వాసుపత్రుల్లో ఇరవై వేల రూపాయలతో అయ్యే గుండె ఆపరేషన్‌ను ప్రైవేట్ ఆసుపత్రుల్లో చేయించి లక్షా ఇరవై వేల రూపాయలు చెల్లించింది. కొన్ని సందర్భాల్లో ఆపరేషన్ అయిన తర్వాత తొందరపెట్టి ఇంటికి వెళ్లిపొమ్మన్న, ఇంట్లో సరైన ఆహారం లభించక మరణించిన సందర్భాలున్నాయి. ఇదంతా తెలియజేసేదేమంటే, 1) కార్పొరేట్ ఆసుపత్రులకు దోసిళ్లతో దోచిపెట్టడం, 2) పేరుకు ఉచితమేగాని పేదవాడు చెల్లించుకోలేని చిల్లర ఖర్చులు, 3) ప్రభుత్వాసుపత్రులను ఎండబెట్టడం. కాని ఈ పథకం 'ఆరోగ్యశ్రీ' కాదు, ప్రైవేట్ ఆసుపత్రుల పాలిటి 'ఆరోగ్య సిరి'. పిల్లల గుండె జబ్బులు నయంచేసే పథకం కూడా కార్పొరేట్ ఆస్పత్రుల కల్పతరువుగా మారింది. ఆరోగ్యశ్రీ పథకం పేరుతో 2008-09 వార్షిక ప్రణాళిక ప్రకారం మొదటి మూడు జిల్లాలో రు. 74 కోట్లు, రెండవ విడత అయిదు జిల్లాలో రు. 118 కోట్లు కార్పొరేట్ ఆసుపత్రులకు ధారపోసింది.

### కేంద్రం

ప్రస్తుత సంవత్సరంలో కేటాయింపుకన్నా 15 శాతం పెంచి వచ్చే ఆర్థిక సంవత్సరంలో రు. 16354 కోట్లు కేటాయిస్తున్నట్లు ఆర్థిక మంత్రి చిదంబరం ప్రకటించారు. 'ఆరోగ్య రంగంలో మౌలిక సౌకర్యాలు తగినంతగా లేకపోవటంవల్ల గ్రామీణ ప్రాంతాలకు వైద్య సేవలందించడం లో కొరతలేర్పడ్డాయి' అని 2007-08 కేంద్ర ఆర్థిక సర్వే స్వయంగా అంగీకరించింది. 'పొరుగు దేశాలతో పోల్చి చూస్తే భారతదేశంలో ఆరోగ్య సూచికలు 'అసంతృప్తి'గా ఉన్నాయని సర్వే చెబుతోంది. 1) జీవితకాలం, 2) ప్రతి వెయ్యిమంది శిశువుల్లో అయిదేళ్లు పూర్తికాకుండానే మరణించటం, 3) ప్రతి వెయ్యి మంది శిశువుల్లో పుట్టుకతోనే మరణం, 4) లక్ష మంది పుట్టుక సందర్భంలోనే తల్లి మరణం లాంటి సూచికల విషయంలో చైనా, శ్రీలంకలతో పోలిస్తే భారత దేశం వెనుకబడే ఉందని కూడా సర్వే తెలియచేసింది. 2008-09 బడ్జెట్‌ను ప్రవేశపెడుతూ ఆర్థిక మంత్రి చేసిన ప్రసంగం విని కార్పొరేట్ ఆసుపత్రుల యజమానులు, మందుల తయారీదారులు ఎగిరి గంతువేశారు. కస్టమ్స్ సుంకాలు తగ్గించారు. 2012 నాటికి అదనంగా

ఎనిమిది లక్షల పడకలు ఏర్పాటు కావాల్సిన నేపథ్యంలో ఆసుపత్రుల నిర్మాణానికి గాను ప్రైవేట్ ఆసుపత్రులు ఏర్పాటు చేసేవారికి అయిదేళ్ల పాటు పన్నుహాలిడే. ఒక పక్క ప్రభుత్వ ఆసుపత్రులకు గీసిగీసి కేటాయింపులు చేస్తూ, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను నిర్లక్ష్యం చేస్తూ, రెండోపక్క కార్పొరేట్ ఆసుపత్రులకు ఎర్రతివాచీ పరచటం చూస్తే వైద్య సౌకర్యాలు పేదలకు అందుబాటులో లేకుండా చేయడమే అవుతుంది.

గ్రామీణ ఆరోగ్య గణాంకాలు 2006 పుస్తకంలో గణాంకాలను 2007-08 ఆర్థిక సర్వే ఉదహరిస్తూ "దేశంలో 20,903 ఉప ఆరోగ్య కేంద్రాలు, 4803 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, 2653 కమ్యూనిటీ ఆరోగ్య కేంద్రాల కొరత ఉందని తెలియచేసింది. అంతకుముందు సంవత్సరంలో కన్నా (2005) కొరత పెరిగిందని తెలియచేస్తుంది. ఈ కేంద్రాలన్నీ గ్రామీణ ప్రాంతాల్లోనివేనన్న విషయం గమనించాలి. పోనీ పని చేస్తున్న కేంద్రాలు సరిగా పనిచేస్తున్నాయా అంటే యాభై శాతం కేంద్రాలు అద్దె భవనాల్లో, అపరిశుభ్ర వాతావరణంలో నడుస్తున్నాయని, సిబ్బంది చాలా ఎక్కువగా గైర్‌హాజర్ అవుతున్నారని ఈ నివేదిక తెలియజేసింది. ఇందువల్ల పేదలకు, తమ శక్తికి మించినదైనా ప్రైవేట్ ఆసుపత్రులకు తరలి, అప్పుల పాలవుతున్నారని చెప్పింది. ప్రభుత్వ ఆసుపత్రులున్నా "దేశంలో ఎక్కడా లేనంత ఎక్కువగా తమ స్వంత నిధులనుంచి రోగ నివారణ కోసం ఖర్చు చేయాల్సి వస్తోందని" సర్వే తెలియచేసింది. "యూజర్ ఛార్జీల వసూలు ఈ భారాన్ని మరింత పెంచాయి". ప్రభుత్వం రోగులను ఎంతటి దుస్థితికి, దురవస్థకు నెట్టిందో పై కోటేషన్లు తెలియచేస్తాయి.

జాతీయ గ్రామీణ ఆరోగ్య పథకం ప్రకారం దేశంలోని 22,669 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో ఎనిమిది శాతం కేంద్రాల్లో డాక్టర్లు లేరని, 39 శాతంలో లాబ్ టెక్నీషియన్లు లేరని, 13.7 శాతంలో ఫార్మసిస్ట్‌లు లేరని, కొన్ని కేంద్రాల్లో ఆపరేషన్ థియేటర్లు, పురుడు పోసుకునే గదులు లేవని తెలియచేసింది. కమ్యూనిటీ ఆరోగ్య కేంద్రాల్లో 59.4 శాతం సర్జన్లు, 45 శాతం గైనకాలజిస్టులు, 61.1 శాతం ఫిజిషియన్లు, 53.8 శాతం పిల్లల డాక్టర్ల పోస్టులు ఖాళీగా ఉన్నాయని, 70.2 శాతం స్పెషలిస్టు పోస్టులు కూడా ఖాళీయేనని తెలిపింది. ప్రణాళికా సంఘం గణాంకాల ప్రకారం ఈ కేంద్రాలకు 3910 సర్జన్ల అవసరమని, కాని ప్రభుత్వం 2372 పోస్టులనే అనుమతించగా 972 మందే పనిచేస్తున్నారని చెబుతూ మిగతా కేటగిరీలలో, అంటే ఫిజిషియన్లు, పిల్లల డాక్టర్ల కొరత ఉందని పేర్కొంది. (టైమ్స్ ఆఫ్ ఇండియా) సి.బి.ఐ. మాజి డైరక్టర్ జోగింద్ర సింగ్ ప్రకారం ప్రతిరోజూ వర్ధమాన దేశాల్లో విరోచనాల వల్ల అయిదు వేల మంది పిల్లలు చనిపోతున్నారని, ఈ సంఖ్య ఎయిడ్స్ వ్యాధి వల్ల చనిపోతున్న వారికన్నా అయిదు రేట్లు ఎక్కువని, ఢిల్లీ నగరంలో రు. 400 కోట్ల ఖర్చుతో అరవై వేలమంది పౌర కర్మచారులు పని చేస్తున్నా, ఆ నగరమే ఒక మురికి కూపంగా మారిందని వాపోయారు. ఈ దుస్థితిని మనం తొలగించుకోగలం, అయినా ఈ మురికి కూపంలో నివసించాల్సిందేనా? అని ఆయన ప్రశ్నించారు. 60వ జాతీయ నమూనా సర్వే ప్రకారం గ్రామీణ ప్రాంతాల్లో 28 శాతం మంది రోగులు డబ్బులేక నయం చేయించుకోలేక పోతున్నారు. ఐక్యరాజ్య సమితి ప్రకారం మనదేశంలో 44 శాతం మంది యువతులు మైనారిటీ తీరకముందే వివాహం చేసుకొంటున్నారని, ఆ వయస్సులో గర్భం దాల్చటం జరుగుతోందని, ఆ సందర్భంలో ఏర్పడే సమస్యలవల్ల నిముషానికో మహిళ మరణిస్తోందని తెలియచేసింది. మనది అభివృద్ధి చెందుతున్న దేశమా లేక నరహంతక దేశమా? ◆

బడ్జెట్‌లోని అంకెలను యథాతథంగా నమ్మడం కాక, వాటి స్వభావాన్ని, అంతరార్థాన్ని, బడ్జెట్ వెనుక ఉన్న భావాజాలాన్ని గ్రహించాలనీ, ప్రకటనలకూ ఆచరణకూ మధ్య ఉన్న అంతరాన్ని గత అనుభవాల ద్వారా గుర్తించాలనీ అంటున్నారు **ఎన్. వేణుగోపాల్**

# వరాల వెనుక దాగే దోపిడీ కోరలు

**త**న పాలనాకాలంలోని చివరి ఆర్థిక సంవత్సరానికి గాను, అంటే ఎన్నికలకు దారితీసే సంవత్సరానికి గాను, కాంగ్రెస్ నాయకత్వం లోని యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన బడ్జెట్ మీద గత మూడు వారాలలో అనేక వ్యాఖ్యలూ విశ్లేషణలూ వెలువడ్డాయి. అద్భుతమనీ అసాధారణమనీ ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ వ్యాఖ్యానించగా, జనాకర్షక బడ్జెట్ అనీ, వరాల వాన కురిపించిన బడ్జెట్ అనీ, ఓట్ల నాట్లు వేసిందనీ, ఎన్నో వర్గాలకు మేలు చేకూర్చే ఆలోచనలు చేసిన బడ్జెట్ అనీ మరికొందరు వ్యాఖ్యాతలు అన్నారు. రుణమాఫీ పథకం వల్ల రైతులకు ఏదో దోచిపెట్టడం జరుగుతున్నదని, పారిశ్రామిక, వ్యాపారవర్గాలకు తగినంత ఎక్కువ రాయితీలు కల్పించలేదని, రియల్ ఎస్టేట్, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, ఔషధ పరిశ్రమ, పర్యాటక రంగం వంటి రంగాలకు ఇవ్వవలసినన్ని మినహాయింపులు ఇవ్వలేదని కూడా కొందరు వ్యాఖ్యాతలు విమర్శించారు.

అయితే సమస్య ఏమంటే బడ్జెట్‌కు అనుకూలంగా చేసిన వ్యాఖ్యలలోగాని, ప్రతికూలంగా చేసిన వ్యాఖ్యలలోగాని ఎక్కువభాగం బడ్జెట్‌ను దాని అంకెల నుంచి, అందులోని గంభీరమైన వాగ్దానాలనుంచి, ఆకర్షణీయమైన ప్రకటనల నుంచి చూడడమే కనబడుతుంది గాని, బడ్జెట్ వెనుకనున్న భావజాలాన్ని, బడ్జెట్ల అమలులో గతంలో ఉన్న అనుభవాన్ని, ప్రకటనలకూ, ఆచరణకూ మధ్య ఉండే అంతరాన్ని గుర్తించి చేసిన వ్యాఖ్యలు తక్కువ. ప్రగతిశీల విశ్లేషకులు కూడా బడ్జెట్ వాగ్దానాలనూ, అంకెలనూ యథాతథంగా, పవిత్రమైనవిగా నమ్ముతూ, వాటి స్వభావాన్ని, అంతరార్థాన్ని విస్మరించడం జరుగుతున్నది.

బడ్జెట్‌లో అంకెలు ముఖ్యమైనవే. అంకెలు లేకుండా ఆ పథకాలను, పరిణామాలను గుర్తించడం, లెక్కించడం సాధ్యం కాని మాట నిజమే. కాని ఆ అంకెల మాయలో పడి ఆ అంకెలు అసలు ఎందుకు వచ్చాయో, ఆ అంకెల మూలమేమిటో, పర్యవసానాలేమిటో గుర్తించకపోతే కష్టం.

ప్రతి అంకె వెనుకా మనుషులున్నారు. ప్రతి అంకె కూడ ఒక నిర్దిష్ట అవసరం కోసమే వాడబడుతున్నది. ప్రతి అంకెవల్లా కొందరు మనుషులకు లాభమూ కొందరు మనుషులకు నష్టమూ జరగ బోతున్నాయి. అంకెల వెనుక మనుషుల శ్రమ ఉంది. ఆ శ్రమ సృష్టించే సంపద ఉంది. ఆ మనుషుల అవసరాలు, కోరికలు ఉన్నాయి. సమాజం ఏర్పడి ఉన్న పద్ధతి వల్ల అసంఖ్యాక శ్రమ జీవులకు తమ శ్రమ ఫలితంలో ఏ కొద్ది భాగమో మాత్రమే దక్కుతుండగా, ఏ శ్రమా చేయని అతి కొద్ది మందికి సంపద మొత్తం హక్కు భుక్తమవుతోంది. అందువల్ల అశేష ప్రజానీకపు అవసరాలు, కోరికలు తీరే అవకాశాలు లేకపోగా, అతికొద్దిమందికి అవసరాలు మాత్రమే కాదు, గొంతెమ్మ కోర్కెలు, విలాసాలు కూడా తీరుతున్నాయి. ఆర్థిక వ్యవహారాలలో కనబడే అంకెలన్నీ ఈ పూర్వరంగంలోనే తయారవుతాయి గనుక ప్రతి అంకెకూ సహజంగా ఈ స్వభావం ఉంటుంది. అందువల్ల రాజకీయార్థిక వ్యవస్థ ప్రకటించే ప్రతి అంకెనూ ఈ వాస్తవం నేపథ్యంలో పరిశీలించకపోతే అంకెల మాయాజాలంలో దారితప్పిపోయే అవకాశం ఎక్కువ.

సమాజంలో ఉత్పత్తి అయ్యే సంపదను ఏయే వర్గాల మధ్య ఎట్లా పంపిణీ చేయబోతున్నామనే విధానాన్ని ప్రభుత్వ పక్షాన ప్రకటించే నిర్ణయమే బడ్జెట్. ఏ వర్గాల నుంచి పన్నుల రూపంలో ఎంత వసూలు చేస్తాము, మళ్లీ దాన్ని ఏయేవర్గాల అవసరాల కోసం ఎట్లా వెచ్చిస్తాము అనే నిర్ణయాన్ని ప్రకటించడమే బడ్జెట్. ఆ నిర్ణయాన్ని కొన్ని ఉద్దేశ్యాల రూపంలో కొన్ని అంకెల రూపంలో ప్రకటిస్తారు. బడ్జెట్‌లో ప్రతి అంకెకూ అది ఎవరి ప్రయోజనాలు కాపాడుతుంది, ఎవరి ప్రయోజనాలను దెబ్బ తీస్తుంది అనే స్పష్టమైన అర్థం, లక్ష్యం ఉంటుంది. ప్రతి ఉద్దేశ్య ప్రకటనకూ, ప్రతి వాగ్దానానికీ ఒక అసత్యాన్నో అర్ధసత్యాన్నో చెప్పే వ్యూహం ఉంటుంది.

అయితే మన సమాజంలో అర్థశాస్త్రం పట్ల, ఆర్థిక విషయాలపట్ల తయారయి ఉన్న మాయజాల ప్రభావం వల్ల ఈ ప్రయోజనాలు అంత స్పష్టంగా, చూడగానే అర్థమయ్యేట్టుగా ఉండవు. ఎవరు లాభపడుతున్నారో చెప్పడానికి ప్రయత్నించినంతగా ఎవరు నష్టపోతున్నారో చెప్పడానికి ప్రభుత్వాలు ప్రయత్నించవు. సాధారణంగా శ్రామిక వర్గం లాభపడుతుంది అని చెప్పినప్పుడు కూడా అది ఆ వర్గాన్ని మోసం చేసే అబద్ధంగానే తప్ప వాస్తవంగా ఉండదు.

అందువల్ల బడ్జెట్‌గాని లేదా ఏదయినా ప్రభుత్వ ఆర్థిక వ్యవహారాల ప్రకటనగాని వెలువడగానే ఈ లాభనష్టాలు, ప్రయోజనాలు వివరించి చెప్పడం ప్రజానుకూల ఆర్థికవేత్తల బాధ్యత. 'గత సంవత్సరం ఈ అంకె ఉండింది, ఈ సంవత్సరం ఈ అంకె ఉంది, కనుక ఇంత శాతం పెరుగుదల ఉంది, లేదా ఇంత శాతం తరుగుదల ఉంది' అని చెప్పడానికి కేవలం అంకగణిత సామర్థ్యం చాలు. ఆ అంకగణిత సామర్థ్యం చాల అవసరమే. ప్రభుత్వం ప్రకటించే అంకెల గుట్టువిప్పి, ఆ అంకెల సాయం

తోనే ప్రభుత్వ అబద్ధాల్ని, మోసాల్ని బయటపెట్టడం అవసరమే. కాని ఆ అంకెల దగ్గరే ఆగిపోయి, ఆ అంకెలే పరమ పవిత్రమయినవన్నట్టు, ఆ అంకెల ప్రకటనలో ప్రభుత్వం ఎల్లవేళలా సత్యమే చెపుతున్నట్టు, ప్రభుత్వానికి చిత్తశుద్ధి ఉన్నట్టు భావించడం తగదు.

ప్రభుత్వం ప్రకటించే అంకెలనూ ఉద్దేశ్యాలనూ పరిగణనలోకి తీసుకుంటూనే వాటిని యథాతథంగా నమ్మకుండా అనుమానంతో విశ్లేషించవలసి ఉంటుంది. అంకెలతో పాటుగా వెలువడుతున్న ప్రకటనలు కూడా జాగ్రత్తగా అధ్యయనం చేయవలసి ఉంటుంది. పేదరికం, అవిద్య, అనారోగ్యం, నిరుద్యోగం, గృహవసతి, పారిశుధ్యం, ప్రజారవాణా సౌకర్యాలు అహ్లాదకరమైన వాతావరణం వంటి ప్రజల మౌలిక సమస్యల పరిష్కారానికి బడ్జెట్ ఏ ప్రతిపాదనలు చేస్తున్నదో చూడవలసి ఉంటుంది. సాధారణంగా ప్రభుత్వాలు ఈ అసలు సమస్యలను విస్మరింపజేయడానికి చాల ప్రయత్నాలు చేస్తాయి. లేదా వాటి ప్రాధాన్యతను చాల తగ్గించి చూపుతాయి. పాలకవర్గాల, సంపన్నవర్గాల ప్రయోజనాలు తీర్చే రంగాలనే ప్రజల అత్యవసర సమస్యలుగా ప్రచారంలో పెట్టి ఆ సమస్యలను పరిష్కరించడంలో తలమునకలయి ఉన్నట్టు, ఆ పరిష్కారాలకే చాలా నిధులు వెచ్చించవలసి వస్తున్నట్టు నటిస్తుంటాయి.

ఉదాహరణకు విదేశాల నుంచి రక్షణ 'తీవ్రవాదుల' నుంచి సమాజపు భద్రత పేరుతో నాయకులకు, సంపన్నులకు భద్రతా సౌకర్యాల పెంపు, దేశాన్నంతా కలిపే రహదారులు, విద్యుచ్ఛక్తి, టెలిఫోన్ సౌకర్యాలు, మౌలిక సాధన సంపత్తి కలిపించడం, విదేశీ సరుకుల దిగుమతులు వంటివి దేశం ముందర ఉన్న ప్రధాన సమస్యలన్నట్టు భ్రమింపజేసి ఆ సమస్యల పరిష్కారానికే నిధులను కేటాయించడం ఇటీవల విపరీతంగా పెరిగిపోయింది. ప్రస్తుతం ఆర్థిక మంత్రి చిదంబరం ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో కూడా ఈ ధోరణే కనబడుతుంది. ఈ సమస్యలలో కొన్ని కొంతవరకు నిజమయినవే కూడా కావచ్చు. కాని అవి ప్రధానంగా పాలకవర్గాల సమస్యలేగాని ప్రజల సమస్యలు కావు. వాటి పరిష్కారం వల్ల ప్రజలకు ఎంతో కొంత మేలు జరగవచ్చు గాని ప్రధానమైన ప్రయోజనాలు, లాభాలు పాలకవర్గాలకే కలుగుతాయి.

ఉదాహరణకు దేశంలో కనీసం అరవై కోట్లమందికి ప్రధాన సమస్యలుగా ఉన్న పేదరికం, అనారోగ్యం, అవిద్య, నిరుద్యోగం బడ్జెట్‌లో ఎంత స్థానం పొందాయో అంతకు కనీసం పదిరెట్లు ఎక్కువగా రక్షణ రంగం, నాయకుల భద్రతా ఏర్పాట్లు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ వంటి రంగాలు ఆక్రమించాయి. ఈ సారి బడ్జెట్‌లో రైతుల రుణమాఫీ, రుణ రాయితీల కోసం అరవై వేల కోట్ల రూపాయల కేటాయించారను కున్నా (నిజానికి అవి కేటాయింపులు కూడా కావు, ప్రభుత్వ, సంయుక్త, సహకార రంగంలోని ద్రవ్య సంస్థలకు రావలసిన బకాయిలను కొట్టివేయడమే తప్ప కొత్తగా నిధులు వెచ్చించడము కాదు), ఇది నిజంగా నిధులు కేటాయించిన రక్షణ వ్యయం కన్న నలభై వేల కోట్ల రూపాయలు తక్కువే.

ఇలా బడ్జెట్ ప్రకటనల అంతరార్థాన్ని, వాటికి ఉండే మరో ముఖాన్ని కూడా అర్థం చేసుకున్నప్పుడే బడ్జెట్ ఎవరి కోసం తయారవు తుందో, ఎవరికి మేలు చేకూరుస్తుందో, ఎవరిని మోసం చేస్తుందో పూర్తిగా అర్థమవుతుంది. అంటే బడ్జెట్‌ను కేవలం అంకెల, పవిత్ర కోరికల సమాహారంగా మాత్రమే కాక, ఒక భావజాలపు వ్యక్తీకరణగా, వర్గ సమాజంలో ఒక వర్గపు ప్రయోజనాలు నెరవేర్చే, మరొక వర్గాన్ని మాయ చేయడానికి ఉపయోగించే వ్యూహంగా అర్థం చేసుకున్నప్పుడే దాని అసలు స్వభావాన్ని విశ్లేషించడం సాధ్యమవుతుంది.

నిజానికి బడ్జెట్‌ను వర్గ దృష్టితో, భావజాలపరంగా అర్థం చేసుకోక పోయినప్పటికీ, మామూలు దృష్టి నుంచి చూసి వేరువేరు సంవత్సరాల బడ్జెట్‌లను పోల్చి చూసినా, బడ్జెట్‌ల వల్ల ఆర్థిక వ్యవస్థలో నిజంగా శ్రమిస్తున్న వర్గాలకు ఏమీ దక్కలేదని, శ్రామికులకు దక్కినది దోపిడీ పీడనలు మాత్రమేనని, ప్రభుత్వాలు చేసినదల్లా శ్రామికుల పేరుమీద దోపిడీ వర్గాలకు దోచిపెట్టడమేనని అర్థమవుతుంది. ఒకవేళ ఏదో ఒక సంవత్సరంలో నిజంగా శ్రామిక, పేద, మధ్యతరగతి వర్గాలకు ఏదో మేలు జరగడానికి ప్రయత్నం జరిగిందని అనిపించినా ఆ ప్రయత్నం కొనసాగలేదని, అది కేవలం ప్రదర్శన వస్తువుగా చూపడానికి మాత్రమే జరిగిందని, ఒక సంవత్సరం బడ్జెట్‌లో ప్రకటించిన కేటాయింపులను మరుసటి సంవత్సరం బడ్జెట్‌తో పోల్చి చూస్తే పూర్తిగా ఖర్చు పెట్టడం జరగలేదని సులభంగా చూడవచ్చు.

అంటే అసలు బడ్జెట్‌ను చూసే దృష్టిలోనే ప్రస్తుతం ఉన్నదానికన్న ఎక్కువ నిశిత దృష్టి అవసరమయిన స్థితిలో మనం ఉన్నాం. ముఖ్యంగా ప్రపంచీకరణ తర్వాత ప్రభుత్వాలు, పాలకవర్గాలు రోజురోజుకూ సంక్లిష్టమైన పదజాలంవాడుతూ ఆర్థిక వ్యవహారాలను మరింతగా మాయగా మారుస్తున్న తరుణంలో ఈ మాయను విప్పి చెప్పేందుకు బడ్జెట్ విశ్లేషణను ఒక సాధనంగా వాడుకోవలసి ఉంది. ◆

**వచ్చే సంచికలలో...**

- ఫోకస్ - మే 2008 : ప్రపంచీకరణ సందర్భంలో కార్మికోద్యమాల పాత్ర
- ఫోకస్ - జూన్ 2008 : ప్రత్యేక ఆర్థిక మండలాలు
- బహు'జను'ల బాంధవుడు - కాన్షీరాం - బి.వీరయ్య, బి. రాజేష్
- ప్రపంచీకరణ - ఉన్నత విద్య - వి. సుబ్రహ్మణ్యం
- అక్షరాస్యత - కొడవటిగంటి రోహిణీప్రసాద్

మాటలను పలకడం, రాయడం అనేవి వేరువేరని ఈనాడు ఎవరూ భావించరు గాని ఇది కొన్ని శతాబ్దాల తరబడి జరిగిన పరిణామాల ఫలితమే అని అంటున్నారు **కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# మౌఖిక సాహిత్యం, లిపుల ఆవిర్భావం

**జా**నపద సాహిత్యంగానూ, నోటిపాటల రూపంలోనూ వేల ఏళ్లుగా ప్రజలలో తరతరాలుగా ప్రాచుర్యంలో ఉన్న అలిఖిత సంప్రదాయం ఆధునిక నాగరికతకు పూర్వపు సంస్కృతిలోని ఒక ముఖ్యమైన అంశం. దీని ప్రభావం ఆ వెనకగా వచ్చిన ప్రాచీన గ్రంథాలలో కనిపిస్తుంది. మన దేశంలో వేదాలూ, ఉపనిషత్తులూ, పురాణాలూ, బౌద్ధమత రచనలూ, ప్రాచీన కాలపు గ్రీస్, యూరప్‌లోని ఇతర దేశాల సాహిత్యమూ, మెక్సికో మతాచారాలూ, చైనా న్యాయ శాస్త్రమూ, వేల ఏళ్లనాటి ఈజిప్ట్ ఆధ్యాత్మికవాదమూ అన్నీ ఒకనాటి మౌఖిక సంప్రదాయాల మీద ఆధారపడినవే. మన ప్రాచీనులకు అక్షరాస్యతకన్నా జ్ఞానమే ముఖ్యం. ప్రసిద్ధ వైయాకరణుడైన పాణినికి అక్షరజ్ఞానం ఉండేది కాదని కొందరంటారు. తమ జ్ఞానాన్ని లిపిబద్ధం చెయ్యడం అవసరమని చాలామంది అనుకోలేదు. జ్ఞాపకశక్తికీ, కంఠస్థం చెయ్యడానికీ ఎక్కువ ప్రాధాన్యతనిచ్చేవారు. సులువుగా గుర్తుండడానికి విషయాలను శ్లోకాలుగానూ, గీతాలుగానూ నేర్పేవారు. రచనాపద్ధతులు వ్యాప్తిలోకి వచ్చాక కూడా, అరుదుగా, ఏ రాజవంశాల చరిత్రనో శాసనాలుగా చెక్కడానికో లిపిని వాడేవారు.

వివిధ దేశాల ఆధ్యాత్మిక, తాత్విక విషయాలను లిపిబద్ధం చెయ్యడం అపరాధంగా భావించబడేది. నాగరికత అభివృద్ధి అయిన తరవాత కూడా కొందరు ప్రాచీనులు తమకు లభించిన మౌఖిక వారసత్వాన్ని లిఖితరూపంలో నమోదు చెయ్యరాదని అనుకునేవారు. అక్షరాలు కనిపెట్టాక కూడా అవి నేర్చుకోవడం హానికరమనే అభిప్రాయం ఉండేది. ప్రజలు అక్షరాలను మాత్రమే గుర్తుంచుకుని అవి నేర్పుతున్న విషయాలను మరిచిపోగలరన్న హెచ్చరిక ప్రాచీన ఈజిప్ట్ మత సంప్రదాయంలో కనబడుతుంది. ప్రసిద్ధ గ్రీక్ తత్వవేత్త ప్లేటో కూడా చర్చకే ప్రాధాన్యతనిస్తూ చదవడం, రాయడం పరిమితమైన ప్రయోజనాన్ని స్తాయనీ, జ్ఞాపకశక్తిని నశింపజేస్తాయనీ అన్నాడు. వ్యక్తిగత చర్చలో సందేహాలను నివృత్తి చేసుకోవచ్చు. సత్యాన్వేషణ కావించే ప్రవృత్తికి మనసు మీదనే ఆధారపడాలి కాని పుస్తకాల మీదకాదు.

లిఖిత సాహిత్యాన్ని నిరాకరించినవారిలో కెల్ట్ జాతులుండేవి. క్రీస్తు శక ప్రారంభంలో ఐర్లండ్ మొదలైన ప్రాంతాల్లో నివసించిన కెల్ట్ జాతుల్లో 'పండిత' వర్గానికి డ్రూయిడ్‌లనే పేరుండేది. ప్రాచీన అగ్నిదేవతలనూ, ఇతర వేల్పులనూ ఆరాధించే ఈ డ్రూయిడ్‌లు తమ తెగలకు సంబంధించిన పూజలూ, తంతులూ నిర్వహిస్తూ, ప్రాచీన సంప్రదాయాలనూ, గాథలనూ, పాటలనూ ఎరిగినవారై ఉండేవారు. ఇవన్నీ తరతరాలుగా ఎన్నో శతాబ్దాలుగా వారికి వారసత్వం రూపంలో అంది వస్తూ ఉండేవి. వీరిలో కొందరికి ద్రష్టలుగానూ, జ్ఞానులూ, ప్రవక్తలూ, పూజారులుగానూ, గారడీ విద్యలు తెలిసినవారుగానూ గుర్తింపు ఉండేది. ఇదంతా ఆటవిక లక్షణాలతో కూడుకుని ఉండేది. తరవాత యుగాల్లో రూపొందిన మతాలకు ఇదొక పూర్వదశ.

గమనించవలసిన దేమిటంటే ఈ ఆటవిక పూజారులకు ఉండిన ప్రత్యేకతల్లో గాథలను పాడి వినిపించగలిగిన నైపుణ్యం ముఖ్యమైనది. మెక్సికో, దక్షిణ అమెరికాలతో సహా ప్రపంచ నాగరికతలన్నిటిలోనూ ఊరూరా తిరుగుతూ, కథలూ, గాథలూ పాడి వినిపిస్తూ తిరిగే ప్రవక్తలూ జానపద గాయకులు ఉండేవారు. తమ తమ జాతుల సంప్రదాయాలనూ, రాజవంశాల చరిత్రనూ ఏకరువుపెడుతూ జాతిలో సమైక్యతనూ, సంఘీభావాన్నీ కలిగించేవారు. లిఖిత సాహిత్యమూ, అక్షరాస్యతాలేని సామాన్యులకు జ్ఞాన, విజ్ఞానమంతా ఈ రూపంలోనే అందుతూ ఉండేది. కెల్ట్‌జాతి ప్రజలు ఇంగ్లండ్‌లోని వేల్స్ ప్రాంతంలోనూ, స్కాట్లండ్, ఫ్రాన్స్, స్విట్జర్లండ్, స్పెయిన్, టర్కీ వంటి ప్రదేశాల్లోనూ ఉండేవారు. ఫ్రాన్స్‌ను లోబరుచుకున్న రోమన్ సామ్రాజ్యం అక్కడి ప్రాచీన మతసంప్రదాయాలని తుడిచిపెట్టి తమ దేవతలకు స్థానం కల్పించింది. అటువంటి ప్రాంతాల్లో ఆ తరవాత క్రైస్తవ మతం ప్రవేశించింది. ఐర్లండ్‌లో మాత్రం క్రైస్తవ సంప్రదాయం నెలకొనే దాకా డ్రూయిడ్‌ల పెత్తనమే కొనసాగింది. వారి అలిఖిత గాథల గురించిన వివరాలన్నీ క్రైస్తవ రచనల ద్వారానే మనకు లభిస్తున్నాయి.

పురాణం చెప్పే పంతులైనా, సోదెమ్మలైనా, బుడబుక్కల వాళ్లైనా ఒకరు చెప్పడం, తక్కినవారు వినడం ప్రధానంగా ఉండేది. గౌతమ బుద్ధుడివంటి ప్రవక్తలు కూడా రచనలకన్నా తమ బోధనలకే ప్రాధాన్యతనిచ్చారు. మన ప్రాచీన విద్యల్లో వ్యాకరణ నియమాల నుంచి ప్రతిదీ సులువుగా గుర్తుండే సూత్రపద్ధతి ద్వారా నేర్పబడేది. మన సంప్రదాయాల్లో ఇటువంటివి నేర్పడంలోనూ, నేర్చుకోవడంలోనూ ఎంత శ్రద్ధ వహించేవారంటే వేదపఠన పద్ధతి వగైరాల్లో ఉత్తర భారతదేశానికీ, దక్షిణాదికీ తేడాలుండవు. అలాగే బౌద్ధమత విషయాల్లో వివిధ దేశాలవారు ఒకే పఠనపద్ధతిని పాటిస్తారు. ఆధునికులు నమ్మకపోవచ్చు గాని వీటిని తు.చ. తప్పకుండా అప్పచెప్పకపోతే మహాపాపమని తలిచేవారు. కనకనే ఇవన్నీ వేల సంవత్సరాలు గడిచినా నిర్దుష్టంగా కొనసాగుతున్న సంప్రదాయాలు.

వర్ణ విచక్షణ కారణంగా వలస పాలకులు ఆఫ్రికా అంతటినీ అనాగరికమైన చీకటి ఖండంగా అభివర్ణించారు. కాని అది నిజం కాదు. అక్కడ విలసిల్లిన ఎన్నో ప్రాచీన నాగరికతలన్నీ సాక్ష్యాలు మిగలకుండా రూపుమాసిపోయాయి. అక్కడి అలిఖిత సంప్రదాయాలను కొనసాగించే గ్రియోట్ గాయకులు ఎన్నో శతాబ్దాల చరిత్రనూ, గ్రామాల స్థల పురాణాలనూ, వంశాల చరిత్రనూ కంఠతాపట్టి చెపుతూ ఉంటారు. పశ్చిమాఫ్రికా మొదలైన ప్రాంతాల్లో అనుకున్న దానికన్నా వెయ్యేళ్లు ప్రాచీనమైన చరిత్ర ఉన్నట్టుగా సాక్ష్యాలు లభిస్తున్నాయి. లిఖిత సాహిత్యం మొదలైన కాలానికి అప్పటిదాకా ఉన్న శ్రుత సంప్రదాయమే ప్రాచీన విషయాలకు ఏకైక ఆధారంగా ఉండేది. సమాజం మారుతున్న కొద్దీ గత కాలపు వివరాలకు మార్పులూ, చేర్పులూ జరగకుండా, పొరబాట్లు దొర్లకుండా, వ్యక్తుల మీద ఆధారపడకుండా వాటిని నిర్దుష్టంగా ఎక్కడో అక్కడ నమోదు చెయ్యడం అవసరమని అనిపించింది. అప్పటి నుంచీ పవిత్ర గ్రంథాల రచనలు ప్రపంచమంతటా మొదలయాయి.

అతి ప్రాచీన కాలంలో పాలస్తీనాలోనూ, బేబిలోన్ ప్రాంతం లోనూ అలిఖితాలుగా ప్రాచుర్యంలో ఉండిన జుదాయిజమ్ సూత్రాలను క్రీ.శ. మూడో శతాబ్దంలో యూదు మతబోధకులు గ్రంథస్తం చేశారు. ఆధునిక పరిశోధనల్లో వివిధ ప్రాంతాలలో చెల్లాచెదురుగా జీవిస్తున్న యూదుమతస్థుల సంప్రదాయాలను సేకరించే ప్రయత్నాలు మొదలయాయి. మరుగున పడిపోతున్న హీబ్రూ భాషలోని పదాల ఉచ్చారణా, పాత ఆచారాలూ, అన్నిటినీ పరిరక్షించేందుకు ఏర్పాట్లు జరిగాయి. లిపి ఆవిర్భావానికీ, పుస్తకాల తయారీకీ కొంత సాంకేతిక ప్రగతి అవసరం కావడం వల్లనే బైబిల్, కురాన్, జెండ్ అవెస్తా మొదలైన తొలి మత గ్రంథాలన్నిటికీ అంతులేని విలువా, వాటి పట్ల ఎనలేని భక్తీ ఉండేవి. ఎందుకంటే అప్పట్లో అవి గ్రంథరూపంలో వెలిసిన విజ్ఞాన సర్వస్వాలు.

ఈ రోజుల్లో చాలామందికి పుస్తకాలు చదివే అలవాటు తప్పడం, చదవనేర్చినవారు కూడా టివి ముందు గుడ్లప్పగించి కూర్చోవడం జరుగుతోంది. ఈ ఆధునిక 'నిరక్షరాస్యత' కారణంగా మళ్లీ మౌఖిక, దృశ్య, శ్రవణ సంప్రదాయాలకు ప్రాముఖ్యత పెరిగినట్టుగా అనిపిస్తోంది. కాని ఈ యుగంలో సమాచారం, విజ్ఞానం, పనికిరాని చెత్తా అంతా పర్వతాల ప్రమాణానికి పెరిగి కంప్యూటర్లూ, ఇంటర్నెట్ వగైరా అనేక మాధ్యమాలద్వారా లభ్యం అవుతోంది. పుస్తకాల మాట ఎలా ఉన్నా సమాచారం, సంపర్కం లేకుండా మానవ సమాజాలకు ఆనాడైనా, ఈనాడైనా జరగదు.

లిపుల వ్యాప్తి మొదలయాక పరిస్థితులు క్రమంగా మారుతూ వచ్చాయి. ప్రపంచంలోని ఆధునిక లిపులలో ఎన్నో రకాలు కనిపిస్తాయి. ఇంగ్లిష్‌వంటి భాషల్లో హల్లులకూ, అచ్చులకూ వేరువేరు అక్షరాలుంటాయి. ఏ మాట రాయాలన్నా 26 అక్షరాలలో అవసరమైనవాటిని పక్కపక్కనే రాస్తూపోవాలి. అచ్చులేని హల్లులను క్,గ్ వగైరాలుగా ఉచ్చరించాలి. ప్రతి అక్షరాన్నీ ఉచ్చరించడానికి అచ్చులు కావాలి. తెలుగువంటి భారతీయ లిపుల్లో ఉచ్చరించగలిగిన సిలబ్‌ల్ అక్షరాలు రాయవచ్చు. అక్షరం స్వరూపం మారదు కాని గుణింతాలు మారుతూ ఉంటాయి. ఈజిప్ట్ వంటి కొన్ని ప్రదేశాల ప్రాచీన భాషల్లో అచ్చులు వాడేవారు కాదు. అన్నీ హల్లులే. సందర్భాన్ని బట్టి పదాలను ఉచ్చరించాలి. ఆ ఛాయలు కొన్ని ముస్లిం పేర్లలో ఇప్పటికీ కనిపిస్తాయి. మహ్మద్, మహమద్, మహమ్మద్, ముహమ్మద్, మొహమ్మద్, మెహమూద్ ఇలాంటివన్నీ కొద్ది వ్యత్యాసాలతో పలుకుతారు. చైనా, జపాన్ మొదలైన భాషలన్నీ రేఖామాత్రంగా కనిపించే బొమ్మలవంటివిగా మొదలయాయి. కనబడుతున్న వస్తువులను వర్ణించడానికి చిత్రలిపిని వాడడం సులువు. కుక్క అనే పదాన్ని సూచించడానికి చిన్న కుక్క బొమ్మను గీయవచ్చు. చదివేవారు దాన్ని చూడగానే కుక్క అనో, తమ భాషలో ఆ అర్థాన్ని సూచించే మరొక మాటనో ఉచ్చరిస్తారు. మరొ పద్ధతిలో ఒక పదంలో వినబడే అక్షరాలను బట్టి వాటికి ప్రతీకలైన బొమ్మలను గీసుకోవడం వీలు. ఉదాహరణకు వడగళ్లు అనే మాట రాయడానికి ఒక గారె బొమ్మనూ, దాని పక్కనే కాసిని గళ్లనూ గీసే పద్ధతి పెట్టుకోవచ్చు. ఈ బొమ్మలకూ, వడగళ్లకూ సంబంధం లేకపోయినా వడనూ, గళ్లనూ గుర్తించినవారు ఆ పదాలను కలిపి చదువుకోగలుగుతారు. కొన్ని లిపులు ఈ పద్ధతిలో రూపొందాయి. ఇవన్నీ వివిధ ప్రాంతాల్లో వివిధ రీతుల్లో పరిణామం చెందాయి.

ఈనాటి భాషల్లో ఎడమనుంచి కుడివైపుకు రాసేవే ఎక్కువగా కనబడతాయి కాని ఉర్దూ, అరబిక్ వంటివన్నీ వ్యతిరేక దిశలో సాగుతాయి. తూర్పు దేశాల్లో నిలువుగా రాసే సంప్రదాయం కూడా ఉండేది. దీనికీ, ప్రాచీనులు తొలి యుగాల్లో చేసిన ప్రస్థానాలకూ సంబంధం ఉందని కొందరంటారు. మొదట నమోదు చేసిన వివరాల్లో ప్రతిరోజూ సూర్యబింబం స్థానాన్ని సూచించేవారని ఈ ప్రతిపాదన చెపుతుంది. మన దేశంలో ఎక్కువ మంది దక్షిణంగా ప్రయాణించారు కనుక సూర్యబింబం స్థానాన్ని మొదటగా ఎడమ కొసలో గీయవలసి వస్తుంది. ఆ తరవాత రోజు గడిచిన కొద్దీ కుడి వైపుకు రాస్తూపోవాలి. మధ్య ఆసియాలో ప్రజలు ఉత్తరంగా వెళ్లారనీ, చైనా మొదలైన ప్రాంతాల్లో పడమటి దిక్కుగా ప్రయాణించారనీ, ఆ కారణంగా అక్షరాలు రాసే పద్ధతి రూపొందిందనీ అంటారు. ఆదిమయుగాల్లో సూర్యుడిని ఆరాధించే వారు కనక ఇది నిజమేనేమో.

మరొక సిద్ధాంతం ఈజిప్ట్‌లోని పెపైరస్ కాగితాల మీద ఆధార పడినది. నైల్ నది ప్రాంతంలో విరివిగా పెరిగే రెల్లుగడ్డి వంటి పెపైరస్‌ను కాగితాల తయారీకి వాడేవారు. ఇది ఎండాక చుట్టచుట్టుకుని ఉండేది. కుడిచేత్తో రాసేటప్పుడు దీన్ని ఎడమచేత్తో తెరుస్తూ పోవాలి. ఇలా చెయ్యాలంటే కుడి నుంచి ఎడమకు రాస్తూపోవడమే వీలుగా ఉంటుంది. ఈ పరిస్థితులన్నిటిలోనూ నిజంగా ఏం జరిగిందో ఊహించాలే కాని కచ్చితంగా చెప్పడం వీలవదు.

లిపుల్లో అన్నిటికన్నా ప్రాచీనమైన క్రీ.పూ. 3000 ప్రాంతాల సుమేరియా, ఈజిప్ట్ నాగరికతల్లో ఆరంభమైనట్టుగా తెలుస్తోంది. మెసపొటోమియాలో ఎన్నో శతాబ్దాలుగా గొర్రెల, మేకల పెంపకానికీ, వ్యవసాయానికీ సంబంధించిన లెక్కల కోసమని ఆవంలో కాల్చిన మట్టిబిళ్లలు వాడేవారట. ఇవి అనేక ఆకారాల్లో తయారయేవి కనక ఇచ్చిపుచ్చుకోవడాలు జరిగినప్పుడు గుర్తుంచుకోవడం వీలయేది. ఆ తరవాత బంకమట్టి మెత్తగా ఉన్నప్పుడు బిళ్లలమీద పుల్లతో గుర్తులు

# హేమలతా లవణం



ప్రముఖ సంఘసేవకురాలు, ఉద్యమ కర్త డా. హేమలతా లవణం మార్చ్ 19న విజయవాడలోని నాస్తిక కేంద్రం లో మరణించారు. ఆమె వయసు 75 సంవత్సరాలు. హేమలత ప్రముఖ రచయిత గుర్రం జాషువ కుమార్తె, ప్రఖ్యాత నాస్తికవాది గోరా కోడలు. హేమలత 1932లో ఫిబ్రవరి 26న గుంటూరు జిల్లా వినుకొండలో గుర్రం జాషువా, మొరాయమ్మ దంపతులకు జన్మించారు. తండ్రితో పాటు తిరిగిన హేమలతకు మనుషుల వేదనలు, అవమానాలు, సంఘర్షణల పట్ల బలమైన అభిప్రాయాలు ఏర్పడ్డాయి. ఆమెలో అప్పుడే సంస్కరణోద్యమ బీజాలు పడ్డాయి. ప్రాథమిక విద్య అనంతరం మద్రాస్ క్వీన్ మేరీస్ కాలేజీలో బి.ఎ. చదివారు. గోరా కుమారుడు లవణంతో వివాహం జరిగింది. బాణమతి, జోగినీ వంటి సామాజిక దురాచారాలు, ఇతర మూఢనమ్మకాలపై పోరాడారు. జోగినీలకు పునరావాసం, విద్యకోసం 'చెల్లి నిలయం' స్థాపించారు. తండ్రి జాషువా గురించి ఆమె 'మా నాన్నగారు' పేరుతో ఒక పుస్తకాన్ని రాశారు. ఆ పుస్తకాన్ని పలుమార్లు పునర్ముద్రించారు. నిజామాబాద్ జిల్లాలోని వర్నిలో ఆమె 'సంస్కార్' అనే ఆశ్రమం స్థాపించి విద్యాసంస్కృతుల వ్యాప్తికి కొత్తబాటలు వేశారు. 1977 దివిసీమ ఉప్పెనలో బాధితులకు పునరావాస సేవలు అందించారు. 1979లో ప్రకాశం, నెల్లూరు, 1996 తూర్పు గోదావరి జిల్లాల్లో తుఫాను విపత్తు సమయంలో సేవా కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 'అహింసామూర్తుల అమరగాథ', 'జీవనసాగరం', 'అనుభవతరంగాలు', 'నేరస్తుల సంస్కరణ', 'జీవన ప్రభాతం', 'తాయెత్తులు గమ్మత్తులు' మొదలైన రచనలు చేశారు. ఆమె సంఘసేవికగా చేసిన కృషికి, రచనలకు తెలుగు విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్, తానా అచీవ్‌మెంట్, వరల్డ్ అచీవ్‌మెంట్ అవార్డులు అందుకున్నారు. అంబేద్కర్ శతజయంతి సందర్భంగా 'భీమరత్న' అవార్డును పొందిన ఏకైక మహిళ హేమలత. ◆

గీసుకోవడం మొదలైంది. కాల్చిన తరవాత ఈ గుర్తులు ఎన్నేళ్లైనా చెరిగిపోకుండా ఉండేవి. ములుగర్రతో గీసిన ఈ రచనా పద్ధతిని కీల లిపి (క్యూనీఫాం) అంటారు. రాయవలసిన సమాచారం పెరిగిన దశలో దీన్ని పై నుంచి ఎడమవైపున మొదలుపెట్టి కుడి వైపున పంక్తులుగా రాసేవారు. ఈనాటి మనవంటి లిపులన్నిటినీ ఇదే పద్ధతిలో రాసి, చదువుతాం. తమ అవసరాల కారణంగా అప్పటివారు రాసే పరికరాలూ, పద్ధతులూ అన్నీ స్వతంత్రంగా సృష్టించుకోవలసి వచ్చింది. లిపికై ఎన్నో శతాబ్దాల తరబడి జరిగిన ప్రయత్నాలు ఇటువంటివే.

ఈ కాలంలోనే ఈజిప్ట్‌లో మొదలైన రాత పద్ధతుల్లో ఏడెనిమిది వందల రకాల గుర్తులుండేవి. దాదాపు మూడున్నర వేల ఏళ్లపాటు కొనసాగిన ఈ లిపికి లెక్కలేనన్ని నమూనాలు చరిత్రకారులకు లభించాయి. కుడినుంచి ఎడమకు సాగే ఈ రాతలో అన్నీ బొమ్మలవంటి గుర్తులే. వీటిలో కొన్ని గుర్తులు శబ్దాలకూ, మరికొన్ని భావనలకూ ప్రతీకలుగా ఉండేవి. వీటిలో అచ్చులుండేవి కావు కనక వీటిని ఎలా ఉచ్చరించేవారో మనకు తెలియదు. ఎడమ వైపు గీసిన గుర్తుల ఆధారంగా చదివేవారికి సందర్భమూ, ఉచ్చారణా తెలుస్తూ ఉండేవి. సుమేరియన్, ఈజిప్ట్, మధ్య అమెరికా నాగరికతల్లో వేటికవిగా రూపొందిన ఈ లిపులన్నిటిలోనూ మొదట బొమ్మలు సరిగా గీసినా, రానురాను అవి రేఖా మాత్రపు సూచకాలుగానే రూపొందాయి. ఈనాటికి ఏలిపిలోనైనా అక్షరపు స్వరూపానికి స్వతహాగా అర్థమేమీ ఉండదు. వంకరటింకర గీతలన్నీ ఏయే అక్షరాలకు ప్రతీకలో తెలిశాక ప్రజలువాటిని చూడగానే పోల్చుకుని చదవడం, ఆ శబ్దాలను బట్టి భావాన్ని అర్థం చేసుకోవడం జరుగుతోంది.

క్రీ.పూ. 1300 ప్రాంతాల చైనాలో స్వతంత్ర పద్ధతిలో మొదలైన లిపిలో శబ్దాలను సూచించే మూడు నాలుగువేల గుర్తులుంటాయి. మెక్సికోలో రాసే పద్ధతులు క్రీ.పూ. 600కు మునుపే మొదలైనట్టుగా తెలుస్తోంది. ఈ విధంగా అక్కడక్కడా మొదలైన లిపులు కూడా తక్కిన సాంస్కృతిక అంశాలలాగే భౌగోళిక పరిస్థితులకూ, అవరోధాలకూ లోనవుతూ వ్యాప్తి చెందగలిగాయి. మధ్యధరా సముద్రంలో క్రీట్ దీవిలో మొదలైన అక్షరాస్యత పసిఫిక్‌లోని టోంగా దీవిలో రూపొందలేదు. పశ్చిమాసియాలో మొదలైన లిపులు అరేబియాకూ, ఇథియోపియాకు వ్యాప్తి చెందగలిగాయి కాని మెక్సికో నాగరికతలోని లిపి పద్ధతులు దక్షిణ అమెరికాకు అందలేదు.

నాగరికతలు లిపులనూ, లిపులు నాగరికతలనూ ప్రభావితం చేసుకున్నాయి. మొదట్లో ఇదంతా పాలక వర్గాలకే పరిమితం అయినా వీటివల్ల ప్రజల జీవితాలు త్వరితమైన మార్పులు చెందడంతో చరిత్ర ఎన్నో మలుపులు తిరిగింది. పంతొమ్మిదో శతాబ్దంలో ప్రపంచపు ప్రాచీన లిపులను పరిశీలించిన యూరోపియన్ పరిశోధకులు తమ లిపులను పోలినవాటిని ఉన్నతమైనవిగానూ, తేడాగా ఉన్నవాటిని తక్కువ రకంగానూ పరిగణించేవారు. లిపులన్నీ మెసిపొటేమియాలో మొదలైన అక్షరాల నుంచి పుట్టుకొచ్చినవే అని అనేవారు. తరవాతి పరిశోధనల్లో ఇరాన్, చైనాల మధ్య ఉన్న విశాల ప్రాంతంలో మధ్యస్తంగా అనిపించిన లిపుల దాఖలాలేవీ దొరకలేదు. మధ్య అమెరికాలో దొరికినదాన్ని అసలు లిపిగానే అంగీకరించని వైఖరిని తరవాతి కాలంలో సరిదిద్దుకున్నారు. ఈజిప్ట్‌లోనూ, సింధునది ప్రాంతంలోనూ తలెత్తిన రచనాపద్ధతులు స్వతంత్రమైనవిగా అనుకోవడం మొదలైంది. ఇప్పటి దృక్పథం మారడంతో అక్షరాస్యత ఏ మాత్రమూ లేని సమాజాలు కూడా ఉన్నతమైన నాగరికతను సాధించాయని ఒప్పుకుంటున్నారు.

మాటలను పలకడం, రాయడం అనేవి వేరువేరని ఈనాడు ఎవరూ భావించరు గాని ఇది కొన్ని శతాబ్దాల తరబడి జరిగిన పరిణామాల ఫలితమే. ◆

*మహిళా సంఘాల అధ్యయనం చేయకుండా మహిళా ఉద్యమ చరిత్రను సరిగ్గా నిర్మించలేమనీ, దాని స్వభావాన్ని అంచనా వేయలేమనీ అంటున్నారు* **ఎస్. మహబూబ్ బాషా**

# వలసాంధ్రలో స్త్రీల సంఘాలు : వివాదాస్పద 'శ్రీ విద్యార్థిని సమాజ' కథ

*(... గత సంచిక తరువాయి)*

**5**

చీలిక వచ్చింతర్వాత సమాజం కళ్ళేపళ్ళె వెంకటరమణమ్మ, బాలాంత్రపు శేషమ్మ, దామెర్ల సీతమ్మల నాయకత్వం కిందికి వచ్చింది. 1911 సెప్టెంబర్ 27న సమాజం రిజిస్టర్ చేయబడింది. సమాజ లక్ష్యాలనూ, కార్యాచరణకు సంబంధించిన చట్టాలనూ స్పష్టంగా నిర్వచించడమైంది. కళ్ళేపళ్ళె వెంకటరమణమ్మ అధ్యక్షురాలుగానూ, బుర్రె వెంకట సుబ్బమ్మ ఉపాధ్యక్షురాలుగానూ, బాలాంత్రపు శేషమ్మ, దామెర్ల సీతమ్మలు కార్యదర్శినులు గానూ, మాడభూషి చూడమ్మ కోశాధికారిగానూ ('ధన సంరక్షకురాలు'), నడుపల్లి బుచ్చివెంకట సుబ్బమ్మ లైబ్రేరియన్‌గానూ ('పుస్తక భాండాగార సంరక్షకురాలు') ఎన్నికయ్యారు. వీరిని కలుపుకొని పదిహేడుగురు సభ్యులతో సమాజం రిజిష్టరయ్యింది[21]. వెంకటరమణమ్మ 1916 వరకు అధ్యక్షురాలుగా పనిచేసింది[22]. తర్వాత నాళం రాఘవమ్మ ఆ స్థానాన్నలంకరించింది[23]. 1940లలో సమాజం కోకా కృష్ణవేణమ్మ, వేముగంటి పాపాయమ్మల ఆధ్వర్యంలో నడిచింది. సమాజ సభ్యురాండ్ర సంఖ్య పెద్దగా లేదు; 1920 నాటికి యాభై మందికి మించలేదు. సభ్యురాండ్రు నెలకు ఎనిమిదణాల నుండి ఒక రూపాయి వరకు చందాలిచ్చేవారు. అంతేకాక పలుమంది ఫిలాన్‌త్రోఫిస్టులు విరాళాలనిచ్చేవారు. సమాజం సొంత భవనాన్ని నిర్మించుకోగలిగిందంటే ఆర్థిక స్థితి బాగానే ఉండిందను కోవచ్చు. ఎప్పటిలాగానే సమాజం వార సభలనూ, ప్రత్యేక సమావేశాలనూ, వార్షికోత్సవాలనూ జరుపుకోవటం, పలు ప్రాంతాల వారిని పిలిచి ఉపన్యాసాలిప్పించడం చేసేది.

సమాజం మరో ముఖ్యమైన ప్రత్యేకత 'హిందూ సుందరి' అనే సుదీర్ఘకాలం నడిచిన స్త్రీల పత్రికను జయప్రదంగా నిర్వహించడం. స్త్రీల సంపాదకత్వంలో వెలువడ్డ మొట్టమొదటి స్త్రీల పత్రిక అయిన 'హిందూ సుందరి'ని ఏప్రిల్ 1902లో సత్తిరాజు సీతారామయ్య ప్రారంభించారు. మధ్యమధ్యలో అప్పుడప్పుడు ఆగిపోతూ 1960ల వరకూ కొనసాగింది. ఇంత సుదీర్ఘకాలం కొనసాగిన స్త్రీల పత్రిక ఇదొక్కటే. సంపాదకురాలిగా వ్యవహరించడానికి ఏ స్త్రీ ముందుకు రాకపోవడంతో ప్రారంభంలో సీతారామయ్యే సంపాదకులయ్యారు. 1903 లో మధ్యనుంచి (మొదట) మొసలికంటి రమాబాయమ్మ, వెంపలి శాంతాబాయమ్మ (తర్వాత)లు సంపాదకురాండ్రుగా వ్యవహరించారు. 1907 చివరి నుండీ మే 1909 దాకా సుమారు ఒకటిన్నర సంవత్సరం ప్రచురణ ఆగిపోయింది. తర్వాత బాలాంత్రపు శేషమ్మ, మాడభూషి చూడమ్మల ప్రోత్సాహ ప్రోద్బలాలతో 1909 జూన్ నుండి సీతారామయ్య పత్రిక ప్రచురణను పునఃప్రారంభించారు. జూన్ 1913 నుండీ పత్రిక కాకినాడ విద్యార్థినీ సమాజ ఆధ్వర్యంలో వెలువడ్డం ప్రారంభమై, పత్రిక కార్యాలయం కంతేరు నుండి కాకినాడకు మారింది. మాడభూషి చూడమ్మ, కళ్ళేపళ్ళె వెంకరమణమ్మలు సంపాదకురాండ్రయ్యారు; బాలాంత్రపు శేషమ్మ 'మేనేజరు'. 1940లలో శేషమ్మ సంపాదకురాలు కాగా, వేముగంటి పాపాయమ్మ గౌరవ కార్యదర్శిని అయ్యింది. 'హిందూ సుందరి'ని విద్యార్థినీ సమాజము నోటిముక్క (మౌత్‌పీస్)గా చెప్పవచ్చు.

స్త్రీలకు సంబంధించిన ప్రతి విషయాన్నీ హిందూ సుందరి చర్చించింది. స్త్రీ విద్య అవశ్యకతను గూర్చీ, బాల్య వివాహముల వలన కలిగెడి అరిష్టాల గూర్చీ. హిందూ వితంతువుల దురవస్థ గూర్చీ కుప్పలు తెప్పలుగా వ్యాసాలు ప్రచురించబడ్డాయి. వితంతు సమస్యను గూర్చీ ఇంతగా పట్టించుకున్న స్త్రీల పత్రిక ప్రారంభంలో మరేదీ లేదు. నిర్బంధ వితంతు శిరోముండనాన్ని ఆటవిక చర్యగా వర్ణిస్తూ హిందుసుందరి మొదటి సంపాదకురాలైన మొసలికంటి రమాబాయమ్మ 'వితంతు శిరోముండనమునకు గూర్చిన మహజరు' ను తయారుచేసి, స్త్రీల సంతకాలను సేకరించి ఆంగ్ల ప్రభుత్వానికంపింది. నిర్బంధ వితంతు శిరోముండనమునకు పాల్పడ్డవారిని శిక్షించే విధంగా వితంతు పునర్వివాహ శాసనం – 1856కు సవరణ చేయాలని కోరింది[24]. కానీ వితంతువులకు పునర్వివాహము చేయాలని సూటిగా చెప్పిన వ్యాసాలు మనకు హిందూ సుందరిలో పెద్దగా కన్పించవు. ఎక్కువ శాతం వ్యాసాలన్నీ ఎంతసేపూ వితంతువులకు విద్యాబుద్ధులు చెప్పి బాలికా పాఠశాలల్లో వారిని ఉపాధ్యాయినులుగా నియమించాలనీ, ఇష్ట మున్న వారు పునర్వివాహం చేసుకోదలుచుకుంటే ఎవరూ అభ్యంతరం పెట్టకూడదని వాదించాయి. స్త్రీ విద్యకు అత్యధిక ప్రాధాన్యత ఇవ్వబడింది.

స్త్రీ సమాజాలకు సంబంధించిన సమాచారాన్నందజేసే సత్సం ప్రదాయం 'హిందూసుందరి' కుండేది. వివిధ మహిళా సంఘాల కార్యక్రమాలు, వివిధ సభలు, సమావేశాల్లో స్త్రీలు చేసిన ప్రసంగ పాఠాలూ ప్రచురించేది. విద్యార్థినీ సమాజం ద్వారా ప్రచురించబడ్డం చేత సహజంగానే ఆ సమాజ విశేషాలన్నీ ప్రాధాన్యతతో ప్రచురించబడ్డాయి. పండిత రమాబాయి, భండారు అచ్చమాంబ, స్వర్ణకుమారిదేవి మొదలగు ప్రముఖ స్త్రీల జీవిత విశేషాలను ఛాయాచిత్రాలు సహా ప్రచురించేది. 'వర్తమానములు', 'వార్తావళి' అనే శీర్షికల కింద సంఘ సంస్కరణాంశాలకు చెందిన వివిధ వార్తలను ప్రముఖంగా ప్రచురించేది.

1940లలో 'హిందూసుందరి' క్షీణించినట్లు కనపడుతుంది. సైజు 24 పేజీలకు కుదింపబడడమే కాకుండా ప్రచురించిన కంటెంట్‌లో కూడా మునపటి గాఢతను కోల్పోయింది. ముందు ఎక్కువ శాతం రచనలు స్త్రీలవి కాగా చివరికి వారి సంఖ్య బాగా తగ్గిపోయింది. వేముగంటి పాపాయమ్మ ఈవిషయమై బాధను వ్యక్తం చేస్తూ స్త్రీలు 'హిందూసుందరి'లో శ్రద్ధ చూపించడం లేదనీ, ఉన్న స్త్రీల పత్రిక (హిందూసుందరి)ను అభివృద్ధి చేయకుండా కొంతమంది స్త్రీలు గొప్పకోసం మూన్నాళ్ల ముచ్చటగా మిగిలిపోతున్న స్త్రీల పత్రికలను రోజుకొకటి ప్రారంభిస్తున్నారనీ, అనేక బాలికాపాఠశాలలు 'హిందూసుందరి'ని గ్రహిస్తున్నప్పటికీ ఉపాధ్యాయినులెవరూ 'హిందూసుందరి' కి వ్యాసాలు రాయడం లేదని వాపోయింది[25]. ఇవన్నీ హిందూసుందరి క్షీణదశను సూచిస్తాయి.

ఏది ఏమైనప్పటికీ ఇరవయ్యవ శతాబ్ద ప్రారంభంలో, స్త్రీల పబ్లిక్ సెల్ఫ్ ఎక్స్‌ప్రెషన్ కోసమై వేదికలే కరువైనప్పుడు తమ భావాలను స్వేచ్ఛగా వ్యక్తీకరించుకోవడానికి హిందూసుందరి వేదికను కల్పించింది. స్త్రీల సమస్యలను చర్చించి వారిలో చైతన్యస్థాయి పెంచడానికి కృషి చేసింది. కొంతమంది స్త్రీలు పేర్కొన్నట్టుగా హిందూసుందరిలో రాస్తూ రాస్తూ పోగా చాలామంది స్త్రీలు మంచి రచయిత్రులుగా రూపాంతరం చెందారు. స్త్రీల ఆధ్వర్యంలోనే నడిచి సుదీర్ఘకాలం మనగలగడం కూడా, అప్పుడున్న పరిస్థితుల దృష్ట్యా, విశేషమే. అట్లూరి మురళి, వకుళాభరణం రామకృష్ణ మొదలగువారు వలసాంధ్రలో స్త్రీల చైతన్యం బూర్జువా పితృస్వామ్య భావజాల పరిధిలోనే ఉండిందన్నారు. కానీ హిందూ సుందరి, తదితర (గృహలక్ష్మి, ఆంధ్రమహిళ) మహిళా పత్రికల్లోని రచనలను దగ్గరగా పరిశీలిస్తే పితృస్వామ్య భావజాల ఇనుపచట్రాలను ఛేదించి, లక్ష్మణరేఖల్ని చెరిపివేయడానికి అవసరమైన చైతన్యస్థాయి చాలా మంది స్త్రీల కుండేదని స్పష్టమౌతుంది. ఉదాహరణకు ఈ పత్రికల్లో (ముఖ్యంగా గృహలక్ష్మి, ఆంధ్రమహిళలు) పురుష దురహంకారాన్ని ప్రశ్నించి స్త్రీలు పురుషుల కన్నా ఏ విధంగానూ తక్కువ కాదన్న రచనలూ, తనకిష్టమైన విద్యనభ్యసించే స్వేచ్ఛ స్త్రీ కుండాలన్న రచనలు, పురుషులతో సమానంగా స్త్రీలకు ఆస్తి హక్కును కోరినవీ, 'చెదలు పట్టిన హిందూ లాకు అంత్యక్రియలు' చేయాల్సిందేనని గర్జించిన రచనలూ, గృహహింసను, గూర్చి చర్చించనవీ, గృహాల్లో స్త్రీలు చేసే శ్రమను (డొమెస్టిక్ లేబర్) విలువైనదిగా గుర్తించి, వెలకట్టాలని డిమాండ్ చేసిన రాచనలూ, స్త్రీల అధోగతికి పురుషులే కారణమన్న రచనలూ అనేకం గోచరిస్తాయి. ఇంటి పనులు నిర్వహించే బాధ్యత స్త్రీలది మాత్రమే కాదనీ, పురుషుల బాధ్యత కూడా అని నొక్కి చెప్పాయి కొన్ని రచనలు. కుహనా పురుష సంస్కర్తల్లోని ద్వంద్వ ప్రమాణాల్ని కొన్ని రచనలు ప్రశ్నించి బహిర్గతం చేయగా, మరికొన్ని రచనలు సంఘ సంస్కరణోద్యమాన్ని స్త్రీలు తమ చేతుల్లోకి తీసుకోవాల్సిన ఆవశ్యకతను స్పష్టం చేశాయి. 1933 సెప్టెంబర్ 23న జరిగిన గోదావరి జిల్లా స్త్రీల మహాసభలో సారంగు సీతాదేవి మాట్లాడుతూ రాజా రాంమోహనరాయ్‌ల కాలంలో ప్రారంభమైన సంఘసంస్కరణోద్యమం ఇంతవరూ గుణాత్మక ఫలితాలు సాధించలేకపోయిందనీ, కారణం ఈ ఉద్యమం పురుషుల చేతుల్లో ఉండడమనీ, స్త్రీల స్థితుల్లో త్వరితగతిన మార్పులు తీసుకు రావాలంటే ఉద్యమం స్త్రీల చేతుల్లోకి రావాలనీ అన్నది[27]. అంటే పురుషుల మీద ఆధారపడకుండా స్త్రీలే తమ భవిష్యత్తును నిర్మించుకోవడానికి ఉద్యుక్తులవ్వాలని ప్రబోధించింది. 'గృహలక్ష్మి' పత్రికా సంపాదకులైన డా. కె.ఎన్. కేసరి (కోట నరసింహం) స్త్రీలు 'గృహలక్ష్మి'లో వెలిబుచ్చుతున్న రాడికల్ భావాలకు కలవలపడి పురుష దూషణ చేయడం మంచిది కాదనీ, సృష్టి ప్రకారం స్త్రీ, పురుషులు చేయాల్సిన పనులు వేర్వేరుగా ఉన్నాయనీ, కాబట్టి స్త్రీలు 'అసహజ హక్కులను' డిమాండ్ చేయకూడదనీ, పురుష దూషణ రాతలను మానుకోవాలనీ స్త్రీలకు 'హితవు' చెప్పాల్సిన పరిస్థితి వచ్చిందటే స్త్రీ చైతన్యస్థాయి ఎలా ఉండేదో సులభంగానే ఊహించవచ్చు[28]. ఇంతకీ ఇదంతా ఎందుకు చెప్పుకుంటునాం? 1930, 40 దశకాల్లోనూ, ఆ తర్వాతనూ స్త్రీల చైతన్యంలో రాడికల్ మార్పులు కలగడంలో హిందూసుందరి 10, 20 దశకాల్లో స్త్రీలకు కల్పించిన శిక్షణ ప్రాధాన్యత ను తెలుసుకోవడానికి. హిందూసుందరి కారణంగా క్రమంగా స్త్రీల చైతన్యస్థాయి పెరిగి, 1920ల నుండీ కలిగిన వివిధ ప్రభావాలతో కూడుకొని, 30, 40 దశకాల్లో స్త్రీలు 'రాడికల్' భావాలు ప్రకటించగలిగారు. అట్టి పత్రికను ప్రకటించిన విద్యార్థినీ సమాజం ప్రశంసార్హమైనది.

ఆంధ్రమహిళా మహాసభలను నిర్వహించడంలో విద్యార్థినీ సమాజం నాయకత్వ పాత్రను పోషించిందన్న విషయాన్ని ముందుగానే చెప్పుకున్నాం. మహిళా సభల నిర్వహణలో విద్యార్థినీ సమాజ నిర్వహించిన పాత్ర ఎంత ఏకఛత్రాధిపత్యంగా కన్పించిందంటే సత్తిరాజు శ్యామలాంబ, కలగర పిచ్చమ్మ లనే స్త్రీలు ఆంధ్రమహిళా మహాసభలు ఎంతసేపూ విద్యార్థినీ సమాజ నాయకత్వంలోనే ఎందుకు జరగాలని ప్రశ్నించేంతంగా ఉండింది[29]. విద్యార్థినీ సమాజపు బాధ్యులు ఎంత చురుకుగా ఉండేవారంటే కొంతమంది వారిని 'మరీ ఎక్కువ స్వేచ్ఛతో ప్రవర్తిస్తున్నారనీ, భర్తలను తిరస్కరిస్తున్నారనీ' అభాండం మోపారు. 1916 జూన్ 12న 'ఆంధ్రపత్రిక'లో 'ఆంధ్రవనితా రత్నము' అనే దొంగపేరుతో ఒకరు విద్యార్థినీ సమాజ సభ్యురాంద్రపై పలు అభాండాలు వేస్తూ, ప్రత్యేకంగా ఆచంట రుక్మిణమ్మను దూషించగా, 1916 ఆగస్ట్ హిందూసుందరిలో అలాంటి దుష్టరాత ఖండనార్థం సంపాదకీయమే రాయాల్సొచ్చింది. ఇవన్నీ విద్యార్థినీ సమాజపు ఇంటెన్స్ ఆక్టివిజమ్ ను నిరూపిస్తాయి / రూఢి చేస్తాయి.

తన లక్ష్యాల్లో పేర్కొన్నట్టుగానే విద్యార్థినీ సమాజం 'శ్రీ మహిళా విద్యాలయం' ('శ్రీ మహిళా సంస్కృత విద్యాలయం') అనే బాలికా పాఠశాలను 1913 సెప్టెంబర్‌లో ప్రారంభించింది. (పాఠశాల స్థాపన తేదీని గూర్చి సంశయముంది; 1945 సెప్టెంబర్ సంచిక 1923ను

స్థాపనా సంవత్సరం అని ఇవ్వగా, 1943 జూన్ సంచికలోని సంపాదకీయంలో 30 సంవత్సరాల క్రితం అని ఇవ్వబడింది, అంటే 1913 సరియైన సంవత్సరమౌతుంది). ముందు ప్రాథమిక పాఠశాలగా ప్రారంభమైన తర్వాత 'అడ్వాన్స్డ్ స్కూల్'గా మారింది. బాలికల్లో, ముఖ్యంగా వితంతువుల్లో విద్యావ్యాప్తి దీని ప్రధాన లక్ష్యం. 1943 నాటికి కొంతమంది బాలవితంతువులను కలుపుకొని 40 మంది విద్యార్థినులుండే వారు. పేద బాలికలకు ఉపకార వేతనాలిచ్చేవారు. 1944 నాటికి 5 మంది ఉపాధ్యాయులు ఉండేవారు. (ముగ్గురు పురుష పుంగవులు, ఇద్దరు స్త్రీలు); తర్వాత ఒక సంగీత టీచరును కూడా నియమించారు. విద్యాలయ బాలికల్లోని దువ్వూరి జానకీసీత మొదలగవారు హిందూసుందరిలో వ్యాసాలు రాసేవారు (సీత రాసిన 'ప్రాథమిక విద్య ప్రాముఖ్యత' అనే వ్యాసం 1945 ఫిబ్రవరి సంచికలో అచ్చైంది). ఆంధ్రా విశ్వవిద్యాలయం, దక్షిణభారత హిందీ ప్రచార సభ మున్నగు సంస్థలు నిర్వహించే పరీక్షల కోసం విద్యార్థినులను తయారు చేసేవారు. విద్యాలయం అభివృద్ధి పట్ల సంతృప్తి చెందిన ప్రభుత్వం గ్రాంటును రు. 315 నుండి రు. 484 కు (1945లో) పెంచింది.

రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయ స్ఫూర్తితో సమాజం కందుకూరి రాజ్యలక్ష్మమ్మ (వీరేశలింగం పంతులు ఈవిడగారి భర్త) పేరు మీద 'రాజ్యలక్ష్మీ పుస్తక భాండాగారం' అనే లైబ్రరీని స్థాపించింది. (1910లోనే ప్రారంభమైన లైబ్రరీ 1916 నుండి ప్రస్తుత నామంతో వ్యవహరించబడ్డది). గ్రంథాలయ నిర్వహణకై కార్యనిర్వాహక సంఘ సభ్యుల నుండి ఇద్దర్ని నియమించడం జరిగింది. ఆగస్ట్ 1913 నాటికి 400గా ఉన్న పుస్తకాల సంఖ్య, జూన్ 1914 నాటికి 450కీ, ఏప్రిల్ 1945 నాటికి 1068కీ పెరిగింది. గ్రంథాలయంలో పుస్తకాలతో పాటుగా పలు పత్రికలుండేవి. 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' తను ప్రచురించిన పుస్తకాలను డోనేట్ చేసింది. గ్రంథాలయాన్ని సమాజ సభ్యురాండ్రే కాక కాకినాడ పట్టణంలోని స్త్రీలు కూడా ఉపయోగించు కునేవారు. ఈ విధంగా సమాజం గ్రంథాలయ ఏర్పాటు ద్వారా స్త్రీలలో పఠనాభిరుచిని కల్గించి, పెంచి, చైతన్యకారకమైంది.

ఇక విద్యార్థినీ సమాజ స్వభావాన్నీ, వలసాంధ్ర మహిళోద్యమంలో అది పోషించిన పాత్రనూ, దాని పరిమితులనూ అంచనా కట్టే ప్రయత్నం చేద్దాం. ఇరవయ్యవ శతాబ్దంతో పాటే ప్రారంభమైన ఈ సమాజం అర్ధ శతాబ్దానికి పైగా కొనసాగిందన్న విషయాన్ని ముందే చూశాం. దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గా ప్రముఖమైన గుమ్మడిదల దుర్గాబాయమ్మ ప్రారంభించిన 'ఆంధ్రమహిళా సభ' తర్వాత చెప్పుకోదగ్గ సమాజమిదే. స్త్రీల పత్రికనూ, పాఠశాలనూ, పెద్ద లైబ్రరీని నడపడం, 'ఆంధ్రమహిళా మహాసభ'లను ఏర్పాటు చేయడంలో నాయకత్వ పాత్రను పోషించడం లాంటి బహుళ కార్యక్రమాలను ఏకకాలంలో చేసిన సమాజం కూడా ('ఆంధ్రమహిళా సభ' తర్వా) ఇదే. గుణాత్మకంగా పనిచేస్తూ సుదీర్ఘకాలం మనగలుగడమనేది దీనికీ, ఇతర సమాజాలకు ఉన్న ప్రాథమిక వ్యత్యాసం. విద్యార్థినీ సమాజ పునరుద్ధరణ ద్వారా వలసాంధ్రలోని స్త్రీల సమాజాలకు నిర్దిష్టమైన రూపమేర్పడినట్లైంది. సమాజం రిజిష్టర్ చేయబడ్డమూ, స్పష్టమైన లక్ష్యాలనూ, ఆ లక్ష్యాల సాధనకు సుస్పష్టమైన కార్యాచరణను ఏర్పర్చుకోవడం, సమాజ నిర్వహణలో శ్రమవిభజన మొదలైనవన్నీ సమాజ విశిష్టతలు. పురుషుల మీద ఆధారపడకుండా తమ సమస్యల పరిష్కారార్థం స్త్రీలే సంఘంగా ఏర్పడి అనేక ఒడిదుడుకులనెదుర్కొంటూ కూడా సుదీర్ఘకాలం ప్రస్థానించడం అప్పటి పరిస్థితుల దృష్ట్యా అమోఘమైంది. స్త్రీ విద్య దగ్గర్నుండి, బాల్యవివాహములు, వితంతు పునర్వివాహం మొదలైన అనేక స్త్రీల సమస్యలను నిజాయితీగా చర్చించింది. వితంతు పునర్వివాహాన్ని గూర్చి చర్చించడానికి అనేక మహిళా సంఘాలు విపరీతంగా సంకోచిస్తున్న సందర్భంలో సమాజం తన నోటిముక్క అయిన 'హిందూ సుందరి' ద్వారా వితంతు వివాహాలను ప్రోత్సహించడమన్నది ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ విషయం. పునర్వివాహి తల మీద జరిగిన చర్చ కారణంగానే సమాజం చీలిపోయిందన్న విషయం ముందే చూసినాం మనం. సంస్కరణోన్ముఖంగా ప్రస్థానం సాగిస్తున్న స్త్రీలందరికీ, అంటే అభ్యుదయగాములైన స్త్రీలకు, చిరునామాగా ఈ సమాజం మనకు కన్పిస్తుంది.

వంటింటికీ, పడక గదికీ పరిమితమైన స్త్రీలను ఒకచోట చేర్చి, సంఘటిత పర్చి, సోదరీతత్వ భావాలను కలిగించడానికి ఒక వేదికయ్యింది విద్యార్థిని సమాజం. సమాజపు సమావేశాల్లో పాల్గొన్న స్త్రీలు తమకు సంబంధించిన వివిధ సమస్యలపై చర్చించడం, తమ వ్యాసాలను చదవడం, ఉపన్యసించడం, వివిధ విషయాలపై తీర్మానాలు చేయడం మొదలయిన కార్యకలాపాల వల్ల వారిలోని సంకోచం, బిడియం పోయి, ఆత్మవిశ్వాసం కలగడంచేత తర్వాతి కాలంలో వారిలో కొంతమంది అద్భుతమైన వక్తలుగా మారడం ప్రశంసించదగ్గది. ఈ విధంగా వివిధ విషయాల్లో సమాజం స్త్రీలకు శిక్షణాలయంగా పనిచేసింది. ఆంధ్రమహిళా మహాసభలను ఏర్పాటు చేయడంలో గణనీయమైన పాత్రను పోషించడం ద్వారా యావదాంధ్ర (వలసాంధ్ర) మహిళలను ఒక్కచోట చేర్చే బృహత్తర కార్యాన్ని కూడా చేపట్టింది. అనేక ఇతర స్త్రీ సమాజాల్లాగా కేవలం సభలు, సమావేశాలు, వార్షికోత్సవాలు జరపడం వరకు మాత్రమే కాకుండా క్రియాశీలక చర్యల ద్వారా మహిళోద్యమ నిర్మాణానికి తోడ్పడింది. ఇన్ని సుగుణాలున్నప్పటికీ సమాజంలో కొన్ని లోపాలు కూడా ఉన్నాయి.

సమాజం బహిరంగంగా అగ్రవర్ణ, ముఖ్యంగా బ్రాహ్మణ కుల స్వభావాన్ని కలిగి ఉండేది. సమాజం రిజిష్టరైన తర్వాత ఏర్పరచిన చట్టాల్లో మొట్టమొదటి చట్టమే వివక్షాపూరితంగానూ, అగ్రవర్ణ కండకావరంతోనూ ఉంది. మొదటి చట్టం ఇలా ఉంది "మాల మాదిగలు మొదలైన నీచజాతులలోని వారుగాక గౌరవనీయులగు సంసార స్త్రీలెల్లరూ సభ్యురాండ్రుగా జేర్చుకోనబడుదురు..."[30] ఈ కుల వివక్షను ఇతర స్త్రీలు తప్పుపట్టారు. ఏలూరులోని 'జనానా ప్రార్థనా సమాజాని'కి చెందిన సత్తిరాజు శ్యామలాంబ, కలగర పిచ్చమ్మలు రాసిన 'కాకినాడ స్త్రీ విద్యార్థినీ సంఘం వారికొక విన్నపము' అనే వ్యాసంలో (హిందూసుందరి, ఏప్రిల్ 1912, పు. 31–33) సమాజము అగ్రవర్ణ స్వభావాన్ని తూర్పారబట్టారు. వారి మాటల్లోనే –

"…. మొదటిది జాతి భేదము. గత సంవత్సరమీ సభ ప్రత్యేకంగా జరిగినది కావున, చాతుర్వర్ణ్య కులాంగనలే ఆహ్వానింపబడిరి. ఇప్పుడన్ననో, మండలసభతోపాటు జరుగనై యున్నది గనుక కాబోలు ఒక్క నీచ జాతులగు మాలమాదిగలు మొదలుగువారు మాత్రమే నిషేధింప బడుచున్నారు. నీచులగు మాల మాదిగలలో నట్టివారు సభకు వచ్చి

మాత్రమున మనకేమి కొరతగలుగును. వారిని అంటముట్టగూడని వారనిగదా యనుచున్నారు. మనకు వారి సహాయమక్కరలేనంత కాలము వారంటముట్టగూడని వారేకాని మన సంఘాభివృద్ధి కనుకూలమగు వ్యవసాయాదుల జేయుట మొదలగు కార్యములనట్లుంచి ప్రస్తుతము మన ప్రదేశముల యందలి ఘోషా హాస్పత్రులు మొదలగు ప్రదేశముల యందు వారు బరిచారికలుగా నుండి పరిశుద్ధులుగను, గౌరవనీయులు గను మహిళాలలామలకు సేవజేయుచున్నారను సంగతి మరచిరి కాబోలును. అదియునుగాక నిజమయిన దేశాభిమానులచే దేశాభివృద్ధికి జరుపబడు ప్రయత్నములలో నిమ్న జాత్యుద్ధరణము గూడ నంగీకరింప బడుచున్నది గదా! గత సభకు పునర్వివాహితుల రాకుండ నెంత యాప గలిగారో, నిప్పుడును తగినవారీసభకు రాతటస్థపడిన యెడల నంతయే – జరుగునని తలచుచున్నాము....".

అగ్రవర్ణ స్వభావముతో పాటుగా సమాజానికి మధ్యతరగతి స్వభావం కూడా ఉంది. సమాజం చర్చించిన విషయాలు, చేపట్టిన కార్యకలాపాలు ఈ విషయాన్నే రూఢిచేస్తాయి. ఈ విధంగా సమాజం సాధించతలపెట్టిన సోదరీతత్వము పరిపూర్ణ సోదరీ తత్వము కాకుండా ఫ్రాక్చర్డ్ సోదరీతత్వమైంది. దిస్ వాజ్ సర్టెన్లీ ఎ స్కార్ ఆన్ ది అదర్‌వైజ్ బీమింగ్ ఇమేజ్ ఆఫ్ ది ఆర్గనైజేషన్.

ఈ విధంగా కొన్ని సీరియస్ పరిమితులున్నప్పటికీ వలసాంధ్రలోని మహిళోద్యమానికి శ్రీ విద్యార్థినీ సమాజం అందించిన తోడ్పాటు సంస్మరణీయమైనది. ఇదీ విద్యార్థినీ సమాజం ఆసక్తికరమైన కథ.

## 6

### వలసాంధ్రలోని స్త్రీల సంఘాలు కొన్ని బ్రాడ్ అబ్జర్వేషన్స్

ఇరవయ్యవ శతాబ్ది ప్రారంభం నుండీ క్రమక్రమంగా స్త్రీలలో పెరుగుతూ వచ్చిన చైతన్యానికి ప్రతీకలుగా కళింగాంధ్రలోని అసికాను మొదలుకొని రాయలసీమ జిల్లాలవరకు అనేక మహిళా సంఘాలు ఉద్భవించాయి. ఆంధ్రేతర ప్రాంతలైన ఖరగ్‌పూర్ మొదలైన ప్రాంతాల్లో కూడా 'ఆంధ్రమహిళా సమాజము' లాంటి సంఘాలు ఏర్పడ్డం విశేషం. సంఘసంస్కరణోద్యమ ప్రభావం అధికంగా గల రాజమండ్రి, కాకినాడ, మచిలీపట్నం, గుంటూరు లాంటి పట్టణ ప్రాంతాలు మహిళా సంఘాల ఏర్పాటుకూ, అభివృద్ధికీ సారవంతమైన నేలను కలగజేశాయి. క్రమ క్రమంగా పలు గ్రామాల్లో కూడా సంఘాలేర్పడ్డాయి. కోస్తాంధ్రతో పోలిస్తే వలస రాయలసీమలో మహిళా సంఘాలు అతి తక్కువ సంఖ్యలో ఉండినాయి.

స్త్రీ సమాజాలనేర్పాటు చేసిన స్త్రీలు సాధారణంగా సంఘ సంస్కరణ నేపథ్యం కల కుటుంబాల నుండి వచ్చారు; తరువాతి కాలంలోనే సంస్కరణ నేపథ్యం లేని కుటుంబాల స్త్రీలు స్వతంత్రంగా సంఘాలనేర్పాటు చేయడం జరిగింది. సంఘాలన్నీ ఎలాంటి అపవాదూ లేకుండా, స్త్రీల చొరవవల్లనే ప్రారంభమై వారి అకుంఠిత దీక్ష ద్వారానే కొనసాగాయి. సంఘాలను స్థాపించిన, వానిలో చురుకైన పాత్రను పోషించిన స్త్రీలందరూ మధ్యతరగతి కుటుంబాలకీ, అగ్రవర్ణాలకీ చెందినవారు.

మోస్ట్ ఉమెన్స్ ఆర్గనైజేషన్స్ హాడ్ ఎ పాయిగ్‌నెంట్ బిగినింగ్. వివిధ రకలైన ఇబ్బందుల కారణంగా చాలా సంఘాలు ఎక్కువ కాలం మనలేకపోయాయి; కొన్ని సంఘాలు పుట్టిన సంవత్సరంలోనేనో, ఇంకొంత కాలం తర్వాతనో స్తబ్దమైపోయాయి. 'శ్రీ విద్యార్థినీ సమాజం' లాంటి కొన్ని సమాజాలు మాత్రమే దీర్ఘకాలం కొనసాగి మహిళోద్యమంలో క్రియాశీలక పాత్రను పోషించాయి. 'స్త్రీ సనాతన ధర్మ మండలి' లాంటి సంఘాలు దీర్ఘకాలం కొనసాగినప్పటికీ పరిగణించ దగ్గ ఫలితాలను సాధించ లేకపోయాయి.

ప్రారంభంలో సమాజాలన్నీ అతి చిన్నవిగానూ, సభ్యుల సంఖ్య అతి తక్కువగానూ ఉండేవి. ఉదాహరణకి బృందావనపుర స్త్రీ సమాజం ప్రారంభమైన నాలుగు సంవత్సరాల తర్వాత కూడా (1906లో) 20 మంది సభ్యులనే కలిగి ఉండేది. ముగ్గురు సభ్యులతో ప్రారంభమైన అసికా స్త్రీ సమాజంలో సెప్టెంబర్ 1903 నాటికి 13 మంది సభ్యులే ఉండేవారు. ఉన్న సభ్యులందరూ చురుకుగా పాల్గొనేవారు కాదు. ప్రారంభంలోని సమాజాలన్నీ కేవలం ఒకరిద్దరు స్త్రీల మీద ఆధారపడి ఉండి, ఒకవేళ ఆ స్త్రీ వేరే ఊరు వెళ్లిపోతే మూతపడిపోయేవి. హేలాపుర జనానా ప్రార్థనాలయం, బృందావనపుర స్త్రీ సమాజం మొదలైన వాటికి ఈ అనుభవం ఉంది.

*(మిగతా వచ్చే సంచికలో...)*

**అంత్యసూచికలు**

21. 'శ్రీ విద్యార్థినీ సమాజము, కాకినాడ', హిందూసుందరి, అక్టోబర్ 1914, పు. 1-6.

22. 'శ్రీ విద్యార్థినీ సమాజము, కాకినాడ', హిందూసుందరి, జూన్ 1916, పు. 5

23. హిందూసుందరి, జూన్ 1917, పు. 17

24. ఈ పిటిషన్ గూర్చి మొదట ఆమె 1904 మే హిందూసుందరిలో ప్రకటించింది. (పు. 75) మహజరు పూర్తి పాఠానికై చూడండి – మొసలిగంటి రమాబాయి, 'వితంతు శిరోముండనమును గూర్చిన మహజరు', హిందూసుందరి, జూలై 1904, పు. 146-153.

25. 'స్వ విషయము', ఫిబ్రవరి 1945, పు. 2; 'స్వవిషయము', జూలై 1941, పు. 2.

26. అట్లూరి మురళి, 'పర్‌స్పెక్టివ్స్ ఆన్ విమెన్స్ లిబరేషన్; ఆంధ్ర ఇన్ ద నైంటీన్త్ అండ్ అర్లీ ట్వంటీత్ సెంచరీస్', స్టడీస్ ఇన్ హిస్టరీ, 3, ఐ.ఎన్.ఎస్. (1987, పు. 97-120); వి. రామకృష్ణ, 'విమెన్స్ జర్నల్స్ ఇన్ ఆంధ్ర డ్యూరింగ్ ది నైన్టీన్త్ సెంచరి', సోషల్ సైంటిస్ట్, వాల్యూమ్ 19, నం. 5-6, మే-జూన్ 1991, పు. 80-87; పి. రామలక్ష్మి, 'డిస్సెంట్, ప్రొటెస్ట్ అండ్ మూమెంట్ ఎగైన్స్ట్ పేట్రియార్కి – విమెన్స్ రైటింగ్స్ ఇన్ మోడ్రన్ ఆంధ్ర', అధ్యక్షోపన్యాసం, ఆంధ్రప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్, సిల్వర్ జూబ్లి సెషన్, ఉస్మానియా విశ్వవిద్యాలయం, 19-21 జనవరి 2001.

27. గృహలక్ష్మి, నవంబర్ 1933, పు. 755.

28. గృహలక్ష్మి, జనవరి 1939, పు. 809

29. సత్తిరాజు శ్యామలాంబ, కలగర పిచ్చమ్మ, 'కాకినాడ శ్రీ విద్యార్థినీ సంఘము వారికొక విన్నపము', హిందూసుందరి, ఏప్రిల్ 1912, పు. 31-33.

30. హిందూ సుందరి, అక్టోబర్ 1914, పు.2

**టిబెటన్ల సమస్యకు ఇకనైనా సరైన పరిష్కారం కనుగోవాలని లేకుంటే కొసావర్లు మాదిరిగా టిబెటన్లు కూడా 'సొంత గొంతుక' వినిపించడం ఒక్కటే మార్గమని అంటున్నారు ఎ.వి.వి. ప్రసాద్**

# చైనా, సెర్బియాల దమనకాండ ఎంతకాలం?

కొసావో స్వాతంత్ర్య ప్రకటన, స్వాతంత్ర్యం కోసం టిబెట్ మరోసారి హింసాకాండతో దగ్ధంకావడం – గత నెలరోజులుగా ప్రపంచాన్ని కలవరపరచిన రెండు ప్రధాన సంఘటనలు. ఒకటి ఐరోపా ఆగ్నేయ ప్రాంతంలో ఉంటే, రెండవది తూర్పు ఆసియాలో ఉన్న చైనాలో దక్షిణ ప్రాంతాన ఉంది. నిజానికి – భౌగోళికంగా రెండు ప్రాంతాలకు ఎలాంటి సంబంధం లేదు. కాని అణచివేతలోను, దశాబ్దాలుగా జరుగుతున్న పోరాటంలోను పోలికలున్నాయి. చైనా ఆక్రమణకు గురై సొంత ఉనికిని, సొంత సాంస్కృతిక సంపదను కోల్పోయి తిరిగి స్వాతంత్ర్యం కోసం టిబెట్ పోరు సల్పుతుండగా, సెర్బియా నుంచి అణచివేతకు గురవుతూ, ఎన్నోసార్లు ప్రయత్నించి విఫలమైనా మొక్కవోని సంకల్పంతో కొసావర్లు ధైర్యంగా స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొని, ఇప్పుడు దాన్ని నిలుపుకొనడానికి కొత్త పోరాటం సాగిస్తున్నారు.

చైనా నుంచి తిరిగి స్వాతంత్ర్యం కోసం టిబెటన్లు అహరహం జరుపుతున్న పోరాటం సాధారణమైనది కాదు. అదే విధంగా సెర్బులనుంచి విడిపోయి అల్బేనియన్లు తమ ప్రాంతానికి స్వేచ్ఛ కోరుకోవడం కూడా అనౌచిత్యం కాదు. ఎవరి సాంస్కృతిక వ్యక్తిత్వం వారిది. విభిన్నమైన సాంస్కృతిక వారసత్వం ఉన్నప్పుడు స్వేచ్ఛ కోసం తపించడం, తమ సాంస్కృతిక సంపదను అభివృద్ధి చేసుకోవాలని పరితపించడం ఎంతమాత్రం అనౌచిత్యం కాదనే చెప్పాలి. అయితే అదే సమయంలో – భౌగోళికంగా గాని, సాంస్కృతికంగా గాని విభజన అవసరంలేని సందర్భంలో – ఒక ప్రాంతం 'వేర్పాటు'ను కోరుకోవడమూ, సహేతుకం కాదు.

ఈ నేపథ్యంలో – కొసావో స్వాతంత్ర్య ప్రకటన ఏ విధంగా చూసినా అసమంజసం కాదనే అనిపిస్తుంది. ఈ రెండు ప్రాంతాల్లోను (కొసావో, టిబెట్) స్వాతంత్ర్య పోరాటాలు ఏకబిగిన సాగడానికి ప్రధాన కారణం – సెర్బియా, చైనా మానవ హక్కుల ఉల్లంఘనలకు పాల్పడడమే. కొసావోలోని స్థానిక అల్బేనియన్ జాతివారు అధికంగా ఉన్న పార్లమెంట్ ఫిబ్రవరి 17న స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకుంది. అయితే అలా ప్రకటించడం ఏకపక్షమనీ, దానిని తాము గుర్తించబోమనీ, వెంటనే సెర్బియా ఆగ్రహాన్ని వెలిబుచ్చింది గానీ, కొసావో స్వాతంత్ర్యానికి అమెరికా మద్దతు ఇస్తుండడంతో – మళ్లీ సెర్బియా కొంత వెనకడుగు వేసింది. అయితే రష్యా అండ చూసుకొని సెర్బియా తిరిగి ఏ క్షణంలోనైనా దాడి జరిపి కొసావోను ఆక్రమించుకొనడానికి సిద్ధమవుతూనే ఉంది. కొసావో స్వాతంత్ర్యాన్ని సెర్బియా, రష్యా ఇలా పూర్తిగా వ్యతిరేకిస్తుండగా, అమెరికా, కొన్ని ముఖ్యమైన ఐరోపా దేశాలు సమర్థిస్తున్నాయి. టిబెట్, తైవాన్ సమస్యలతో సతమతమవుతొన్న చైనా మాత్రం గోడమీద పిల్లి వాటంగా ఉంది. రష్యాకు వ్యతిరేకంగా కొసావో స్వాతంత్ర్యాన్ని సమర్థిస్తే – సొంత కుంపటి రాజుకునే ప్రమాదం చైనాలో ఉంది. స్వయం పాలిత ప్రాంతమైన తైవాన్ దీవిపై సార్వభౌమాధికారం ఇప్పటికి చైనా అధీనంలోనే ఉంది. టిబెట్ స్వతంత్ర ప్రతిపత్తి కూడా పాక్షికమే. టిబెటన్ల ఆధ్యాత్మిక గురువు దలైలామా వింతపోకడలు, సుస్థిరమైన విధాన లోపం వల్ల చైనా ఇప్పటికీ అణచివేత విధానాన్నే అనుసరిస్తోంది. ప్రవాస జీవితం గడుపుతున్న దలైలామా టిబెట్ స్వాతంత్ర్యం కోసం ఒకసారి డిమాండ్ చేయడం, మరోసారి స్వతంత్ర ప్రతిపత్తి చాలునంటూ ప్రకటించడం ఆయన సిద్ధాంత వైరుధ్యాలను స్పష్టం చేస్తోంది. ఈ పరిస్థితులలో చైనా ఎప్పటిలాగే టిబెట్‌లో 'పోరాట జ్వాలలు' ఎగసిపడినప్పుడల్లా వాటిపై నీళ్లు చల్లుతూ ఆర్పివేస్తోంది. అలా గత ఐదు దశాబ్దాలుగా టిబెటన్లు పరపీడనలో మగ్గుతూనే ఉన్నారు.

కొసావో స్వాతంత్ర్యానికి మద్దతు ఇవ్వడంతో ఐరోపా దేశాలు ఐక్యరాజ్యసమితి 1244 తీర్మానాన్ని ఉల్లంఘిస్తున్నట్లుగా సెర్బియా ఆరోపిస్తోంది. అయితే అందులో వాస్తవం ఎంతమాత్రం లేదనే చెప్పాలి. ఒక ప్రాంతం భౌగోళికంగా మరో ప్రాంతం నుంచి విడిపోవాలను కొన్నప్పుడు మెజారిటీ స్థానిక ప్రజల మనోభావాలకు తగినట్లుగా వ్యవహరించాలనే ఆ తీర్మానం చెబుతోంది. దాని ప్రకారం కొసావర్లు స్వాతంత్ర్యం కోరుకోవడంలో ఎటువంటి తప్పులేదు. ప్రస్తుతం స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్న కొసావోలో సెర్బుల సంఖ్య చాలా తక్కువ. ఆ ప్రాంతంలోని మొత్తం జనాభా కేవలం రెండు లక్షలు కాగా, అందులో 90 శాతం అల్బేనియన్లు ఉండగా, సెర్బులు పది శాతం మాత్రమే ఉన్నారు.

అఖండ యుగోస్లావియా సమాఖ్యలో అంతర్భాగమైన అనేక ప్రాంతాలు విచ్ఛిన్నమయ్యే ప్రక్రియ నిజానికి గత పదిహేడు సంవత్సరాలుగా కొనసాగుతూనే ఉంది. గత సంవత్సరం ఎనిమిది లక్షల జనాభా ఉన్న మాంటెనెగ్రో సెర్బియా నుంచి విడిపోయింది. 1991లో మాసెడోనియా, స్లొవేనియా, క్రొయేషియా యుగోస్లావియా

నుంచి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్నాయి. మరుసటి సంవత్సరం సెర్బియా కూడా ప్రత్యేక దేశంగా ఏర్పడింది. తర్వాత బోస్నియా, హెర్జెగోవినాలు కూడా విడిపోయాయి. 1992లో సాగిన అంతర్యుద్ధం ఫలితంగా బోస్నియన్ సెర్బ్‌లు తమ ఆధిక్య ప్రాంతానికి స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. ఆ తర్వాత జరిగిన డైటన్ శాంతి ఒప్పందం ఫలితంగా ముస్లిం – క్రోట్ సమాఖ్య, బోస్నియా – హెర్జెగోవినా ప్రత్యేకంగా ఏర్పడ్డాయి. ఆ సమయంలోనే మాంటెనెగ్రో, కొసావోలు కూడా స్వేచ్ఛా వాయువులకై ఉద్రిక్త పరిస్థితులు ఆరంభమయ్యాయి. అప్పట్లో మాంటెనెగ్రో అధ్యక్షుడుగా ఎన్నికైన మిలోజుకనోవిక్ – తనకు సెర్బియా నుండి విడిపోవాలని ఉన్నట్లుగా తొలిసారి బహిరంగంగా ప్రకటించారు. కొసావో స్వాతంత్ర్యం కోసం ఉద్భవించిన 'కొసావో లిబరేషన్ ఆర్మీ' కూడా అప్పటినుండి తన కార్యకలాపాలు ఉధృతం చేయడంతో ఆ ప్రాంతమంతా అల్లకల్లోలంగా మారింది. నాటో దళాలు ఎప్పటికప్పుడు అల్లర్లను, హింసాకాండను అణచివేస్తున్నా, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కోరుకునే గొంతుకలను ఎవరైనా ఎంతకాలం నొక్కి వేయగలరు? 2003 నాటికి సెర్బియా – మాంటెనెగ్రో ఒక యూనియన్‌గా సర్వాధికారాలతో ఏర్పడ్డాయి. తర్వాత మాంటెనెగ్రో కూడా గత సంవత్సరం సార్వభౌమాధికారాలతో విడిపోయింది.

ఇంతవరకు ఎన్నోసార్లు యుగోస్లావియా విభజనకు గురైనా అడ్డురాని అవరోధాలు ఇప్పుడు కొసావో స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొంటే ఎందుకు వస్తున్నాయనేది ఒక ప్రశ్న కాగా, కొసావో స్వాతంత్ర్యాన్ని సమర్థించే అమెరికా అదే సమయంలో పాలస్తీనా స్వాతంత్ర్యాన్ని ఎందుకు వ్యతిరేకిస్తున్నట్లు అన్నది మరో ప్రశ్న.

పాలస్తీనా సంగతి అలా ఉంచితే, సెర్బియన్ల నుంచి విడిపోయిన కొసావర్లకు మద్దతు ఇవ్వడంలో చైనా, రష్యాలు అనుసరిస్తున్న వింత పోకడలు – కొన్ని పరిశీలించవలసి ఉంది. ఈ రెండు దేశాలు ఐక్యరాజ్య సమితి భద్రతామండలిలో వీటో అధికారం ఉన్న శాశ్వత సభ్యదేశాలు. అమెరికా కూడా అంతే. ప్రాదేశికంగా సెర్బియాలో అంతర్భాగమైన కొసావోకు మద్దతు ఇస్తే రష్యాలో కూడా మరోసారి 'విభజన'కు అవకాశం కల్పించినట్లవుతుంది. సోవియట్ యూనియన్ విచ్ఛిన్నానంతరం అనేక రిపబ్లిక్‌లు అవతరించాయి. రష్యా బలం చాలావరకు తగ్గిపోయింది. అయినా అమెరికాకు అనేక విషయాల్లో గట్టి పోటీని ఇస్తూనే ఉంది. తమ దేశం మరిన్ని ముక్కలైతే అంతర్జాతీయంగా తమ ప్రాబల్యం క్షీణించవచ్చనే అభిప్రాయం రష్యాకు ఉండి ఉండవచ్చు. అంతేకాక సెర్బియా పటిష్ఠంగా ఉండవలసిన అవసరం ఆ దేశానికంటే రష్యాకు ఎక్కువ ఉంది. ఈ కారణాలన్నిటి వల్ల సెర్బియా నుంచి కొసావో విడివడడాన్ని రష్యా వ్యతిరేకిస్తోంది. ఇక అమెరికా వైపు నుంచి చూస్తే – కొసావో స్వాతంత్ర్యాన్ని రష్యా వ్యతిరేకించడమే అమెరికా మద్దతు ఇవ్వడానికి గల ప్రధాన కారణం. చైనా తటస్థంగా ఉంటోంది. అందుకు కారణం తనకు టిబెట్ సమస్య అంతర్గతంగా ఉండడమే.

కొసావో స్వాతంత్ర్యం ప్రకటించిన కొద్ది రోజులకే టిబెట్‌లో స్వాతంత్ర్య పోరాటం తిరిగి విజృంభించడం కాకతాళీయమే కావచ్చుగాని, అసలు ఎంత మాత్రం ప్రభావం లేదని కూడా చెప్పలేం. ఫిబ్రవరి 17న కొసావో స్వాతంత్ర్యం ప్రకటించుకోగా, మార్చ్ 10 నుంచి టిబెట్‌లో అల్లర్లు తిరిగి ప్రారంభమై నాలుగు రోజులు గడిచేసరికి లాసా అట్టుడికి పోయే పరిస్థితి ఏర్పడింది. ఆ అల్లర్లను అణచివేయడానికి చైనా యథాప్రకారం తన ఉక్కు పిడికిలిని మరోసారి బిగించింది. టిబెటన్ల వాదం ప్రకారం – ఈ అల్లర్లలో 100 మంది పైగా మరణించారా, లేక చైనా అధికారులు చెబుతున్న ప్రకారం పదిమందే మరణించారా అన్న సంఖ్య ప్రధానం కాదు. టిబెటన్ల స్వేచ్ఛా వాయువులను చైనా ఇంకా ఎంతకాలం ఇలా హరించి వేస్తుందన్నదే ఇప్పుడు అందరికి ఎక్కువ ఆందోళన కలిగిస్తున్న అంశం.

టిబెట్ సార్వభౌమత్వం చైనా అధీనంలో ఉన్నంత కాలం తమకు స్వేచ్ఛ ఉండదన్నది టిబెటన్ల అభిప్రాయం. 1951లో జరిగిన ఒప్పందం ప్రకారం చైనా పాలనా వ్యవహారాల్లో మాత్రమే టిబెట్‌కు స్వతంత్ర ప్రతిపత్తి కల్పించింది. దీనితో కొత్త వివాదం మొదలైంది. 1959 నాటికి అది ఉద్యమ రూపం దాల్చి ఉవ్వెత్తున ఎగసింది. దానిని అణచివేయడంలో చైనా పాలకులకు అమెరికా సంపూర్ణ మద్దతు ఇచ్చింది. కొన్ని వేలమంది టిబెటన్లు ఊచకోతకు గురయ్యారు కూడా. 14వ దలైలామా ఆ సందర్భంగానే టిబెట్ విడిచి ఇండియాలో ఆశ్రయం పొందారు. అప్పటినుండి దలైలామా అనేక విధాలుగా టిబెట్ స్వాతంత్ర్యం కోసం చైనాతో చర్చలు జరపడానికి ప్రయత్నిస్తున్నా అవి ఒక కొలిక్కి రాలేకపోయాయి. అయితే దలైలామా వైఖరిలో కొంత మార్పు రావడం కూడా చర్చలు ఫలించపోవడానికి కారణమనే అభిప్రాయం ఉంది. పూర్తి స్వాతంత్ర్యం బదులుగా పరిమితులతో కూడిన స్వతంత్ర ప్రతిపత్తి చాలుననే అభిప్రాయానికి దలైలామా రావడం, అందుకు టిబెట్‌లోని ఇతర వర్గాలు అంగీకరించకపోవడంతో చర్చలకు ప్రతిసారి బ్రేక్ పడుతోన్నదని, షరతులతో కూడిన స్వతంత్ర ప్రతిపత్తికి దలైలామా అంగీకరించడానికి కారణం – చైనా నేతలతో కుమ్మక్కు అయ్యాడనే ఆరోపణలు కూడా ఉన్నాయి.

ఆగస్ట్‌లో జరగనున్న బీజింగ్ ఒలంపిక్స్‌కు ముందు టిబెట్‌లో తిరిగి కల్లోలం చెలరేగడం అంతర్జాతీయంగా ప్రభావం చూపవచ్చనే అభిప్రాయం ఉంది. దేశంలోని కొన్ని ప్రాంతాలు కల్లోలితమైన సమయంలో వివిధ దేశాలు పాల్గొనే ఒలంపిక్స్ వంటి అంతర్జాతీయ క్రీడల పోటీలు, వాటిలో పాల్గొనే వారికి భద్రత కరవు కావచ్చనే అనుమానం కలగడమూ సహజమే. ఈ పరిస్థితుల్లో టిబెట్ నాయకులతో చైనా నేతలు ఏదో ఒక విధంగా కొత్త ఒప్పందం చేసుకోవడమో, లేక మెజారిటీ టిబెటన్లు వాంఛిస్తున్నట్టుగా స్వాతంత్ర్యం ఇవ్వడమో చేయవలసి ఉంది. అయితే అంత తేలికగా చైనా అందుకు సిద్ధపడదు గనుక మధ్యేమార్గమైనా వెదుకవలసి ఉంది. చైనాలో మళ్లీ కొత్తగా అధికారం చేపట్టిన పాత నాయకత్వం జింటావో, వెన్‌జియా బావోలు టిబెటన్ల సమస్యకు ఇకనైనా సరైన పరిష్కారం కనుగొనకపోతే కొసావర్లు మాదిరిగా టిబెటన్లు కూడా 'సొంత గొంతుక' వినిపించడం మినహా గత్యంతరం కనిపించదు. కమ్యూనిస్టు చైనా ఇకనైనా సరైన విధంగా స్పందించడం అవసరం.

◆

తప్పనిసరి పదవీవిరమణను సవాల్ చేస్తూ బీహార్‌లో బ్యాంక్‌కు చెందిన నాలగవ తరగతి మాజీ ఉద్యోగి ముంద్రికా దూబే తదితరులు దాఖలు చేసిన పిటిషన్ పై సుప్రీంకోర్టు సంచలన తీర్పుఇచ్చింది. 'ఉద్యోగి పదవీవిరమణ చేయడం, లేదా సదరు ఉద్యోగి విధులలో కొనసాగించడం అనేది యజమాని విచక్షణకు సంబంధించిన అంశమని సుప్రీంకోర్టు పేర్కొంది. ఈ వ్యవహారంలో కోర్టులు జోక్యం చేసుకోబోవని తీర్పు చెప్పింది. 'ఉద్యోగి పదవీవిరమణ ఏ పరిస్థితిలో, ఏ సమయంలో చేయాలనేది యజమాని విచక్షణా పరిధిలోకి వస్తుంది' అని జస్టిస్ తరుణ్‌చటర్జీ, జస్టిస్ ఎన్.ఎస్. బేడీలతో కూడిన ధర్మాసనం ఫిబ్రవరి 22న ఈ కేసులో అభిప్రాయ పడింది.

మార్చ్ 7న త్రిపుర, మేఘాలయ శాసనసభ ఎన్నికల ఫలితాలు వెలువడ్డాయి. త్రిపురలో జరిగిన శాసనసభ ఎన్నికలలో వామపక్ష కూటమి వరుసగా నాలుగోసారి విజయం సాధించింది. మొత్తం 60 అసెంబ్లీ స్థానాలు ఉన్న త్రిపురలో సి.పి.ఎం. - 46 స్థానాలు, ఆర్.ఎస్.పి. - 2 స్థానాలు, సి.పి.ఐ. - 1 స్థానం, కాంగ్రెస్ - 10 స్థానాలు ఇతరులు - 1 స్థానం గెలుచుకున్నారు. మేఘాలయ శాసనసభ ఎన్నికలలో అధికార కాంగ్రెస్ ఏకైక పెద్ద పార్టీగా అవతరించినా, ఏ పార్టీకి స్పష్టమైన మెజారిటీ రాలేదు. మేఘాలయ శాసనసభలో 60 స్థానాలు ఉండగా, ఒక స్థానంలో ఎన్నిక వాయిదా పడింది. ఫలితాలు వెలువడ్డ వాటిలో కాంగ్రెస్ - 25, ఎన్.సి.పి. - 15, యునైటెడ్ డెమొక్రటిక్ పార్టీ - 11, బి.జె.పి. - 1, ఇతరులు - 7 స్థానాలు గెలుచుకున్నారు. మార్చ్ 8న నాగాలాండ్ శాసనసభ ఎన్నికల ఫలితాలు కూడా వెలువడ్డాయి. నాగాలాండ్‌లో డెమొక్రటిక్ అలయన్స్ ఆఫ్ నాగాలాండ్ (డాన్) అధికారం కైవసం చేసుకోంది. శాసనసభ 60 స్థానాలలో నాగాలాండ్ పీపుల్స్ ఫ్రంట్ - 26, ఎన్.సి.పి. - 2, బి.జె.పి. 2, ఇండిపెండెంట్లు - 6, కాంగ్రెస్ - 22 సీట్లు గెలుచుకున్నాయి. ఎన్.పి.ఎఫ్., ఎన్.సి.పి., బి.జె.పి., స్వతంత్ర అభ్యర్థులు నలుగురితో కలిపి డాన్ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. పార్లమెంట్, వివిధ రాష్ట్రాల శాసనసభ ఎన్నికలు సమీపిస్తున్న తరుణంలో ముఖ్యంగా అధికార కాంగ్రెస్ పార్టీని ఈ ఫలితాలు కలవరపెడుతున్నాయి.

దేశంలో నానాటికి ఆత్మహత్యలకు పాల్పడుతున్న వారి సంఖ్య పెరిగిపోతోందని జాతీయ నేరాల విభాగం పేర్కొంది. ఒక్క 2006లోనే దేశంలో 1,18,112 మంది ఆత్మహత్యకు పాల్పడ్డారని ఇటీవల తన నివేదికలో పేర్కొంది. చనిపోయిన వారిలో సగానికి పైగా కుటుంబ కలహాలు, తీవ్రమైన వ్యాధుల వలన ఆత్మహత్యలకు పాల్పడటు తెలుస్తోంది. వీటి వెనుక నిరుద్యోగం, నిరక్షరాస్యత, వ్యవసాయం గిట్టుబాటు కాకపోవడం, కనీస వైద్య సౌకర్యాలు అందకపోవడం లాంటి మౌలిక కారణాలు ఉండనే ఉన్నాయి.

ఫోర్బ్స్ సంస్థ ఏటా ప్రకటించే ప్రపంచ కుబేరుల జాబితాను మార్చ్ 6న ప్రకటించింది. తొలి పది మందిలో నలుగురు భారతీయులు ఉన్నారు. లక్ష్మీమిట్టల్ 45 బిలియన్ డాలర్ల ఆస్తులతో నాలగవ స్థానంలోను, ముఖేష్ అంబానీ 43 బిలియన్ డాలర్ల ఆస్తులతో ఐదవ స్థానంలోను, అనిల్ అంబానీ 42 బిలియన్ డాలర్ల ఆస్తులతో ఆరవ స్థానంలోను, కె.పి. సింగ్ (డి.ఎల్.ఎఫ్.) 30 బిలియన్ డాలర్ల ఆస్తితో ఎనిమిదవ స్థానంలో ఉన్నారు. వెయ్యిమంది బిలియనీర్ల జాబితాలో 42 శాతం మంది అమెరికన్లు కాగా మనదేశం నుంచి మరో 19 మంది కొత్తగా ఈ జాబితాలో చోటు సంపాదించారు. (మొత్తం 53 మంది). ఒకపక్కన కోట్లాది మంది తీవ్రమైన దారిద్ర్యంలో ఉంటే మరో పక్క అక్కడక్కడా ద్వీపాల్లా ఐశ్వర్యం ఇలా మేట వేసి ఉంది.

కేరళలోని కన్నూర్ జిల్లాలోని థలసేరి నియోజకవర్గం పై ఆధిపత్యం కోసం బి.జె.పి. ప్రయత్నిస్తోంది. ఈ ప్రయత్నాన్ని అధికార సి.పి.ఎం. అడ్డుకోవడంలో భాగంగా బి.జె.పి., సి.పి.ఎం. పార్టీల మధ్య గొడవలు ప్రారంభమయ్యాయి. థలసేరి నియోజకవర్గంలో ప్రారంభమైన రాజకీయ కక్షల్లో మొదట సి.పి.ఎం. కు చెందిన కార్యకర్తను బి.జె.పి.కి చెందినవారు నరికి చంపగా, దీనికి ప్రతీకారంగా బి.జె.పి. కి చెందిన కార్యకర్తను సి.పి.ఎం. వారు హతమార్చారు. గత నాలుగు నెలల కాలంలో దాదాపు డజను మంది వరకు ఇరుపార్టీల కార్యకర్తలు హతులయ్యారు. దీనికి కొనసాగింపుగానే మార్చ్ 9న ఢిల్లీలోని సి.పి.ఎం. కేంద్ర కార్యాలయంపై బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్. లకు చెందిన కార్యకర్తలు దాడిచేశారు.

ఉత్తరప్రదేశ్‌ను బుందేల్‌ఖండ్, పూర్వాంచల్, పశ్చిమ ఉత్తరప్రదేశ్‌ల పేరిట మూడు రాష్ట్రాలుగా విభజించాలని ముఖ్యమంత్రి మాయావతి పునరుద్ఘాటించారు. మార్చ్ 15న బి.ఎస్.పి. వ్యవస్థాపకుడు కాన్షీరాం 74వ జయంతి సందర్భంగా లక్నోలో కార్యకర్తలను ఉద్దేశించి మాట్లాడుతు ప్రధాని మన్మోహన్ కు రాష్ట్ర విభజనకై లేఖ రాసినట్లు పేర్కొన్నారు. ఇదే విషయాన్ని విలేకరులు ప్రధాని వద్ద ప్రస్తావించగా 'విభజనకు సంబంధించి ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం నుంచి ప్రతిపాదన వస్తే కేంద్రం పరిశీలిస్తుం'దన్నారు.

యు.పి.ఎ. - వామపక్షాల అణుకమిటీ మార్చ్ 17న విదేశీ వ్యవహారాల మంత్రి ప్రణబ్ ముఖర్జీతో సమావేశమయింది. ఈ కమిటీ అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకున్నాకే అంతర్జాతీయ అణు ఇంధన సంస్థ (ఐ.ఎ.ఇ.ఎ.) బోర్డ్ ఆఫ్ గవర్నర్స్ సంతకానికి వెళతామని ప్రణబ్ హామీ ఇచ్చారు. ముఖ్యాంశాలు కాక ముసాయిదాను అందిస్తే తప్ప తమ అభిప్రాయాలను వెల్లడించలేమని వామపక్షాలు అన్న నేపథ్యంలో ఏప్రిల్‌లో మళ్లీ సమావేశం కావాలని నిర్ణయించారు. ◆

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంభైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే. (21 ఫిబ్రవరి 2008 నుండి 20 మార్చ్ 2008 వరకు)

| జిల్లా | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| హైదరాబాద్ | - | - | 48 | - | - | - | 25 | 16 | - | - | 43 | 45 | 9 | - | - | - | 4 | - |
| రంగారెడ్డి | 5 | - | 25 | - | - | - | 8 | 10 | - | 6 | 23 | 13 | 1 | - | - | - | - | - |
| మహబూబ్‌నగర్ | 4 | - | 29 | 3 | - | - | 11 | 3 | 2 | - | 39 | 23 | 2 | - | - | - | - | - |
| ఆదిలాబాద్ | 2 | - | 38 | 1 | - | - | 5 | 5 | - | 2 | 40 | 10 | 9 | - | - | - | 7 | - |
| వరంగల్ | 12 | - | 48 | - | - | - | 7 | 3 | 1 | 16 | 43 | 33 | 30 | - | - | - | 9 | - |
| శ్రీకాకుళం | - | - | 4 | - | - | - | - | - | - | - | 26 | 16 | 5 | 2 | - | - | - | - |
| విజయనగరం | 2 | - | 3 | - | - | - | 4 | - | - | - | 18 | 4 | 1 | - | - | - | 2 | - |
| తూర్పు గోదావరి | 1 | - | 28 | - | - | - | 6 | 9 | - | 16 | 60 | 38 | 14 | - | - | - | 4 | - |
| కృష్ణ | 1 | - | 21 | - | - | - | 3 | - | - | 4 | 24 | 13 | 1 | - | - | - | 3 | - |
| చిత్తూరు | 4 | - | 21 | - | - | - | 7 | 11 | - | 10 | 34 | 9 | 13 | - | - | - | - | - |
| *ఇతర జిల్లాలు | 19 | - | 5 | - | - | - | 1 | - | - | 2 | 1 | 14 | - | 4 | - | - | 1 | - |
| మొత్తం | 50 | - | 270 | 4 | - | - | 77 | 57 | 3 | 56 | 351 | 218 | 85 | 6 | - | - | 30 | - |

ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు : హైదరాబాద్ – డి. విజయభాస్కర్; ఆదిలాబాద్ – శ్రీమన్నారాయణ మూర్తి;
శ్రీకాకుళం – జి. సుధీర్; మహబూబ్‌నగర్ – ఏసురత్నం; చిత్తూరు – పలమనేరు బాలాజి; వరంగల్ – కె. శ్యాంరావు;
తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; కృష్ణ – బి. రమేష్‌బాబు; విజయనగరం – డి. సుధాకర్; రంగారెడ్డి – వి. శంకరయ్య
* ఇతర జిల్లాల పాక్షిక సమాచారం

## విడుదలైన రెండేళ్లలోనే ఆరవ ముద్రణ!

## మీ ఆత్మీయ స్పందనకు మా హృదయపూర్వక ధన్యవాదాలు

\- వీక్షణం పబ్లికేషన్స్




వెల
రూ.50/-

ప్రపంచబ్యాంక్ వంటి అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు పేద దేశాల అవసరాలు పెంచి, కొత్త అవసరాలు సృష్టించి ఆ అవసరాలు తీర్చుకునేందుకు ఇబ్బడిముబ్బడిగా అప్పులు ఇచ్చే కుట్ర, బహుళజాతి కంపెనీల ప్రయోజనాలు నెరవేర్చేందుకు ఉద్దేశించిన ఓ అంతర్జాతీయ కుట్ర ఇప్పుడు బట్టబయలైంది. 'ఎకనామిక్ హిట్‌మాన్' అనే ఆర్థిక దళారీలను నియమించి, అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రభుత్వాధినేతలను ప్రలోభపెట్టి, ఆ దేశాలను అమెరికన్ సామ్రాజ్యవాదానికి బంట్లుగా మార్చేసిన ఈ కుట్ర గుట్టు విప్పారు జాన్ పెర్కిన్స్. స్వయంగా ఎకనామిక్ హిట్‌మాన్‌గా పనిచేసి ఇప్పుడు చేతికంటిన సామాన్యుల రక్తాన్ని పశ్చాత్తాపంతో కడుక్కోవాలనుకుంటున్న పెర్కిన్స్ అంతరంగ కథనమే ఈ సంచలనాత్మకమైన పుస్తకం.

**కాపీలు లభించు షాపులు :**

**హైదరాబాద్ :** ప్రజాశక్తి బుక్‌హౌస్, విశాలాంధ్ర, దిశ పుస్తక కేంద్రం - చిక్కడపల్లి, సాహిత్య నికేతన్ - బర్కత్‌పుర, నవోదయా బుక్‌షాప్ - కోఠి, తెలుగు బుక్‌షాప్ - కోఠి, సహచర బుక్ మార్క్ - బాగ్‌లింగంపల్లి. కుశల పుస్తక కేంద్రం - బాగ్‌లింగంపల్లి.

**విజయవాడ :** ప్రజాశక్తి బుక్ హౌస్, మైత్రి బుక్‌హౌస్, సాహిత్య నికేతన్

**నెల్లూరు :** మణి బుక్‌స్టాల్ - సండే మార్కెట్, గుంటూరు - అష్టలక్ష్మి పుస్తక భండార్

విశాఖపట్నం, తిరుపతి, గుంటూరు. ఖమ్మం, హన్మకొండ, నల్గొండ } ప్రజాశక్తి బుక్ హౌస్, విశాలాంధ్ర

ఎం.ఓ / డి.డి. కింది అడ్రస్‌కు పంపి కూడా మీ కాపీ పొందవచ్చు.



**వీక్షణం పబ్లికేషన్స్**
3-6-394, మైత్రీ రెసిడెన్సీ, స్ట్రీట్ నెం.3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫోన్-ప్యాక్స్ : 040-6684 3495.

RNI Regn.No.APTEL/2003/11482 Published 01/04/2008 PRINTED BOOK





# వినూత్నం... విజయవంతం!

## ప్రతి పథకం ప్రజలకే సొంతం

**విజయవంతమవుతున్న పథకాలు**

| | | |
|---|---|---|
| జలయజ్ఞం | : | 1.30 లక్షల కోట్ల రూపాయలతో 1 కోటి ఎకరాల సాగు |
| ఇందిరమ్మ | : | ఏటా 20 లక్షల గృహాల నిర్మాణం. మొత్తం 80 లక్షల గృహాల నిర్మాణం లక్ష్యం. |
| ఇందిరాక్రాంతి పథకం | : | పావలా వడ్డీకే రుణాలు. మూడేళ్లలో 6,500 కోట్ల రూపాయలు పంపిణీ. 2008-09లో 10 వేల కోట్ల రుణాలు పంపిణీ లక్ష్యం. |
| రాజీవ్ గృహకల్ప | : | పట్టణ పేదలకు సొంత ఇల్లు. |
| ఉపాధి హామీ పథకం | : | 19 జిల్లాల్లో పేదలకు ఉపాధి, 36.50 లక్షల కుటుంబాలకు ప్రయోజనం. |
| ఇందిరప్రభ | : | 500 కోట్లతో అసైన్డ్ భూముల అభివృద్ధి |
| ఆరోగ్యశ్రీ | : | నిరుపేదలకు ఉచితంగా వైద్యం, శస్త్ర చికిత్సలు. 8 జిల్లాల్లో అమలు |





ఇవి... రాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్న వినూత్న పథకాల్లో ప్రముఖమైనవి. ప్రజల భాగస్వామ్యంతో అమలవుతున్న ఈ పథకాలు రాష్ట్రాన్ని హరితాంధ్ర ప్రదేశ్ వైపు నడిపించే దిశగా విజయవంతంగా అమలు జరుగుతున్నాయి.

## ఇందిరమ్మ రాజ్యం - ఇంటింటా సౌభాగ్యం

జారీచేయువారు: సమాచార, పౌరసంబంధాల శాఖ

R.O.No.976/Sou/Advt.I/2007-08

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, 1-9-1126/B, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao